మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రై మాసపత్రిక

అక్టోబర్ - డిసెంబర్ 2013

## బతికేదెట్టా ?

# ఐద్వా 10వ జాతీయ మహాసభలు

**22-25, నవంబర్, 2013 - బుద్ధగయా**




అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం జాతీయ మహాసభలు 2013 నవంబర్ 22నుండి 25వరకు బీహార్ రాష్ట్రంలోని బుద్ధగయాలో జరుగనున్నాయి. ఐద్వా మహాసభలు అఖిల భారత స్థాయినుండి గ్రామ స్థాయి ప్రాథమిక యూనిట్ వరకు ప్రతి 3స॥లకొకసారి నిర్వహించబడతాయి. గ్రామ, మండల, జిల్లా, రాష్ట్ర మహాసభలు ముగించుకుని దేశవ్యాప్తంగా 23 రాష్ట్రాల 1,11,68,139 సభ్యత్వానికి ప్రాతినిధ్యం వహిస్తూ 700మంది ప్రతినిధులు, 50మంది ఆహ్వానితులు మహాసభకు హాజరు కానున్నారు. నేటి సమాజంలో మహిళగా, పౌరురాలిగా, శ్రామికమహిళగా ఎదుర్కొంటున్న బహుముఖ సమస్యలు తీసుకొని పనిచెయ్యడంలో ఐద్వా ముందు పీఠిన నిలబడింది.

మహాసభల ప్రారంభ సభకు ముఖ్య అతిధిగా త్రిపుర రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీయుత మాణిక్ సర్కార్‌తో పాటు ఐద్వా జాతీయ నాయకులు శ్రీమతి బృందాకరత్, సుభాషిణి అలి, శ్యామలీగుప్తా, సుధా సుందరరామన్ తదితర నాయకులు పాల్గొంటున్నారు.

ముంచుకొస్తున్న మతోన్మాద ముప్పు, కనుమరుగవుతున్న ప్రజాస్వామ్య హక్కులు మహిళాభివృద్ధి తిరోగమనానికి దారితీసే పరిస్థితులను మహాసభ ఫోకస్ చెయ్యనుంది. అయా రాష్ట్రాలలో సమస్యలపై పోరాడి ధీరోదాత్తులుగా నిలబడి, మహిళా ఉద్యమానికే ప్రేరణగా నిలచిన 7గురు మహిళలు తమ అనుభవాలను మహాసభలో పాలుపంచుకోనున్నారు (కేరళ, హర్యానా, బెంగాల్, ఢిల్లీ, కర్నాటక, ఒడిసా, బీహార్).

బంగ్లాదేశ్, పాకిస్తాన్, నేపాల్, వెనిజులా తదితర దేశాల నుండి సౌహార్ద ప్రతినిధులు హాజరయి తమ దేశ మహిళల స్థితిగతులను, వారి పోరాటాలను మన అనుభవాలతో కలిపి మహాసభ వేదికపై కలబోసుకోవడానికి సన్నద్ధమవుతున్నారు.

నేటి మహిళా ఉద్యమం ముందున్న ప్రధాన సవాళ్ళను దృష్టిలో పెట్టుకుని మైనారిటీ మహిళలు, మతోన్మాదం, మీడియా- మహిళలు, జండర్ బడ్జెటింగ్, కార్పొరేటీకరించబడుతున్న విద్య, వైద్యం తదితర అంశాలపై ప్రత్యేకంగా కమిషన్లు వేసి మహాసభ చర్చించబోతోంది.

2010, 9-12 నవంబరులో కాన్పూర్‌లో జరిగిన గత మహాసభ నుండి నేటి వరకు ఈ 3సం॥ల కాలంలో ఐద్వా నిర్వహించిన కార్యక్రమాలు, పోరాటాలు, అనుభవాలు, ఫలితాలు సమీక్షించుకొని రాబోయే 3సం॥లకు లక్ష్యాలను ఈ మహాసభ నిర్దేశించుకోనుంది. మహిళ అస్తిత్వమే పెనుముప్పుగా మారిన నేటి పరిస్థితుల్లో బుద్ధగయలో జరుగుతున్న 10వ ఐద్వా జాతీయ మహాసభలు మహిళా ఉద్యమానికే దిశానిర్దేశం కావాలని ఆశిద్దాం!

**నయా ఉదారవాదాన్ని ఎదిరిద్దాం!**

**బూజుపట్టిన సాంప్రదాయాలపై పిడికిలెత్తి పోరాడదాం!**

**మతోన్మాదాన్ని తిప్పికొడదాం!!**

**హింసలేని సమాజం మా హక్కని ఎలుగెత్తి చాటాదాం!**

చైతన్య మానవి

# స్తంభించిన పాలన- పడకేసిన సమస్యలు

సంపాదకీయం...

రాష్ట్రంలో పాలన పూర్తిగా స్థంభించిపోయింది. రాష్ట్ర విభజనపై ప్రకటన చేసి కేంద్రప్రభుత్వం ఏకపక్షంగా ముందుకు సాగుతోంది. నిన్నటి వరకు ప్రత్యేక తెలంగాణ ఉద్యమాలతో సతమతమైన రాష్ట్రం నేడు సమైక్యాంధ్ర ఉద్యమాలతో వేడెక్కి పోయింది. సి.పి.యం. తప్ప రాష్ట్రంలో మిగతా రాజకీయ పార్టీలన్నీ అవకాశవాద వైఖరి అవలంభించి ఈ ఉద్యమం ద్వారా లబ్ధి పొందడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆ ప్రాంతంలో ఒకమాట, ఈ ప్రాంతంలో ఒకమాట చెప్తూ జనం సెంటిమెంట్‌తో ఆటలాడుకుంటున్నాయి. ప్రాంతీయ మనోభావాలతో ఉద్రేకంగా ఉన్న ప్రజలను రెచ్చగొడుతున్నాయి. మొదటినుండి నికరంగా, నిబద్ధతతో సమైక్యాంధ్ర ప్రదేశ్‌కు కట్టుబడి వున్న ఏకైక పార్టీ సి.పి.యం.

అధికార, ప్రతిపక్షపార్టీల రాజకీయ క్రీడల్లో ప్రజాసమస్యలు పూర్తిగా కనుమరుగయ్యాయి. సమస్యలనుండి ప్రజల దృష్టిని మళ్ళించడానికి ఈ ఉద్యమాలు, ఆందోళనలు పాలకవర్గానికి వరంగా మారాయి. కొనసాగుతున్న రాజకీయ అనిశ్చితి, పరిపాలనా స్తబ్దత, రూపాయి పతనం నేపథ్యంలో ఆకాశాన్నంటుతున్న నిత్యావసరాల ధరలతో వివిధ వర్గాల ప్రజలు బెంబేలెత్తుతున్నారు.

పెట్రోల్, డీజిల్ ధరలతోపాటు కూరగాయలు, ఉల్లి, వంటనూనెలు, బియ్యం, గ్యాస్ బండ ధరలు ఒక్కసారిగా అందనంతగా పెరిగి సామాన్యుడిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. సంక్షేమ పథకాలు మూలన పడ్డాయి. వృద్ధులు, వికలాంగులు, వితంతువులు పింఛన్ల కొరకు ఆఫీసులకు వెళితే వీరి గోడు వినేవారు లేక నానా ఇబ్బందులు పడుతున్నారు.

కిలో100రూ॥ పలుకుతున్న ఉల్లిధర ప్రజల కళ్ళల్లో నీరు తెప్పిస్తోంది. ఉల్లిపాయ కోసేటప్పుడు వచ్చే కన్నీరు, ఇప్పుడు చూడగానే వస్తుంది. సామాన్యుడి బడ్జెట్‌కు భారంగా మారింది. దీనికి సరఫరాలు తగ్గడం ఒక కారణమైతే బ్లాక్ మార్కెటింగ్‌తో పాటు ప్రభుత్వాలకు ముందుచూపు లేకపోవడం మరోకారణం.

నిత్యావసరాలు ఆకాశాన్నంటుతున్న సమయంలో ఆదుకోవాల్సిన ప్రజా పంపిణీ వ్యవస్థ పూర్తిగా అస్తవ్యస్థంగా మారింది. 185 రూ॥లకే 9 రకాల నిత్యావసర సరుకులు అందజేస్తామని ఆర్భాటంగా ప్రారంభించిన "అమ్మహస్తం పథకం" అభాసుపాలయ్యింది. పురుగులతో కూడిన చింతపండు, గోధుమపిండి, కల్తీ అయిన పసుపు, మిరప్పొడి తీసి చూసి "మాకొద్దు బాబోయ్ సరుకులు" అని మహిళలు తిరస్కరిస్తున్నారు. డి.డి.లు కట్టి సరకులు తెచ్చిన రేషన్ డీలర్లు ఏం చెయ్యాలో తోచక తల పట్టుకుంటున్నారు.

నగదు బదిలీ పేరుతో "డబ్బులు మీచేతికే" అంటూ కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన పథకం రాష్ట్రంలో వంటగ్యాస్ వినియోగ దారులను తీవ్ర ఆందోళనకు గురిచేస్తోంది. ఆధార్‌తో అనుసంధానమైన గ్యాస్ బండ వినియోగదారుడి పాలిట గుదిబండలా మారింది. గ్యాస్ రేట్ పెరిగి పోవడం, సబ్సిడి అకౌంట్‌లోకి చేరకపోవడం, ఆధార్ అందకపోవడం, వ్యాట్ భారం, ప్రభుత్వం సబ్సిడి ఎత్తివేయడం తదితర సమస్యలు వినియోగదారునికి కంటిమీద కునుకు లేకుండా చేస్తున్నాయి. నవంబర్ నుండి వంటగ్యాస్ ధరను చడీ చప్పుడు లేకుండా 62.50 పై ॥ పెంచింది. ఆధార్, గ్యాస్ ఏజెన్సీ, బ్యాంక్‌లతో అనుసంధానం పూర్తి అయ్యే వరకు, గతంలో కొనసాగించిన పద్ధతిలోనే సబ్సిడి గ్యాస్ సరఫరా చెయ్యడంతోపాటు సమస్యల పరిష్కారానికి "సింగిల్ విండోసెల్" ఏర్పాటు చేయాలి.

రాష్ట్ర వ్యాప్తంగా కురిసిన కుండపోత వర్షాలతో, పంట, ప్రాణ నష్టంతోపాటు అంటువ్యాధులు విజృంభిస్తున్నాయి. పారిశుద్యం పూర్తిగా పడకేసింది. డెంగ్యూ, చికున్ గున్యా, మలేరియా తదితర రోగాల బారినపడుతున్నారు. మహిళలపై దాడులు, హత్యలు, అత్యాచారాలు నిత్యకృత్యమైనాయి. రాష్ట్రం అసాంఘిక శక్తులకు, నేరాలకు నెలవైంది.

రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటికైనా కళ్ళుతెరిచి ప్రజాసమస్యలపై దృష్టి సారించాలి. సమస్యలతో సతమతమౌతున్న ప్రజలకు చేయూతనివ్వాలి. అస్తవ్యస్థంగా మారిన ప్రభుత్వ పరిపాలనను సరిదిద్దుకోవాలి. లేనిచో ప్రజా సహనమే కట్టలు తెగితే స్వార్థ రాజకీయ వేత్తలు, పార్టీలు హడలెత్తే పరిణామాలు తథ్యం.

సూక్తి: చదివితే, వింటే జ్ఞానం వస్తుంది! అయితే ఆచరిస్తే ఆ జ్ఞానానికి ప్రాణం వస్తుంది. - గాంధీ

# చైతన్య మానవి




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర కమిటీ**

చిరునామా:

బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.

e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు

**టి.జ్యోతి**

సంపాదక వర్గం

**మల్లు స్వరాజ్యం**

**అల్లూరి మన్మోహిని**

**ఎస్. పుణ్యవతి**

**కె. స్వరూపరాణి**

మేనేజర్

**ఎం.సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.**


## ఈ సంచికలో...

వ్యాసం

# రూపాయి విలువ పతనం



-జి.ఎస్. రాజేశ్వరరావు

మన రూపాయి రోజు రోజుకీ పడిపోతోంది. రూపాయి విలువ పతనంపై కథనాలు, వార్తా పత్రికల్లోనూ, టివి చర్చల్లోనూ రోజూచోటు చేసుకుంటున్నాయి. ఆర్థిక పరిణామాల గురించి పెద్దగా పట్టించుకోని వారిలో కూడా రూపాయి విలువ పడిపోవడమేమిటీ? ఈ రూపాయి విలువ నిర్ణయించే వాళ్ళు ఎవరు? దీని వలన లాభమా! నష్టమా! రూపాయి విలువ పడిపోకుండా ఉండాలంటే ఏంచెయ్యాలి? అన్న సందేహాలు సహజంగానే చాలా మందిలో తలెత్తుతున్నాయి.

**రూపాయి విలువ గురించి :** రూపాయికి 100 పైసలని మనందరికీ తెలుసు. ఇప్పటికీ ఇందులో ఏమార్పు లేదు. మరి రూపాయి విలువ పడిపోవడమంటే ఏమిటీ?

1) ఒక రూపాయితో వచ్చే సరుకులు ఎక్కువగా ఉంటే రూపాయి విలువ బలంగా ఉన్నట్లు, ఇంతకు ముందుతో పోల్చితే ఇప్పుడు తక్కువ సరుకులే వస్తే రూపాయి విలువ బలహీన పడినట్లు లేదా పడిపోయినట్లు.

2) అలాగే ఎన్ని రూపాయిలిస్తే ఒక డాలర్ వస్తుంది? అన్నదాన్ని బట్టి కూడా రూపాయి విలువ ఉంటుంది. నువ్వు తక్కువ రూపాయిలే ఇచ్చి ఒక డాలర్ పొందగల్గితే నీ రూపాయి బలంగా ఉన్నట్లు. అలాగాకుండా ఇంతకు ముందుతో పోలిస్తే నువు ఎక్కువ రూపాయిలిస్తేగాని ఒక డాలర్ రాకపోతే నీ రూపాయి విలువ పడిపోయినట్లు. అంటే పైన చెప్పినదాంట్లో మొదటిది దేశీయంగా రూపాయి కుండే విలువ. రెండవది అంతర్జాతీయ కరెన్సీ డాలర్‌తో పోల్చితే రూపాయికుండే విలువ.

**రూపాయివిలువ నిర్ణయించేదెవరు?**

ఎన్ని రూపాయిలిస్తే ఒక డాలర్ వస్తుందన్న విషయం, ప్రభుత్వంగాని, ఆర్‌బిఐగాని ఎవరూ నిర్ణయించరు. మార్కెట్‌లో డాలర్ల యొక్క సప్లై డిమాండ్‌లు బట్టి రూపాయి విలువ మారుతూ ఉంటుంది. డాలర్ల సప్లై ఎక్కువగా ఉంటే రూపాయి విలువ పెరుగుతుంది. అలా గాకుండా డాలర్లకు డిమాండ్ ఎక్కువగా ఉంటే రూపాయి విలువ పడిపోతుంది.

సప్లై డిమాండ్‌లపై ఆధారపడి, రూపాయి డాలర్ల మారకం జరిగే విధానాన్ని "ఫ్లోటింగ్ రేటు మెకానిజం" అంటారు. మన దేశంలో నూతన ఆర్థిక విధానాలు ప్రారంభం గాక ముందు, ఎన్ని రూపాయిలకు ఒక డాలర్ అన్న విషయాన్ని ప్రభుత్వం నిర్ణయించేది. దీనినే "ఫిక్స్‌డ్‌రేట్ మెకానిజం" అంటారు. 1993 నుండి ఫ్లోటింగ్ రేట్ మెకానిజం అమలులో ఉంది. అయితే అవసరమైనప్పుడు జోక్యం చేసుకొని పరిస్థితిని చక్కదిద్దే అధికారం ఆర్‌బిఐకి వుంది.

ప్రస్తుతం రూపాయి విలువ పడిపోవడానికి మన దేశంలో, అంతర్జాతీయ ద్రవ్యపెట్టుబడి ప్రయోజనాలకోసం 1991 నుండి అమలు అవుతున్న నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాలే కారణం.

**మొదటి కారణం :** అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి అవసరాల కోసం మన షేర్ మార్కెట్లను బార్లా తెరవడంతో విదేశీ పెట్టుబడులు యథేచ్చగా రావడం మొదలైంది. అయితే ఈ రకంగా వచ్చిన పెట్టుబడి నిలకడైనది కాదని మనకు తెలుసు. మన షేర్ మార్కెట్లో వచ్చే లాభంకన్నా ఇంకొక దేశంలో ఎక్కువ "రేట్ ఆఫ్‌రిటర్న్" ఉన్నట్లయితే మరుక్షణం ఆ దేశానికి వెళ్ళిపోతుంది.

2008లో అమెరికాలో బద్దలైన సంక్షోభం వలన ప్రజల కొనుగోలుశక్తి పడిపోవడం, అక్కడి కార్పొరేట్లు మునిగిపోవడంతో ఆర్థిక వ్యవస్థ

పునరుజ్జీవం కోసం అమెరికన్ ప్రభుత్వం "క్వాంటిటేటివ్ ఈజింగ్" (చూడుము వ్యాసం చివర బాక్సు-2) పేరుతో లక్షల డాలర్లు చలామణీలోకి తెచ్చింది. అలా తమ చేతికొచ్చిన డాలర్లను కార్పొరేట్లు అక్కడ పెట్టుబడి పెట్టడం మానేసి మన దేశంలాంటి దేశాల షేర్ మార్కెట్లలోకి వచ్చి మన కంపెనీల షేర్లను కొన్నారు. ఇటీవల అమెరికన్ ఫెడరల్ రిజర్వ్ ఛైర్మన్ బెన్‌బెర్నాంకే, "క్వాంటిటేటివ్ ఈజింగ్"ను త్వరలో ఆపేస్తామని ప్రకటించాడు. అలా చేస్తే ఆమెరికా బ్యాంకుల వడ్డీ రేట్లు గణనీయంగా పెరుగుతాయి. అందువలన ఎప్పుడైతే వడ్డీ రేట్లు అమెరికాలో పెరగబోతున్నాయని తెలిసిందో, ఆ మరుక్షణం నుండి అమెరికన్ ఎఫ్ఐఐలు, తమ దగ్గరున్న షేర్లన్నింటిని అమ్మేసి డాలర్లు అమెరికాకు పట్టుకుపోవడం మొదలు పెట్టారు. దీనితో మన దేశంలో డాలర్లకు డిమాండ్ పెరిగింది. ఎక్కువ రూపాయలిస్తే గాని ఒక డాలర్ లభించని పరిస్థితి తలెత్తింది. ఆరకంగా రూపాయి విలువ పడిపోవడం ఎక్కువయ్యింది. ఈ పరిస్థితులను సొమ్ము చేసుకోవడానికి మారక ద్రవ్య స్పెక్యులేషన్‌కు పాల్పడ్డంతో రూపాయి పరిస్థితి మరింత దిగ జారింది.

**ప్రభుత్వ వాదంలోని డొల్లతనం:** మన రూపాయి విలువ పతనమవడానికి అమెరికన్ ఫెడరల్ రిజర్వ్ బ్యాంకే కారణమని మన ప్రధాని మన్మోహన్‌సింగ్ పార్లమెంటులో తెలిపారు. రూపాయి విలువ పతనానికి బెర్నాంకే ప్రకటన కారణమైనా అది ఒకటే కారణమనడం సరికాదని మన వాదన.

**మన వాదన** : బెర్నాంకే ప్రకటన 22.5.13న వెలువడింది. కానీ మన రూపాయి విలువ అంతకు ముందు నుండే పతనమౌతోంది. కాబట్టి బెర్నాంకే ప్రకటనే అసలు కారణమనడం సరైనది కాదు. అలాగే బెర్నాంకే ప్రకటనే కారణమైతే రూపాయి విలువ పతనం, అమెరికన్ డాలర్‌కు పరిమితమవ్వాలి. కానీ మన రూపాయి విలువ, డాలర్‌తోనే గాక పౌండ్, ఏన్, యూరోలతో కూడా పడిపోతుంది. కాబట్టి ప్రభుత్వం చెప్పింది పాక్షిక సత్యమేనని అర్థమౌతుంది.

**రెండవ కారణం :** "ఎగుమతులను ప్రోత్సహించాలి. దిగుమతులను సడలించాలి" అన్నది 1991 నుండి అమలు అవుతున్న ఎగ్జింపాలసీ. గత 2,3 సంవత్సరాలుగా మన దిగుమతులు పెరుగుతుండగా ఎగుమతులు మాత్రం మందగించాయి. అమెరికా ఇతర అభివృద్ధి చెందిన దేశాలలో నెలకొన్న సంక్షోభం వలన అక్కడి ప్రజల కొనుగోలు శక్తి పడిపోవడమే మన ఎగుమతులు మందగించడానికి కారణం. మనం చేసుకున్న దిగుమతులకు డాలర్లలో చెల్లించాలి. ఎగుమతులు మందగించడంతో దేశంలోకి వచ్చే డాలర్లు సంఖ్య తగ్గిపోతోంది. దీని వలన చేసుకున్న దిగుమతులకు సరిపడా డాలర్లు లేకపోవడం వలన డాలర్లకు కొరత ఏర్పడి రూపాయి విలువ పడిపోతోంది. మనం చేసుకున్న దిగుమతుల్లో మనం ఉత్పత్తి చేసుకోగల్గినవి, ఉత్పత్తి చేసుకోలేనివి, మనకు అవసరమైనవి, మనకు అవసరం లేనివి అన్ని రకాలూ ఉన్నాయి. మన దిగుమతులలో ముడిచమురు వాటా 40శాతం కాగా బంగారం 20శాతంగా వుంది. మనం ప్రతి సంవత్సరము 135 మి.టన్నులు బొగ్గు దిగుమతి చేసుకుంటున్నాం. ఇవిగాక విదేశాల నుండి అన్ని రకాల విలాసవస్తువులూ ఇబ్బడిముబ్బడిగా వచ్చేస్తున్నాయి. 2012-13లో మనం దిగుమతి చేసుకున్న కొన్ని వస్తువుల వివరాలు దిగువ పొందుపర్చబడ్డాయి.

విదేశీ దిగుమతులు పెరిగి ఎగుమతులు మందగించడం వలన వాణిజ్యలోటు పెరుగుతోంది. వాణిజ్య లోటుతోబాటు మన కరెంట్ ఖాతా లోటు (సిఎడి) చూడుము బాక్స్-3) కూడా పెరుగుతోంది. ప్రస్తుతం మన సిఎడి జిడిపిలో 4.8 శాతంగా ఉంది. అదే సమయంలో 2013-14లో మొదటి త్రైమాసికానికి జిడిపి పెరుగుదల 4.4శాతంగా ఉంది. అంటే మన ఉత్పత్తి కన్నా లోటు ఎక్కువగా ఉంది. సిఎడి ఎక్కువగా ఉంటే మన పరపతి సన్నగిల్లుతుంది. మన ఆర్థిక వ్యవస్థపై విశ్వాసం సన్నగిల్లి ఇతర దేశాల నుండి పెట్టుబడులు రావడం ఆగిపోతుంది. కరెంట్ ఖాతా లోటు ఎక్కువగా ఉండటం వలన, దాన్ని పూడ్చుకోవడానికి మన విదేశీ నిల్వలు కూడా తరిగిపోతాయి. విదేశీ వస్తువులు మన దేశంలోకి వరద ప్రవాహంలా వస్తుండటం వలన, వాటి పోటీని తట్టుకోలేక మన పరిశ్రమలు మూతపడుతున్నాయి. దీనికి ఉదాహరణ బిహెచ్ఇఎల్. బిహెచ్ఇఎల్ ఉత్పత్తి చేసే పరికరాలు ఇతర దేశాల నుండి మన దేశంలోకి తక్కువ రేటుకు (అక్కడి

**2012 - 13 సం॥లో చేసుకున్న దిగుమతులలో కొన్ని (రూపాయిలలో)**

| | | | |
|---|---|---|---|
| ఆపిల్స్ | 1,152 కోట్లు | గడియారాలు | 1236 కోట్లు |
| లిక్కర్ | 1,150 కోట్లు | సుంగధ ద్రవ్యాలు | 2848 కోట్లు |
| ఆటబొమ్మలు | 1,232 కోట్లు | కెమేరాలు | 1880 కోట్లు |
| కాస్మెటిక్స్ | 2,173 కోట్లు | సిల్క్ | 1700 కోట్లు |
| ఛాకలెట్లు | 172 కోట్లు | కాలింగ్ బెల్లులు, చలవకళ్ళద్దాలు | 366 కోట్లు |
| టార్చ్‌లైట్లు, కార్లు | 3000 కోట్లు | పెన్నులు, మొబైల్స్ | 25,838 కోట్లు |
| బాత్‌రూం ఫిట్టింగ్స్, తాళం కప్పులు | 400 కోట్లు | కలర్ టీవిలు | 3411 కోట్లు |
| లాంటివి ఇంకా చాలా ఉన్నాయి | | | |

ప్రభుత్వాలు సబ్సిడీలు ఇస్తున్నాయి.) వచ్చేస్తుండటం వలన బిహెచ్ఇఎల్‌కు ఆర్డర్లు తగ్గి ఉత్పత్తి 50శాతం తగ్గించుకుంది.

3వ కారణం : కార్పొరేట్లు చేసిన విదేశీ అప్పు: 1991లో నూతన ఆర్థికవిధానాలు ప్రారంభమైనపుడు మన విదేశీ అప్పు 89 బిలియన్ డాలర్లు. ఇందులో ప్రభుత్వ వాటా 21శాతం కాగా మిగిలిన 79శాతం కార్పొరేట్లు చేసిన అప్పు. గత 6సం॥లలో 10అతిపెద్ద కార్పొరేట్ కంపెనీలు చేసిన అప్పు రూ. 6,31,024.07 కోట్లు. ఇందులో 40నుండి 70శాతం వరకు విదేశాల నుండి తెచ్చిన అప్పు. (రెండవ పట్టికలో చూడుము)

భారతీయ కార్పొరేట్ల అప్పు (కోట్ల రూ॥లలో)

| గ్రూప్ | 2006-07 | 2012-13 | వడ్డీ : ఆదాయం |
|---|---|---|---|
| రిలయన్స్ | 26,100 | 1,13,543.9 | 1:1.3 |
| వేదాంత | 9,500 | 99,610.8 | 1:3.6 |
| ఎస్సార్ | 24,600 | 98,412.8 | 1:0.9 |
| అదానీ | 4,400 | 81,122.0 | 1:1.1 |
| జేపి | 8,100 | 63,654.1 | 1:1.2 |
| జెఎస్‌డబ్లు | 13,200 | 41,575.0 | 1:2.0 |
| జీఎంఆర్ | 3,700 | 40,824.9 | 1:0.7 |
| లాంకో | 1,700 | 39,034.0 | 1:0.6 |
| వీడియోకాన్ | 6,300 | 27,283.4 | 1:0.2 |
| జి.వి.కె | 1,700 | 25,264.0 | 1:0.4 |
| మొత్తం | 99,300 | 6,31,024.7 | 1:1..4 |

(ఆధారం: క్రెడిట్ స్యూసీ ఈక్విటీ రిసెర్చ్)

సంస్కరణలలో భాగంగా కార్పొరేట్లు విదేశీ సంస్థల నుండి సం॥రానికి 500మిలియన్ల డాలర్ల వరకు ఆటో మేటిక్ రూట్‌లో అప్పు తెచ్చుకోవడానికి ఇంతకు ముందే ప్రభుత్వం అనుమతిచ్చింది. ప్రభుత్వం ఇప్పుడు దానిని 750 మిలియన్ల డాలర్లకు పెంచింది.

విదేశీ ఇసిబిలు (ఎక్స్‌టెర్నల్ కమర్షియల్ బారోయింగ్స్) చవగ్గా అప్పులిస్తున్నాయని, దేశంలోని అతి పెద్ద కంపెనీలు ఎగబడి తీసేసుకున్నాయి. ఇలా తీసుకున్న అప్పు మీద అసలు, వడ్డీ చెల్లింపులకోసం అవసరమైన డాలర్లకు డిమాండ్ పెరగడం వలన రూపాయి విలువ పడిపోతోంది. పై టేబుల్‌ను పరిశీలిస్తే, 5 కంపెనీల సాంవత్సరిక ఆదాయం అవి కట్టాల్సిన వడ్డీ కన్నా తక్కువ అని అర్థమౌతుంది.

**4వ కారణం:** మన దేశంలో అమలు అవుతున్న సంస్కరణలో భాగంగా ప్రభుత్వాలు పెట్టుబడిదార్లకు లక్షలకోట్లు రాయితీల రూపంలో ఇచ్చాయి. "అలా రాయితీలిస్తే పెట్టుబడిదార్లు ఉత్సాహపడి పెట్టుబడులు పెట్టి పరిశ్రమలు పెడతారు. ఎక్కువ మందికి ఉద్యోగాలు వస్తాయి. ఉత్పత్తి పెరిగి ధరలు తగ్గుతాయని" ప్రభుత్వాలు చెబుతూ వచ్చాయి. కానీ ఇవ్వాళ పరిస్థితి ఏమిటీ? పారిశ్రామికాభివృద్ధి గతంతో పోల్చితే (-) 1.6శాతంగా ఉంది. మన జిడిపిలో సింహభాగంగా ఉంటూ వచ్చిన సర్వీస్‌సెక్టర్ అభివృద్ధి కూడా 6శాతం మాత్రమే వుంది. ఇక వ్యవసాయం గురించి ఎంత తక్కువ చెప్పుకుంటే అంత మంచిది. రైతు కళ్ళల్లో నుండి కన్నీళ్ళు కాదు రక్తపు చుక్కలు వస్తున్నాయి!

ప్రభుత్వాలు పెట్టుబడిదార్లకు రాయితీలు ఇవ్వడమే గాక, పెట్టుబడిదార్లు కట్టాల్సిన లక్షలకోట్ల రూపాయలు పన్నుల్ని కూడా ప్రభుత్వం వదులుకుంటోంది. ఒక్క 2012-13 సం॥నికే పెట్టుబడిదార్లూ, సంపన్నులు పన్నులుగా కట్టాల్సిన 5,65,000 కోట్లు సొమ్మును ప్రభుత్వం వదులుకొందని ఈ సం॥ము బడ్జెట్‌ను పార్లమెంట్‌లో ప్రవేశపెడుతూ కేంద్ర ఆర్థిక మంత్రి స్వయంగా చెప్పాడు. ఒక లెక్క ప్రకారం, 500 అతిపెద్ద కంపెనీల వద్దనున్న క్యాష్ రిజర్వులు 9.3లక్షల కోట్లు రూపాయలు.

మరి ఇంతవోదాదులో ఉన్న డబ్బును పెట్టుబడిదార్లు ఏంచేసినట్లు? ఈ డబ్బంతా పరిశ్రమల్లో పెట్టి ఉంటే పారిశ్రామికాభివృద్ధి - 1.6శాతం ఎందుకు ఉంది? పెట్టుబడిదార్లకు దోచిపెట్టిన లక్షల కోట్లు పరిశ్రమలతో పెట్టుబడిగా పెట్టి ఉత్పత్తి చేసినా వాటిని కొనగలిగే స్థితిలో ప్రజలు లేరని పెట్టుబడిదార్లకు తెలుసు. అందుకే ఈ డబ్బంతా తీసుకువెళ్ళి తమ పెట్టుబడికి భద్రత ఉంటుందని క్రింది వాటిలో మదుపు పెట్టారు.

**1. బంగారం.**

**2. రియల్‌ఎస్టేట్.**

**3. డాలర్లు.**

బంగారంపై పెట్టుబడిదార్లు ఇన్వెస్టుచేయడం వలన బంగారం దిగుమతి పెరిగింది. ఒకప్రక్క దీనివలన డాలర్లకు డిమాండ్ పెరిగి రూపాయి విలువ పతనమౌతోంది. రెండోప్రక్క బంగారం రేటు దేశీయంగా విపరీతంగా పెరుగుతోంది. బంగారం కొనడంతోబాటు, పెట్టుబడిదార్లు తమ దగ్గరున్న డబ్బును డాలర్లు కొనడానికి ఉపయోగిస్తున్నారు. దీనివలన కూడా డాలర్లకు డిమాండ్ పెరిగి రూపాయి విలువ పతనమౌతోంది. ఏతావాతాచూస్తే రూపాయి విలువ పతనానికి, సరళీకృత ఆర్థికవిధానాలే కారణమని అర్థమౌతుంది.

**రూపాయి విలువ పతనం వలన పర్యవసాలు :** రుపాయి పతనం వలన విదేశాల నుండి దిగుమతి అయ్యే సరుకుల విలువ రూపాయిల్లో పెరుగుతుంది. ఉదాహరణకు గతంలో 1డాలర్=30

రూ॥లున్నప్పుడు విదేశాల నుండి 1డాలర్ ఖరీదు గల రెడీమేడ్ షర్టుకొంటే దాని ఖరీదు మనదేశంలో 30రూ॥లుగా ఉంటుంది. ఇవ్వాళ అదే డాలర్ ఖరీదు కల్గిన షర్టును కొంటే దాని ఖరీదు 63రూ॥లు అవుతుంది. ఎందుకంటే ఇవ్వాళ 1 డాలర్=63రూ॥లు కాబట్టి. అంటే విదేశంలో షర్టు ఖరీదు డాలర్లలో మార్పు లేకపోయినా రూపాయిల్లో మాత్రం 30నుండి 63రూ॥లకు పెరుగుతోంది. ఇంకోలా చెప్పాలంటే విదేశీ కాంపోనెంట్ ఉన్న ఏ వస్తువు ఖరీదైనా రూపాయిల్లో పెరుగుతుంది. మనం దిగుమతి చేసుకునే బొగ్గు, గ్యాస్ రేటు పెరిగితే కరెంట్ రేటు పెరుగుతుంది.

భారతదేశంలో ప్రభుత్వాలు అనుసరిస్తున్న వినాశకర విధానాల వలన ఇప్పటికే సామాన్యులకు అవసరమైన సమస్త నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతున్నాయి. అగ్నికి ఆజ్యం తోడైనట్లు ఇప్పుడు రూపాయి విలువ పడిపోవడం వలన వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. ఒక ప్రక్క సమస్త వస్తువుల ధరలు విపరీతంగా పెరుగుతుండగా కార్మికుల యొక్క ముఖ్యంగా అసంఘటితరంగ కార్మికుల ఆదాయాలు మాత్రం పెరగకపోవడం వలన వారి బ్రతుకులు అగ్నిగుండాలౌతున్నాయి. పెట్రోల్, కరెంట్, రవాణా, విద్య, వైద్యం, ఖరీదు అవుతుండటంతో మధ్య తరగతి ఉద్యోగులు కూడా నలిగి పోతున్నారు. అయితే రూపాయి విలువ పతనం వలన మన ఎగుమతులు చవక అయి, ఇతర దేశాలు మన సరుకును కొనే అవకాశం ఉంది. మన ఎగుమతులైతే పెరగవచ్చు కానీ వచ్చే డాలర్లలో పెద్దగా పెరుగుదల ఉండకపోవచ్చు.

**పరిష్కారం :**

**ప్రభుత్వం తెలిపే పరిష్కారం :** సంస్కరణలను మరింతగా అమలు చెయ్యడం ద్వారా, రూపాయి విలువ నిలబెడతామని ప్రధాని పార్లమెంటులో తెలిపారు. ఇందులో భాగంగా 1) సబ్సిడీల్లో మరింత కోత విధిస్తామన్నారు. గవర్నమెంట్ వాదన ప్రకారం సబ్సిడీలపై ఖర్చు వలన ద్రవ్యలోటు పెరుగుతుంది. దీని వలన అప్పు పెరిగి రూపాయి విలువ పతనానికి దారి తీస్తోంది. ఇప్పటికే ధరలు పెరగడం వలన ప్రజల కొనుగోలు శక్తి పడిపోతోంది. దీనివలన పారిశ్రామిక ప్రగతి కుంటుపడుతోంది. ఇందు వలన కొత్త పెట్టుబడులు రావటం లేదు. ఇంకా సబ్సిడీలలో కోత విధిస్తే పరిస్థితి మరింత దిగజారి, పెట్టుబడులు మరింత వెనక్కి వెళ్ళిపోతాయి.

2. ఇవ్వాళ దేశంలో డాలర్లకు కొరత ఉంది కాబట్టి, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని అనుమతిస్తే మరిన్ని డాలర్లు వస్తాయి. అందువలన బీమా, పెన్షన్ నిధుల వంటి రంగాల్లోకి ఎఫ్‌డిఐని మరింతగా అనుమతిస్తామని ప్రభుత్వం చెబ్తోంది. అంటే తన విధానల వలన సంభవించిన వినాశకర పరిణామాలనే అడ్డం పెట్టుకొని, మరింతగా వాటిని అమలు చేస్తానని ప్రభుత్వం తెలుపుతోంది.

**మనం సూచించే పరిష్కారాలు:**

1. అనవసరమైన విలాసవస్తువుల దిగుమతులపై అంక్షలు విధించాలి.
2. మనం ఉత్పత్తి చేసుకోగల్గే బొగ్గు, యంత్ర పరికరాలు, రసాయనిక ఎరువులు, వంటగ్యాస్‌ల దిగుమతులను తగ్గించి, వాటిని మన దేశంలోనే ఉత్పత్తి చేసుకోవాలి.
3. ఇవ్వాళ మన దేశ దిగుమతుల్లో సింహభాగం ముడి చమురుదే! ఈ ముడి చమురుకు మనం సౌదీ అరేబియా లాంటి దేశాల నుండి దిగుమతి చేసుకుంటున్నాం. ఈ దేశాల నుండి దిగుమతి చేసుకుంటున్న ముడి చమురుకు మనం డాలర్లలో చెల్లించాలి. కానీ ఇరాన్ అలాగాకుండా తనదేశం నుండి సహజవాయువును కొన్నట్లయితే అదే రేటుకు 25సం॥ల పాటు సరఫరా చేస్తానని, తీసుకున్న గ్యాస్‌కు రుపాయిల్లో చెల్లించినా ఫర్వాలేదని ముందుకొచ్చింది. ఇరాన్‌తో ఒప్పందం చేసుకుని, గ్యాస్ ముడిచమురు దిగుమతి చేసుకుంటే డాలర్లకు డిమాండ్ కొంత తగ్గుతుంది.
4. కేజీ బేసిన్‌లో గ్యాస్ ఉత్పత్తి చేస్తున్న రిలయన్స్‌కు రూపాయిల్లోనే చెల్లించాలి. (ప్రస్తుతం డాలర్లలో చెల్లిస్తున్నాము.)
5. పెట్టుబడిదార్లకు ఇచ్చే సబ్సిడీలను రద్దు చేసి ఆసొమ్మును రోడ్లు, ఆనకట్టలు వంటి మౌలికవసతుల అభివృద్ధి కోసం ఖర్చు పెట్టినట్లయితే కోటాను కోట్లమంది శ్రమ జీవులకు ఉపాధి దొరుకుతుంది. తద్వారా వారికొనుగోలు శక్తి పెరిగి, మరిన్ని వస్తువులకు డిమాండ్ పెరుగుతుంది. పారిశ్రామిక రంగంలో పెట్టుబడులు పెట్టే వారికి ఉత్సాహం వచ్చి పెట్టుబడులు పెడతారు.

**కొసమెరుపు :**

**ప్రభుత్వ దుర్మార్గ ఆలోచన :** రూపాయి విలువ మరింతగా పతనమౌతూ ప్రజలు కొనలేని స్థాయికి ధరలు పెరిగిపోతాయి. అప్పుడు ఆటోమేటిక్‌గా డిమాండ్ తగ్గి ధరలు తగ్గిపోతాయి. రూపాయి విలువ ఆటోమేటిక్‌గా స్టెబిలైజ్ అవుతుంది. కాబట్టి ప్రభుత్వం జోక్యం చేసుకోదని ప్రధాని, ఆర్థికమంత్రి తెలిపారు. అంటే ప్రజల కడుపులు మాడ్చడం ద్వారా సమస్యకు పరిష్కారం కనుగొంటామని చెప్పకనే చెబుతున్నారు. ఈ కుట్రలో భాగమే సబ్సిడీల్లో మరింత కోత!

మనం సూచించిన పై చర్యలను ప్రభుత్వం చేపడ్తుందని ఆశించడం అత్యాశే! ఎందుకంటే తమ మెదళ్ళను ఎప్పుడో తాకట్టు పెట్టేసిన కాంగ్రెస్ పాలకులు, మన ఆర్థికవ్యవస్థను సైతం తాకట్టు పెట్టే పనిలో నిమగ్నమై ఉన్నారు. పెట్టుబడిదార్ల కోసం, పెట్టుబడిదార్ల వలన, పెట్టుబడిదార్ల చేత నడపబడుతున్న ప్రభుత్వాలివి. "తిలాపాపం తలా పిడికెడు" అన్నట్లు ఇందులో బిజెపి కూడా తక్కువేమీ తిన్లేదు. వాజ్‌పేయి

**తరువాయి 14వ పేజీలో**

నివాళి

# మాలతీ చందూర్



-వకుళాభరణం లలిత

మాలతీ చందూర్ ఒక వ్యక్తి కాదు. ఒక సంస్థ. మూడు తరాలవారికి స్ఫూర్తినిచ్చిన రచయిత్రి. ఆమె చాలా మందికి అత్తగారు. సలహాదారు, గురువు, శ్రేయోభిలాషి, మంచి మిత్రురాలు, స్నేహశీలి. ప్రమదావనం శీర్షిక కోసం ఆంధ్రప్రభ చూడాల్సిందే. అసలు ఏదైనా చెబితే మాలతీ చందూర్‌గారే చెప్పాలి. ఆమె స్నేహితురాలు రుక్మాయి అన్నట్లు 'చాలామంది ఆదర్శంగా కనిపిస్తారు. రాస్తారు. మాట్లాడుతారు. అక్షరాలా ఆదర్శ రచయిత్రి, తెలుగువారి సుకృతం మాలతీ చందూర్.

మాలతీ చందూర్ అనగానే మనకు గుర్తువచ్చేది ప్రమదావనం., వంటలు, పిండివంటలు, కుట్లూ ఎంబ్రాయిడరీలు, ప్రశ్నలూ, జవాబులు. ప్రమదావనం శీర్షిక ఎంత విజయవంతమైందంటే ఆమెకంత కీర్తి తెచ్చింది. మద్రాసుకు వెళ్లిన వారికి దర్శనీయ వ్యక్తులలో మాలతీ చందూర్ ఒకరు. ఆమె ఆంధ్రదేశ కుటుంబాలన్నిటికీ ఆత్మీయురాలు. సమాజంలోని అనేక సమస్యలతో ఆమెకు పరిచయమైంది. రకరకాల మనస్తత్వాలు, జీవన సందర్భాలు ఆమెకర్థమై ఉంటాయి. ఆంధ్ర మహిళాసభ వంటి సంస్థతో సన్నిహిత సంబంధం ఉంది. ప్రపంచ సాహిత్యాన్ని ప్రతినిత్యం కాచివడపోసిన అనుభవం ఆమెను పరిణిత రచయితగా తీర్చిదిద్దాయి. ఆమె దృష్టి విశాలమైంది. అనేక జీవితానుభవాలను చూచి, విని, వాటిలో తాను భాగస్వామి అయ్యారు. మద్రాసు లోని సుప్రసిద్ధ రచయితలతో స్నేహం, సాహిత్య చర్చలు ఆమె రాసిన కథ, లేక నవలా రచనలకు పదునుపెట్టి ఉండవచ్చు . అందుకే ఆమె రాసిన కథలకు, నవలల్లో వాస్తవ జీవితం, ఆధునిక దృష్టి, పాత సాంప్రదాయాల నిరసన, కొత్త దారుల్లో నడిచే వారి జీవితాలల్లో వచ్చే సమస్యల పట్ల సానుభూతి ఉన్నాయి. పాత్రల విశ్లేషణ, స్త్రీలపై సమాజంలో జరుగుతున్న వివిధ రూపాలకు చెందుతున్న హింస, మనకు వాస్తవిక దృక్పథంతో కన్పిస్తుంది.

మాలతీ చందూర్ గొప్ప నవలా రచయిత్రి, కొడవటిగంటి కుటుంబరావు తర్వాత సామాన్యమైన పాత్రలను ఎక్కువ సృష్టించిన ఘనత మాలతీ చందూర్‌కే దక్కుతుంది. స్త్రీ విద్యావ్యాప్తికి కృషి సల్పిన జ్యోతి బాపూలే వితంతువులను గూర్చి రాస్తూ, "నిజానికి ఆమె అన్ని ప్రాపంచిక సుఖసంతోషాలకు దూరమవుతుంది. ఆమెను నేరగాళ్ల కంటే హీనంగా జంతువుగా చూస్తారు. అంతే కాదు ఆమెకంటూ ఏమి ఉండదు. మొగుడులేడు, సంసారం లేదు, పిల్లలు లేరు, నోములు, వ్రతాలు మృగ్యం. ఆమెకున్నదంత పని పని. ఉండడానికి ఒక చీకటి బతుకు ఆమెది".

కథలోగానీ, కథనంలోగానీ కృత్రిమత్వానికీ, అతిశయోక్తులకూ తావివ్వని రచయిత్రి మాలతీ చందూర్. రససిద్ధిలేని సాదా సీదా వాక్యాలతో, యెలాంటి జిమ్మిక్కులకూ పాల్పడకుండా వ్రాయడమే మాలతీ చందూర్ ప్రత్యేకత. చదివించే గుణం, మొదలుపెడితే చివరివరకూ ఆగనివ్వనితీరు, మళ్ళీ మళ్ళీ చదవాలనిపించటం ఈ రచయిత్రి నవలా శిల్ప రహస్యాలు.

మాలతీ చందూర్ రాసిన 'హృదయనేత్రి' నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు కూడా లభించింది. సృజనాత్మకంగా రచయిత్రి ఎదిగింది. ప్రతి రచనలో ఏదో మహత్తరమైన సందేశం ఉంటుంది. ఆమె శైలి మృదుమధురంగా ఉండి పాఠకులను చదివింపజేస్తుంది. ఏ విషయాన్ని రాయాలన్నా, ఆయా ప్రదేశాలకు వెళ్ళి సమాచారం సేకరించి, అప్పుడే రచనను ప్రారంభించేవాళ్లు మాలతీ చందూర్.

మాలతీ చందూర్ రాసిన "సద్యోగం" అనే నవలలో స్త్రీ పురుషుల మధ్య లైంగిక జీవితాన్ని మించి సామాజిక సంబంధాలుంటాయన్న అవగాహనతో మాలతీ చందూర్ రాశారు. గత యాభై సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్‌లో వచ్చిన

**స్త్రీ విద్యావ్యాప్తికి కృషి సల్పిన జ్యోతి బాపూలే వితంతువులను గూర్చి రాస్తూ, "నిజానికి ఆమె అన్ని ప్రాపంచిక సుఖసంతోషాలకు దూరమవుతుంది. ఆమెను నేరగాళ్ల కంటే హీనంగా జంతువుగా చూస్తారు. అంతే కాదు ఆమెకంటూ ఏమి ఉండదు. మొగుడులేడు, సంసారం లేదు, పిల్లలు లేరు, నోములు, వ్రతాలు మృగ్యం. ఆమెకున్నదంత పని పని. ఉండడానికి ఒక చీకటి బతుకు ఆమెది".**

**50వ దశాబ్దంలో విద్య, ఉద్యోగ రంగాల్లో అడుగుపెడ్తున్న యువతులకు, యువకులకు ఎన్నో సందేహాలు, పాత సాంప్రదాయాలు వదిలి, కొత్తవాటిని అందుకోవాలంటే కొంత బెరుకు ఏర్పడ్డ తరుణంలో ఒక మంచి సలహాదారుగా కౌన్సిలర్‌గా, మంచిమాట చెప్పేపెద్ద దిక్కుగా మాలతీ చందూర్ నవల ద్వారా మంచి సందేశాలను అందజేశారు.**

మార్పులపై మాలతీ చందూర్ ప్రభావం ఉందని నిస్సందేహంగా చెప్పవచ్చు" అని మహిళావరణంలో మాలతీ చందూర్‌ను గురించి రాశారు. "ఏమిటీ జీవితాలు?" అనే నవలలో పురుషుడితో అంటుంది రచయిత్రి. 'సృష్టికర్త అన్నట్లు నీవు స్త్రీతో బతకలేవు. ఆమెలేకుండానూ బతకలేవూ?.... ఎలా? ఆమెని ఆమెగా స్వీకరించటం నేర్చుకో.' మానవ జీవితాలను కాచి వడబోసిన రచయిత్రి ఆమె. నిత్యజీవితంలో ఉత్పన్నమవుతున్న సమస్యలకు మనస్సంఘర్షణలను పరిష్కరించేటట్లు నవలలు రాయటం మాలతీ చందూర్‌కే సాధ్యం. మానవీ సంబంధాలను మనోవైజ్ఞానిక దృక్పథంతో చిత్రించిన విశిష్టమైన నవలగా ఈ నవల సాహిత్యంలో నిలిచిపోతుంది. 'కృష్ణ వేణి, ' జయలక్ష్మి' మొదలైన నవలల్లో విజిలెన్స్ హోమ్ గూర్చి విపులంగా, నిశితంగా రాశారు. స్త్రీలు మాత్రమే స్త్రీల హృదయాల్ని ప్రతిభావంతంగా ఆవిష్కరించగలరన్న విషయం ఈ నవలల మూలంగా అర్థం చేసుకోవచ్చు .

వివాహం, దాంపత్యం పేరుతో స్త్రీ పురుష సంబంధాలు కొనసాగుతున్నాయి. ఇది కేవలం శరీర సంబంధం కోసమేనా అన్న ఒక ప్రశ్న బలంగా రచయిత్రి లేవనెత్తింది. వైవాహిక సంబంధాల్లో ప్రధానంగా వుండవలసింది. ప్రేమ, బంధమని నొక్కి చెప్పారు మాలతీ చందూర్ తన నవల 'రెక్కలు-చుక్కలు'లో.

50వ దశాబ్దంలో విద్య, ఉద్యోగ రంగాల్లో అడుగుపెడ్తున్న యువతులకు, యువకులకు ఎన్నో సందేహాలు, పాత సాంప్రదాయాలు వదిలి, కొత్తవాటిని అందుకోవాలంటే కొంత బెరుకు ఏర్పడ్డ తరుణంలో ఒక మంచి సలహాదారుగా కౌన్సిలర్‌గా, మంచిమాట చెప్పేపెద్ద దిక్కుగా మాలతీ చందూర్ నవల ద్వారా మంచి సందేశాలను అందజేశారు. చలం తర్వాత స్త్రీలపై వివిధ రూపాలలో జరుగుతున్న హింసను విస్తృతంగా రాశారు. హింసను అన్ని పార్శ్వాలనుంచి చర్చించారు. స్త్రీలను భయపెట్టి భయానక వాతావరణాన్ని సృష్టించి బెదిరించటమే, స్త్రీలపై హింస సాగుతున్నట్లు పాఠకులు అర్థం చేసుకుంటారు. ఇది స్త్రీలను సాంఘికంగా నియంత్రించే ఒకసాధనం. ఆనాడే కాదు ఈనాటికి కూడా స్త్రీలపై దాడి, హింస, హత్య, అత్యాచారం జరుగుతూనే ఉన్నాయి. ఏవి ఎప్పుడు జరుగుతాయో అనే భయంతో స్త్రీలు జీవితమంతా గడుపుతున్నారు. స్త్రీ , పురుష సమానత్వం సాధించందే స్త్రీల అభివృద్ధి జరగదు. స్త్రీల పట్ల ఉన్న వివక్షతలు పోవాలి. ఈ వివక్షతలను సాధించటం కోసమే హింస ఉపయోగపడుతున్నది. నిస్సహాయస్థితిలో ఉన్న స్త్రీలు, వ్యభిచార కూపంలోకి ఏవిధంగా ప్రవేశిస్తారన్న విషయం మాలతీ చందూర్ నవలల్లో ప్రత్యేకంగా, స్పష్టంగా అవగాహన అవుతుంది. దరిద్రంతో, ఆకలితో, రోగాలతో నలిగే స్త్రీల జీవితాలను విపులంగా రాసిన నవలలు చాలా అరుదంటారు రచయిత్రి ఓల్గా.

స్త్రీ విద్య, ఉద్యోగాల విషయంలో 1920 నుంచి కొంత మార్పు వచ్చింది. అయినా వాళ్ల సంపాదనపై వాళ్లకు హక్కు లేకపోవటం, దానిపై పురుషాధిక్యత ఉండటం ఈనాటికీ కొనసాగుతూనే ఉంది. ఎంత ధనాన్ని ఆర్జించినా, మనశ్శాంతి లేని జీవితాన్ని స్త్రీలు ఎట్లా గడుపుతారు అన్న విషయంకూడా మాలతీచందూర్ తన నవలల్లో రాశారు. స్త్రీల ఆర్థిక స్వాతంత్ర్యం ఆమె సంపాదించే డబ్బుమీద ఆమెకు పూర్తి నియంత్రణ ఉండటం మీద ఆధారపడి ఉంటుంది. స్త్రీలు ఎంత సంపాదించినా దాన్ని supplementory income (అదనపు ఆదా) కింద పరిగణిస్తారే తప్ప, కుటుంబ నిర్వహణకు పనికి వచ్చే రాబడిగా జమకట్టరు.

స్త్రీలు వివేకంతో నిర్ణయాలు తీసుకోవాలని, సరైన పరిష్కారాలు అసాధ్యం కావని స్త్రీలకు ఎంతో ధైర్యాన్నిచ్చారు మాలతీ చందూర్ తమ రచనల ద్వారా.

మాలతీ చందూర్ గొప్ప పాఠకురాలు, పుస్తక పఠనం ఆమె వ్యసనం. ఈ వ్యసనాన్ని ఆమె తన రచనల ద్వారా తెలుగు వారందరికి అంటించడానికి ప్రయత్నించారు. దీనికి మాలతీ చందూర్ మేనమామ కూడా మంచి వాతావరణాన్ని కల్గించాడు. ఒక మంచివ్యక్తిగా, రచయితగా, పత్రికా సంపాదకుడిగా ఆంధ్ర రాష్ట్రమంతటా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన ఆయన ఈమె ఇంతటి రచయిత్రి కావడానికి దోహదం చేశాడు కూడా. ఆ యిరువురు ఒకరి కోసం ఒకరు పుట్టారనిపిస్తుంది. వారి దాంపత్యం అపురూపం.

మాలతీ చందూర్ 30వ దశాబ్దపు తొలి రోజుల్లో జన్మించి ఈ సంవత్సరమే అస్తమించారు. ఏలూరులో పుట్టి పెరిగిన ఆమె మద్రాసుకు రావటం ఆరోజుల్లో మద్రాసు తెలుగు సాహితీ సాంస్కృతిక రంగం నిరంతర చలన శీలిగా ఉండటం, ఆ చైతన్య ప్రవాహంలో చందూర్‌గారి జీవిత భాగస్వామిగా మాలతీ అడుగుపెట్టడం, అనాటి పరిస్థితులు ఎంతో దోహదం చెయ్యటమేకాదు. తెలుగు యువతకు ఆదర్శవంతురాలైన రచయిత్రిగా అందుబాటులో ఉండటం మనందరి అదృష్టం. అందువల్లే 'ప్రమదావనం' శీర్షిక అంత విజయవంతమై ఆంధ్రదేశంలోని అనేక కుటుంబాల్లో ఆప్తురాలిగా మన మనస్సులో స్థిరమైన స్థానం ఆమె సంపాదించుకోగల్గింది. ఆ ఆదర్శ మూర్తిని తెలుగు నాట ఎవ్వరం మరువలేం.

పాఠకుల గుండెల్లో నిలిచిపోయిన ప్రమదావనికి (మాలతీచందూర్) చైతన్య మానవి నివాళులు అర్పిస్తోంది. ●




అచ్యుతాపురం ఎస్.ఇ.జడ్. 'క్వాంటమ్ క్లాతింగ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్"లో 2013 అక్టోబర్ 14 వరకు బోనస్‌కై పోరాటం జరిగింది. ఈ పోరాట ఫలితంగా కార్మికులకు దసరా బోనస్ తోపాటు కంపెనీలో కార్మికులు అనేక సమస్యల పరిష్కారానికై క్వాంటమ్ యాజమాన్యం వ్రాతపూర్వక హామీ ఇచ్చింది. కార్మిక చట్టాలు, హక్కులు లేకుండా రూపొందించిన ఒక ఎస్.ఇ.జడ్ లో కార్మికుల పోరాట ఫలితంగా వ్రాతపూర్వకమైన హామీని పొందడం, బోనస్ సాధించడం ఇదే ప్రథమమని చెప్పవచ్చు.

విశాఖ జిల్లాలో అచ్యుతాపురం మండలం స్పెషల్ ఎకనమిక్ జోన్ (ఎస్.ఇ.జెడ్)లో శ్రీలంకకు చెందిన "బ్రాండెక్స్" అపెరల్ పార్క్‌కు వెయ్యి ఎకరాలు భూమిని ఒక ఎకరాకి రూ.1 చొప్పున 33 సంవత్సరాల పాటు కారు చౌకగా ప్రభుత్వం కట్టబెట్టింది. ఈ కంపెనీ వచ్చినప్పుడు 60 వేలు ఉద్యోగాలు వస్తాయని అచ్యుతాపురాన్ని మరో సింగపూర్‌గా మార్చుతామని ప్రజలకు మాయమాటలు చెప్పి పచ్చని పొలాల పంటలతో నిత్యం కళకళ లాడుతున్న బంగారం లాంటి భూములను శ్రీలంక కంపెనీకి ధారాదత్తం చేసింది.

ఎస్ఇజెడ్ ప్రారంభమై 8 ఏళ్లు అయిన తరువాత కూడా 15 వేల మందికి మాత్రమే ఉద్యోగాలు వచ్చాయి. వీరిలో 75శాతం మంది మహిళలే. అచ్యుతాపురంలో కంపెనీ రాకముందు మహిళలకు పాడి, పంటలతో చేతినిండా పని ఉండేది. ఇప్పుడు కంపెనీ వచ్చి పంటలు పోయి పచ్చిక లేక పాడిలేదు. తినడానికి కూడా తిండిలేని పరిస్థితి. తప్పని పరిస్థితిలో బ్రాండిక్స్, క్వాంటమ్, ఓషన్ ఇండియా వంటి అనుబంధ కంపెనీలలో మహిళలు పనులు చేస్తున్నారు. బ్రాండిక్స్‌లో ఉద్యోగం చెయ్యడమంటే బ్రతికుండగానే నరకం చూడడం అని అనేక సందర్భాలలో కార్మికులు వాపోయారు. గతంలో మనకు తెలిసి ముగ్గురు మహిళా కార్మికులు శ్వాసకోశ వ్యాధితో (టి.బి) మరణించారు.యాజమాన్యం గుట్టు చప్పుడు కాకుండా గోప్యంగా వుంచాలని చూసారు. సి.ఐ.టియు, ఐద్వాగా పోరాడి వారికి నష్టపరిహారం వచ్చేటట్లు చేసాము.

ప్రస్తుతం క్వాంటమ్ కంపెనీలో పనిచేసే 3500 మందిలో అత్యధికులు మహిళలే. మహిళల లోదుస్తులు తయారుచేసే ఈ కంపెనీలో పని చైన్ సిస్టంగా వుంటుంది. ఒక వరుసకు నలభై మంది వర్కర్లుంటారు. వీరిపై ఒక సూపర్‌వైజర్ వుంటాడు. మిషన్ కుట్టినప్పుడు మర బొమ్మలా పనిచేయమని ఒత్తిడి చేస్తారు. మాట్లాడకూడదు, తలతిప్పకూడదు, ఒక్కసారే బాత్‌రూంకి వెళ్లాలి. ఇవి చాలవన్నట్లు మహిళలపై లెంగిక వేధింపులు చాలా తీవ్రంగా జరుగుతుండడంతో దీనిని సహించలేని మహిళా కార్మికులు తిరుగుబాటు చేశారు.

**కార్మికుల పట్ల యాజమాన్యం వైఖరి:** జిల్లాలో సుమారు 50 కి.మీ. సుదూర ప్రాంతాలైన ఎస్. రాయవరం, నాతవరం, నర్సీపట్నం, నక్కపల్లి వంటి ప్రాంతాలనుంచి సుమారు రెండు గంటల నుంచి మూడు గంటల వరకు ప్రయాణం చేసుకొని ఉద్యోగాలకు వస్తున్నారు. ఎ-షిఫ్ట్ చెయ్యాలంటే ఇంట్లో తెల్లవారు జామునే మూడింటికి లేచి 4 గంటలకు బస్సు ఎక్కాలి. ఇంత కష్టపడుతుంటే వారికి వచ్చే జీతం మాత్రం రూ, 2,500/-లు నుండి రూ.3,000/- ఇక్కడ కనీస వేతనాలు గాని, కార్మిక చట్టాలు గాని ఇ.ఎస్.ఐ వంటివి అమలు కావడంలేదు. జిల్లా కలెక్టర్ ఇచ్చిన జీ ఓ. ప్రకారం అన్‌స్కిల్డ్ కార్మికులకి రోజుకు రూ. 315/-లు స్కిల్డ్ కార్మికులకి రూ. 430/-లు ఇవ్వాలి. అయినా యాజమాన్యం ఆ ప్రకారం ఇవ్వడం లేదు. మిషన్ కుట్టే ఆపరేటర్ నుంచి అన్ని కేటగిరి కార్మికులు నైపుణ్యం కలిగిన వారే. వీరికి స్కిల్డ్ జీతాలు వర్తిస్తాయి. పి.ఎఫ్ కట్‌చేస్తారు. కానీ ఎంత కట్ చేస్తారో పే స్లిప్‌లో చూపించరు. సెలవులు పెట్టకూడదు. ఓటీలు ఎప్పుడు చేయమంటే అప్పుడు చేయాలి.

**పోరాటంలో మహిళల పాత్ర :** ఈ సంవత్సరం దసరా బోనస్ 10వేల రూపాయలు ఇవ్వాలని, జీతం 6 వేలు రూపాయలు ఇవ్వాలని, ఇ.ఎస్.ఐ.పి.ఎఫ్ ఇతర సమస్యలపై అక్టోబర్ 11వ తేదిన క్వాంటమ్ కార్మికులు తెల్లవారు జామునుండి రెండు రోజుల పాటు చలిలో రాత్రి, పగలు తిండి, తిప్పలు లేక బ్రాండిక్స్ మెయిన్ గేట్ ఎదుట ఆందోళనకు దిగారు. చంటి బిడ్డల తల్లులు, గర్భిణీ స్త్రీలు, పెళ్ళి కాని అమ్మాయిలు తమ కుటుంబాలను వదిలేసి పోరాటం చేసారు.

**యాజమాన్యం- పోలీసుల నిర్బంధం :** కార్మికులు ఆందోళన చేస్తున్న సందర్భంలో బ్రాండిక్స్ జోన్ చుట్టూ పోలీస్ బలగాలను మోహరించి పోలీస్ పికెట్ ఏర్పాటుచేసి, వెళ్తున్న బస్సుల్ని, ఆటోల్ని ఆపి చెక్‌చేసి సి.ఐ.టి,యు, ఐద్వా, కంపెనీ కార్మికుల్ని, ఇతర కార్మిక నాయకుల్ని అరెస్టులు చేసి నిర్బంధించడం ద్వారా ఉద్యమాల్ని ఆపేందుకు ప్రయత్నించారు. యాజమాన్యం అన్ని గ్రామాల్లో ఉన్న కార్మికుల ఇండ్లకు వెళ్లి సమ్మె చేయవద్దని, సమ్మెచేస్తే కంపెనీ మూసివేస్తామని, తద్వారా ఈపని కూడా ఉండదని బెదిరింపు చర్యలకు పాల్పడ్డారు. యాజమాన్యం చేపట్టిన నిర్బంధాలకు కార్మికులు అదరకుండా, బెదరకుండా మరింత పట్టుదలతో పోరాటాన్ని సాగించి విజయం సాధించారు.

**సాధించిన ఫలితాలు :** గతంలో 6 నెలలు పనిచేసినవారికి బోనస్ లేదు. ఇప్పుడు అన్ని క్యాటగిరిల్లో పనిచేస్తున్న ఉద్యోగులందరికి బోనస్‌ను పెంచారు. వేధింపులకు గురిచేస్తున్న దీప్తి సయ్యిద్ లనే హెచ్‌ఆర్ అధికారులపై నెల రోజుల్లో చర్యలు తీసుకొంటామని, పి.ఎఫ్, ఇ.ఇన్.ఐ సమస్యను పరిష్కరిస్తామని, పే స్లిప్పులు జీతాలకు 4 రోజులు ముందు ఇస్తామని, బ్రాండిక్స్ జోన్‌లో ఉన్న కంపెనీలు కనీస వేతనాలు ఎలా ఇస్తే అట్లాగే మేము ఇస్తామని క్వాంటమ్ కంపెనీ వారు అంగీకరించి వ్రాతపూర్వకంగా అగ్రిమెంట్ చేయాల్సి వచ్చింది. "పోరాడితే పోయేదేమీలేదు - బానిస సంకెళ్ళు తప్ప" అని క్వాంటమ్ కార్మికులు మరోసారి ఋజువుచేశారు.



భాగ్యరెడ్డి వర్మ



మాడపాటి హనుమంతరావు

చరిత్ర

# తెలుగు భాషకు మార్గదర్శకులు

-వేములపల్లి సత్యవతి

నిజాం పాలనలో తెలుగు మాట్లాడేవారు నూటికి 80శాతం మంది వుండేవారు. కాని రాజభాషగా ఉర్దూ చెలామణీలో వుండేది. తెలుగు భాషను, ఆభాష మాట్లాడే వారిని 'తెలంగీ' అని హేళన చేసేవారు. తెలుగు పూర్తిగా నిరాదరణకు గురయింది. దాని ఉద్ధరణకు శ్రీకారం చుట్టిన ప్రధమవ్యక్తి ఆంధ్రపిత మాడపాటి హనుమంతరావుగారు కాగా ద్వితీయ వ్యక్తి భాగ్యరెడ్డి వర్మ. సమాజంలో అట్టడుగు కులాల దళిత బాలికల వద్దకు చదువుల తల్లిని చేర్చిన ఘనుడు భాగ్యరెడ్డివర్మ, తెలుగు పాఠశాలల స్థాపనకు నిజాం సర్కారు అనుమతించని కాలంలో దళిత బాలికల కొరకు ఏకంగా 26 తెలుగు మాధ్యమముగల పాఠశాలలను ఏర్పాటు చేశాడు. నిజాం కాలంలో ఇది అనితరసాధ్యమైనపని.

భాగ్యరెడ్డివర్మ 1906లో "జగన్ మిత్రమండలి"ని స్థాపించాడు. అంటరానితనం మీద పోరాడిన సంఘ సంస్కర్త వర్మ. నిరక్షరాస్యత నిర్మూలన వలనే అజ్ఞానం దూరం అవుతుందని నమ్మిన భాషాభిమాని. 1911లో "మన్యం" పేరిట మరో సంస్థను ఏర్పాటు చేశాడు. తర్వాత దానిపేరు "ఆది-హిందూ సోషల్ సర్విస్‌లీగ్" గా మార్చారు. దీని ద్వారా నిమ్న కులాల వారి అభివృద్ధికి కృషి చేసాడు. ఎన్నో గ్రంధాలయాలను నెలకొల్పారు. దీనబంధు, ఆంధ్ర పత్రికల పేర్లతో పత్రికలను నడిపారు. 1933లో భాగ్యరెడ్డి వర్మ స్థాపించి నిర్వహించిన పాఠశాలలన్నింటిని కొన్ని షరతులకు లోబడి నిజాం ప్రభుత్వాన్ని ఒప్పించి ప్రభుత్వ స్వాధీనం చేశారు. ఆ పాఠశాలల్లో తెలుగు మాధ్యమములోనే విద్యాబోధన జరగాలన్న షరతుకు నిజాం సర్కారు అంగీకరించేలాగా చేశారు. అంకిత భావంతో సేవచేసిన ఈ దళితోద్ధారకుడు 1939లో గతించారు.

తెలుగు భాషను, ఆభాష మాట్లాడే వారిని 'తెలంగీ' అని హేళన చేసేవారు. తెలుగు పూర్తిగా నిరాదరణకు గురయింది. దాని ఉద్దరణకు శ్రీకారం చుట్టిన ప్రధమవ్యక్తి ఆంధ్రపిత మాడపాటి హనుమంతరావుగారు కాగా ద్వితీయ వ్యక్తి భాగ్యరెడ్డి వర్మ.

వర్మగారి మరణానంతరం ఆయన జ్ఞాపకార్థం ఆనాటి నిజాం సర్కార్ ఇసామియా బజారునుంచి ఛాదర్‌ఘాట్ వరకు వున్న రోడ్డుకు భాగ్యరెడ్డి రోడ్డుగా నామకరణం చేసింది.

1942లో అది-హిందూ భవన్‌లో ఆయన పేరు మీదుగా ఆదిహిందూ భాగ్యరెడ్డి బాలికోన్నత పాఠశాలను నెలకొల్పారు. ఏడు పదుల ఏండ్లనుంచి తెలుగు మాధ్యమములో ఆ పాఠశాల నేటికీ నడుస్తున్నది. ఛాదర్‌ఘాట్ వంతెన చౌరస్తా నుంచి సుల్తాన్ బజారు వెళ్లే రోడ్డు మొదట్లోనే ఆ పాఠశాల కనిపిస్తుంది.

తెలుగు పాఠశాలలు స్థాపించగానే సరిపోదుగదా! వాటి నిర్వహణకు, చదువు చెప్పే పంతుళ్ళకు వేతనాలివ్వటానికి డబ్బుకావాలి. ఆరోజుల్లో డబ్బున్నవారు భారీ విరాళాలిచ్చారు. హనుమంతరావుగారు అయిదుగురితో ఆరంభించిన ఆంధ్ర బాలికా పాఠశాల వందల మందితో వర్ధిల్లింది. పాఠశాల భవనానికి ఆరోజుల్లో విరాళాల రూపంలో 40వేల రూపాయలు సమకూరినవి, దానితో నేడు నారాయణగూడలోని పాఠశాల భవనం నిర్మించబడింది. ఆంధ్రపిత మరణానంతరం 'మాడపాటి హనుమంతరావు బాలికోన్నత పాఠశాల' అని పేరు పెట్టారు. ఇంగ్లీషు భాషా వ్యామోహపు గాలి జోరందుకున్నందున రెండు మాధ్యమాలలో నేడు విద్యాబోధన జరుగుచున్నది.

**రిఫా-యె-ఆమ్ హైస్కూల్.**
**(వెంకట్రావు మెమోరియల్‌హైస్కూల్)**

ఈ పాఠశాల స్థాపక, నిర్వాహక దాత నిజాం హయాంలో సెషన్ జడ్జీగా పనిచేసిన గుండేరావ్ పంపాడ్. వారికి సంతానం లేని కారణాన బంధువుల పిల్లవాడు వెంకట్రావ్‌ను దత్తత తీసుకున్నాడు. దురదృష్టవశాత్తు వెంకట్రావ్‌ను 15

**తరువాయి 14వ పేజీలో**



# శేషప్రశ్న

జి. అమ్మాజీ

దాదాపు మూడు గంటలపాటు ఆమె తల్లితండ్రులతో చర్చించిన తర్వాత ఆమెను కలవటానికి లోపలికి వెళ్ళాను, ఆమె మంచం మీద కళ్ళుమూసుకుని నిస్త్రాణగా పడుకుని వుంది. నేను వెళ్లి మంచం ప్రక్కనే వున్న కుర్చీలో కూర్చున్నాను. ఆమె నా రాకను గమనించిందో లేదో నాకు తెలీదు. కళ్ళు మాత్రం తెరవలేదు.

నా రాకని ఆమెకి తెలియజేయటం కోసం 'హలో' అన్నాను. చిన్నగా.

ఆమె కళ్ళు తెరిచి నావైపు చూసింది. ఆమె నొసలు ముడిపడ్డాయి. నాతో మాట్లాడటం యిష్టం లేనట్టు నావంక తిరస్కారంగా చూసి మళ్ళీ కళ్ళు మూసుకుంది.

ఆమె అలా ఎందుకు చేసిందో నేను అర్థం చేసుకోగలను. అందుకే ఆమె చేతిని నా చేతిలోకి తీసుకున్నాను ఆప్యాయంగా. అలా చేస్తున్నప్పుడు మనసులో కొంచెం బెరుకనిపించింది. ఆమె దాన్ని కూడా ఎక్కడ రిజెక్టు చేస్తుందో అని.

'నేను నిన్ను ఇంటర్వ్యూ చేయటానికో, నీకు న్యాయం జరిగేలా చూస్తానని వాగ్దానం చేయటానికో ఇక్కడికి రాలేదు. నీ సమస్యకి పరిష్కారాన్ని సూచించగలనేమో అన్న నమ్మకంతో వచ్చాను." అన్నాను.

ఆమె కళ్ళు మూసుకునే విన్నది. ఆమె కళ్ళుమూసుకుని పడుకున్నా, నా మాటలమీద ఆమెకి విశ్వాసం కలగలేదనే విషయం నాకు స్పష్టంగా అర్థం అయింది.

"ప్లీజ్ ట్రస్ట్‌మి, ఇప్పుడు మనిద్దరి మధ్య జరిగే సంభాషణ మనిద్దరి మధ్యే వుండిపోతుంది. ఇది కేవలం నీ జీవితానికి, నీ భవిష్యత్తుకి సంబంధించిన విషయమని నాకు తెలుసు. జరిగిన దాన్ని గురించి ప్రశ్నలు వేసి నిన్ను బాధ పెట్టటానికి నేను రాలేదు. మీడియాలో విషయం చూసి ఎంతో ఆవేదనతో నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. ప్లీజ్ బిలీవ్‌మీ." ఆమెకి నామీద నమ్మకం కలిగించేందుకు నాకు చేతనైన పద్ధతిలో మాట్లాడాను.

ఏమనుకుందో ఏమో! చిన్నగా లేచి దిండ్లు ఆసరాగా చేసుకుని మంచానికి వెనగ్గావాలి కూర్చుంది. 'మాట్లాడండి' అన్నట్టు నా వంక చూసింది.

'ఇప్పుడు నువ్వేం నిర్ణయం తీసుకోబోతున్నావు?"

సంభాషణ సూటిగానే మొదలుపెట్టాను.

"కళ్ళకి గంతలు కట్టి అంధకారంలో వదిలేసి ఎటు వెళ్ళమనుకుంటున్నావు? అని అడిగితే ఏం సమాధానం చెప్పగలను ఆంటీ. ఆ మృగాల పైశాచికత్వం నా మనసుని, మెదడుని కూడా ఛిద్రం చేసేసింది. ఇప్పుడు నేనేమీ ఆలోచించే స్థితిలో లేను."ఆమాటలు అంటున్నప్పుడు ఆమె కళ్ళల్లోంచి కన్నీళ్ళు ఉబికి వచ్చాయి. నాకు గుండె పట్టేసింది.

"నువ్వు యిచ్చిన ఎగ్జాంపుల్ లోనే నీ భవిష్యత్తు దాగి వుంది. తెలుసా?" అన్నాను. చిన్నగా నవ్వుతూ. ఆమెను కొంచెం తేలిక పరచాలనే ఉద్దేశ్యంతో.

ఆమె నావంక ఆశ్చర్యంగా చూసింది.

"ఎస్! వాళ్ళు నీ కళ్ళకేగా గంతలు కట్టింది. నీ చేతులు, కాళ్ళు బంధించలేదుగా? ఆ కట్టిన గంతలు విప్పిపారేసి, నీకు మంచి అనుకున్న మార్గంలో నువ్వు ముందుకు నడువు. అంతేగానీ వాళ్ళు నిలబెట్టిన అంధకారంలోనే ఆగిపోవటం అనేది వివేకం అనిపించుకోదు" అన్నాను.

" అంటే " అంది అర్థం కానట్టు.

మీడియాలో చూస్తున్నావు కదా! నేరస్థులకి శిక్ష పడాలని, నీకు న్యాయం జరగాలనీ ఏక కంఠంతో నినాదాలు చేస్తున్నారు. నీ అభిప్రాయం ఏంటీ? " ఆమె వంక పరీక్షగా చూస్తు అడిగాను.

ఆమె విచిత్రంగా నవ్వింది. "నేరస్థులకి శిక్షపడాలని కోరుకోవటం కరక్టే. ఎందుకంటే వాళ్ళు నేరం చేశారు. కాబట్టి కానీ దానివల్ల నాకు జరిగే న్యాయం ఏంటీ?" అంది.

"మరి నువ్వు కోరుకునే న్యాయం ఏంటీ?"

"నాకు న్యాయం జరగటం అనేది జరిగేపని కాదు ఆంటీ. ఏ కోర్టు, ఏ చట్టం, ఏ సమాజం నాకు న్యాయం చేయలేవు. అసలు ఈ సంఘటన తర్వాత అమ్మానాన్న ఎక్కడ ఆత్మహత్య చేసుకుంటారో అని లోపల లోపల ఎంత భయపడుతున్నానో తెలుసా?" అంది నావంక దీనంగా చూస్తూ.

ఆమె అలా అంటుంటే నాకు చాలా

జాలనిపించింది. ఇంత చిన్న వయస్సులో ఎంత మానసిక క్షోభకి గురౌతుందో కదా అని అనుకున్నాను.

కానీ నా మనసులోని భావాల్ని బయటకు కనిపించనీయకుండా " న్యాయం జరగదని ఎందుకనుకుంటున్నావు? వాళ్ళెవరూ చేయలేని న్యాయం నీకు నువ్వు చేసుకోవచ్చు. " అన్నాను గంభీరంగా.

"ఎలా ఆంటీ? నేను పోగొట్టుకున్నది ఏంటో తెలుసా? అందరూ 'శీలం' 'శీలం' అంటున్నారు. కానీ నిజంగా శీలం అనే పదానికి అర్థం గానీ, నిర్వచనం గానీ నాకు తెలీదు. ఆక్షణంలో గాయపడింది నా ఆత్మాభిమానం. వాళ్ళు నా వ్యక్తిత్వం మీద దెబ్బకొట్టారు. ప్రతి మనిషికి ఎంతో అవసరమైన ఆత్మాభిమానాన్ని ఈ రోజు నేను కోల్పోయాను. ఆంటీ! నేనీ రోజు సిగ్గుతో ఏడవటం లేదు. అవమానంతో రోదిస్తున్నాను. గాయపడింది నా శరీరం కాదు. నామనసు. దానికి న్యాయమెలా జరుగుతుంది. చెప్పండి." ఎంతో స్పష్టంగా, సూటిగా ప్రశ్నించింది.

వయసు కన్నా అనుభవం ఎంత గొప్పదో మరోసారి ఆమె మాటలు వింటే అర్థమవుతోంది.

"నువ్వు చెప్పింది. నేను అర్థం చేసుకోగలను..." నామాట యింకా పూర్తి కాలేదు. ఆమె వెంటనే ఆవేశంగా అరిచింది. " నో ఆంటీ! నో ! మీరేకాదు ఈ ప్రపంచంలో ఎవరికీ నాబాధ అర్థం కాదు. మీరు అర్థం చేసుకోలేరు. కూడా." ఆమె వెక్కి వెక్కి ఏడ్వటం మొదలుపెట్టింది.

"చెప్తున్నాను కదా నేను అర్థం చేసుకోగలనని. ఎందుకంటే ముప్పై ఏళ్ళ క్రితం నేను కూడా నీలాగే అవమాన పడ్డదాన్నే." ఆమాట చెప్తున్నప్పుడు నాగొంతులో వచ్చిన మార్పు నాకే స్పష్టంగా తెలిసింది.

నా మాటలకి ఆమె ఏడుపు ఒక్కసారిగా ఆగిపోయింది. షాక్ తిన్నట్టు చూసింది.

'అవును నిన్నేదో కన్సోల్ చేయటానికో, మభ్యపెట్టటానికో నేనీమాట చెప్పలేదు. నిన్ను వెతుక్కుంటూ వచ్చింది. కూడా అందుకే " అన్నాను.

" ఈజ్ ఇట్ ట్రూ" నమ్మలేనట్టు చూసింది ఆమె నావంక. " ముప్పై ఏళ్ళ క్రితం మా ఇంట్లో డ్రైవర్‌గా ఇరవైఏళ్ళ కుర్రాడు పనిచేసేవాడు. అప్పుడు నా వయసు ఇరవై ఆరు. వాడు నన్ను ' అమ్మగారు, అమ్మగారు' అని పిలుస్తుంటే, 'అమ్మగారు అనద్దులేరా. ' అక్కా' అని పిలువు అని చెప్పాను. అప్పటి నుంచి వాడు నన్ను అక్కా అని పిలిచేవాడు. పేరుకి వాడు డ్రైవరే గానీ నేనూ, మా వారు వాణ్ణి ఎంతో ఆప్యాయంగా, మాలో ఒకడిగా చూసేవాళ్ళం. ప్రతి సంవత్సరం నేను వాడికి రాఖీ కట్టి, స్వీట్ బాక్స్ యిచ్చేదాన్ని ముచ్చటగా. కానీ వాడు పైకి 'అక్కా' అని పిలుస్తున్నా, వాడిలో ఒక మానవమృగం వుందనే విషయం వేం గమనించలేకపోయాం.

ఒక రోజు వాడు వాళ్ళింటికి బంధువు వచ్చాడని శెలవు అడిగాడు. మా వారు తనే కారుతీసుకుని ఆఫీసుకి వెళ్ళిపోయారు. నేను కూడా మ్యూజిక్ క్లాస్‌కి వెళ్ళటానికి రెడీ అవుతున్నాను. ఇంతలో వాడు వాడి వయసు వాడినే మరోకడిని వెంటపెట్టుకు వచ్చాడు.

"అక్కా! వీడు మా పెద్దనాన్న కొడుకు ఈ ఊరికి పనికోసం వచ్చాడు. ఈడనే కారుషెడ్డులో నిన్ననే పనికి కుదిరిండు. నీకు సూపించి పోదామని తీస్కవచ్చిన." అన్నాడు.

"అక్కా కొంచెం మంచినీళ్ళు యిస్తావా?" అన్నాడు ఆ వచ్చిన వాడు.

' సరే ' అని వంటగదిలోకి వెళ్ళాను. నేను నీళ్ళ గ్లాసుతో వచ్చేసరికి వాళ్ళు వీది గుమ్మం గడియపెట్టేశారు. నేను అరవటానికి కూడా లేకుండా నోటికి గుడ్డలు కట్టేశారు. అంతా రెప్పపాటులో జరిగిపోయింది. నాకు విషయం అర్థం అయేసరికి పరిస్థితి చేయిదాటి పోయింది. 'అక్కా' అంటూ అప్యాయంగా పిలిచిన వాడు నా మీదకి పశువులా ఎగబడినప్పుడు నేను కూడా నీలాగే గుండె పగిలేలా రోదించాను. అవమానంతో కుమిలిపోయాను. తర్వాత ఇద్దరూ నాఒంటి మీద వున్న బంగారం మొత్తం లాక్కుని పారిపోయారు. "

ఈ విషయాలన్నీ ఆమెకి చెప్పటానికి నేనెంతో శక్తిని కూడదీసుకోవాల్సి వచ్చింది'. చెప్పటం ఆపి కుర్చీలో వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాను. కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి.

ఆమె చేతి స్పర్శతో కళ్ళు తెరిచాను. మంచం దిగి ఎప్పుడు వెళ్ళిందో తెలీదు. చేతిలో మంచినీళ్ళ గ్లాసుతో నిలబడి వుంది. 'థ్యాంక్స్' చెప్పి గ్లాసు అందుకున్నాను.

ఆమె తిరిగి మంచం మీద కూర్చుంటూ "జరిగింది. అంకుల్‌కి చెప్పారా?" కొంచెం మోహమాట పడుతూనే అడిగింది. ఆమె అడగటంలో అంతర్యం నాకర్థం అయింది. నేను మళ్ళీ చెప్పటం మొదలు పెట్టాను. అంకుల్‌ని అర్జంటుగా యింటికి రమ్మని ఫోన్ చేసి స్లీపింగ్ పిల్స్ మింగేశాను. మళ్ళీ నేను కళ్ళు తెరిచే సరికి హాస్పిటల్‌లో బెడ్‌మీద వున్నాను. ప్రక్కన మావారు వున్నారు. ఆయన ముఖంలో ఎంతో కంగారు, బాధ ఆయన్ని చూడగానే నాకు దు:ఖం తన్నుకొచ్చింది. ఆయన చేతులు పట్టుకుని భోరున ఏడ్చాను. జరిగింది చెప్పటానికి ప్రయత్నించాను. కానీ ఆయన తన చేతిని నా పెదాలకి అడ్డుపెట్టి ' డాక్టర్‌గారు అంతా చెప్పారు. అస్సలు దాని గురించి మాట్లాడద్దు. ముందు నువ్వు కోలుకోవాలి. హ్యాపీగా మనం యింటికి వెళ్ళాలి. అంతే అర్థమయిందా. " అన్నారు ప్రేమగా.

ఆ క్షణంలో అంత మంచితనాన్ని కూడా నేను భరించలేకపోయాను.

హాస్పిటల్ నుంచి యింటికి వచ్చాక తను ఆఫీసుకి శెలవు పెట్టి నా మనసుకి కొంచెం హాయిగా వుంటుందని దూర

ప్రదేశాలకి తీసుకు వెళ్ళారు.

మూడు నెల్ల తర్వాత మేము టూర్ నుంచి తిరిగి వచ్చినప్పుడు మావూరు కాకుండా వేరే వూరు వెళ్ళాము. అక్కడ మా కోసం ఇల్లు తీసుకున్నారు. నేను ఆశ్చర్య పోయాను.''నీ మనసుని బాధించే ఆయింట్లో, ఆ ఊళ్ళో వుండటం నాకూ యిష్టం లేదు. అందుకే ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాను ' అన్నారు.

జీవిత భాగస్వామి అనే మాటకి నిజమైన నిర్వచనం ఏంటో అప్పుడే నాకర్థం అయింది.

''మరి వాళ్ళిద్దర్ని అలాగే వదిలేశారా? " అనడిగింది

"లేదు.కేసుపెట్టి వాళ్ళని బోనులో నించోపెట్టారు. ధైర్యంగా వచ్చి జరిగింది చెప్పమని నన్ను కూడా తీసుకెళ్ళారు. వాళ్ళిద్దరికీ శిక్షపడేదాకా ఆయన నిద్రపోలేదు.

నా మాటలు చాలా శ్రద్ధగా, ఆశ్చర్యంగా వింటోంది ఆమె.మళ్ళీ ఏదో సందేహంగా నావంక చూసింది.

''ఏదన్నా అడగాలా? అడుగు ఫర్వాలేదు " అన్నాను.

''అంకుల్ మీతో అన్ని విషయాల్లోనూ హ్యాపీగానే వుంటారా? " సంకోచిస్తూనే అడిగింది.

ఆమె ప్రశ్నలోని అంతర్యం నాకు అర్ధం అయింది.

"నేను చాలా రోజులు తనతో క్లోజ్‌గా మూవ్ అవలేక పోయేదాన్ని. చాలా గిల్టీగా ఫీలయ్యేదాన్ని తను ఒకరోజు నన్ను కూర్చోపెట్టి ' నువ్వెందుకంత గిల్టీగా ఫీల్ అవుతున్నావో నాకర్థం కావటం లేదు. నీకోక చిన్న ఉదాహరణ చెప్పనా? మా బాబాయి కూతురు ధరణి విషయం నీకు తెలిసిందే కాదా! బెడ్‌రూంలో అతను పెట్టిన హింస, మాట్లాడే అసభ్యకరమైన మాటలు భరించలేకే కదా విడాకులిచ్చి మళ్లీ వేరే అతన్ని పెళ్ళిచేసుకుంది. ఇప్పుడు వాళ్ళిద్దరూ ఎంతో హ్యాపీగా వుండటం లేదూ! భార్య అయినా, పరాయి స్త్రీ అయినా- ఆమె కిష్టం లేకుండా ఆమె శరీరాన్ని అనుభవించటం అనేది రేప్ కిందకే వస్తుంది. ఇక్కడ నువ్వు ఒక చిన్న విషయం ఆలోచించు అక్కడ భర్త హోదాతో ఆమె మీద దాడి జరిగింది. ఇక్కడ నీ ప్రమేయం లేకుండానే నీ మీద దాడి జరిగింది. పరిస్థితులు, వ్యక్తులే తేడాగానీ ఇక్కడ జరిగిన విషయం మాత్రం ఒకటే. కాబట్టి నీకు నువ్వే ఒక అపరాధిలా ఫీల్ అవ్వాల్సిన అవసరం లేదు. అలా అయితే నా ప్రయత్నం అంతా వృదా చేసినట్టే " ఆ మాటలు చెప్పేటప్పుడు ఆయన గొంతులోని ఆవేధన నన్ను కదిలించి వేసింది. నేను కూడా చిన్నగా నా ఆలోచనల్లో మార్పు తెచ్చుకున్నాను. సో నౌ వుయ్ ఆర్ వెరీ హ్యాపి. " అని చెప్పాను.

ఆమె ప్రశ్నల పరంపర ఇంకా పూర్తి కాలేదనుకుంటాను. " మీ పిల్లలకి ఈ విషయం తెలుసా ఆంటీ? " అనడిగింది.

ఆమె వేసే ప్రతి ప్రశ్న వెనకాలా ఆమె తన భవిష్యత్తును వెతుక్కుంటోంది. అన్న విషయం నాకర్థం అవుతోంది. నేను కోరుకుంటున్నది కూడా అదే. అందుకే ప్రతిదానికి చాలా క్లియర్‌గా సమాధానమిస్తున్నాను.

మాకు ఒక అమ్మాయి ఉంది. తనిప్పుడు మెడిసిన్ చదువుతోంది. కాని ఆమెను నేను కనలేదు అన్నాను. "అదేంటి?దత్తత తెచ్చుకున్నారా?'' ఆమెగొంతులో కించిత్ ఆశ్చర్యం తొంగి చూసింది.

" అవును మా వారికున్నంత మనోబలం రేపు నా బిడ్డలకి వుంటుందని చెప్పలేము. ఎప్పటికైన విషయం వాళ్ళకి తెలియొచ్చు అప్పుడు మళ్ళీ నా జీవితంలో కల్లోలం మొదలైతే ఆయన శ్రమంతా వృధా అవుతుందేమో అనే ఉద్దేశ్యంతో నేనే కనదల్చుకోలేదు. " చెప్పాను.

''అంటే ప్రతి ఆడది ఎంతో అపురూపంగా భావించే మాతృత్వాన్ని కూడా మీరు వదిలేసుకోవాల్సి వచ్చిందా ఆంటీ! అమె నావైపు మొదటిసారి జాలిగా, సానుభూతితో చూసింది.

అదేమీ పట్టించుకోనట్టు చెప్పాను. " మాతృత్వం అనేది కంటేనే రాదు. అది మన మనసులో వుంటుంది. అందుకే శ్వేతని తెచ్చుకుని పెంచుకున్నాం. "

నామాటలు వింటున్న ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు కనిపించాయి. ఈ సారి బాధతోనో, అవమానంతోనో వచ్చిన కన్నీరు కాదు. నా మీద సానుభూతితో వచ్చినవి అంత కన్నా కాదు. ఆ కన్నీళ్ళలో ఒక కృతజ్ఞతా భావం, దాంతోపాటు భవిష్యత్తుమీద ఒక ఆశ నాకు స్పష్టంగా కనిపించాయి.

ఆమె మంచం మీద నుంచి వచ్చి నన్ను గట్టిగా వాటేసుకుంది. "తుఫానుకి కొట్టుకుపోతానేమో అని భయపడ్డాను ఆంటీ. కానీ ఏ సంబంధం లేకపోయినా మీరు నన్ను వెతుక్కుంటూ వచ్చి ధైర్యాన్నిచ్చారు. భవిష్యత్తుమీద ఒక ఆలోచన కలిగించారు. మీకు ఎలా థ్యాంక్సు చెప్పాలో, ఏం మాట్లాడాలో కూడా అర్ధం కావటం లేదు." అంది ఎంతో ఉద్వేగంతో.

సంబంధం లేక పోవటమేంటీ? మానవ సంబంధం అనేదొకటి మనందరి మధ్య వుంటుంది. కానీ మనమే దాన్ని మర్చిపోతాం. అయినా నీకోసం అంతమంది పోరాటం చేస్తున్నారు. కదా! మరి వాళ్ళకి కూడా నీతో ఏ సంబంధం లేదుగా?'' అన్నాను.

"నిజమే ఆంటీ కాని ఒక్క విషయం మనసు విప్పి మీతో చెప్పాలనుకుంటున్నాను. వాళ్ళంతా నాకు న్యాయం చేయాలని పోరాడుతున్నారు గానీ, వాళ్ళు చేస్తున్న విస్తృత ప్రచారం విపరీత పోకడలు కూడా నా భవిష్యత్తుని ఇబ్బంది పెడుతాయేమో అనిపిస్తుంది. విషయాన్ని బయటకు తేవటం వేరు, దానికి విస్తృత రూపం కల్పించటం వేరు. సమాజంలోని కొన్ని సంస్థలు, కొందరు వ్యక్తులు ఇలాంటి సంఘటనల్ని కూడా క్యాష్ చేసుకుంటున్నారేమో అనిపిస్తోంది. వాళ్ళకి శిక్ష పడ్డాక వీళ్ళందరూ

నన్ను మర్చిపోతారు. దానివల్ల నాకు జరిగే మంచికన్నా చెడే ఎక్కువగా వుంటోంది. నన్ను మానసికంగా యింకా కృంగదీస్తున్నట్టువుతోంది. ఆంటీ! మమ్మీ, డాడీ కూడా అదే ఫీలవుతున్నారు. నేనన్నదాంట్లో నిజం లేదా అంటీ'' అనడిగింది.

"ఎందుకు లేదు చాలా వుంది. ఉందనే విషయం వాళ్ళకి కూడా తెలుసు కానీ ఒప్పుకోరుగా" అన్నాను. నవ్వుతూ

నా నవ్వులోని భావం ఆమెకి కూడా అర్థం అయినట్టుంది. చిన్నగా ఒక నిట్టూర్పు విడిచింది. "అప్పుడూ ఆమె అశక్తురాలే. ఇప్పుడూ ఆశక్తురాలే " అనుకున్నాను వ్యవస్థని గుర్తుతెచ్చుకుని. టీ తాగి వాళ్ళందరి దగ్గర శెలవు తీసుకుని బయటకొచ్చాను. వచ్చేముందు ఈ పరిస్థితుల్లో ఆమెకి పేరెంట్స్ మోరల్ సపోర్ట్ ఎంత అవసరమో, ఎలాంటి సపోర్టు యివ్వాలో అనుభవంతో చెప్పి వచ్చాను. అవసరమైతే నాకు కాల్ చేస్తూ వుండమని చెప్పి నా నెంబరు యిచ్చాను.

రోడ్డుమీద నడుస్తున్నానే గానీ ఆమె అన్నమాటలే నా మెదడులో సుడులు తిరుగుతున్నాయి. "వాళ్ళు ఆ క్షణం నా ఆత్మాభిమానాన్ని దెబ్బతీశారు. నన్ను భయంకరంగా అవమానించారు. చెప్పండి నాకు న్యాయం ఎలా జరుగుతుంది?

ఆమె మాటల్లో ఎంతో వాస్తవముంది. ఆమె ఆత్మస్థైర్యంతో సమాజాన్ని ఎదిరించి ముందుకు వెళ్ళగలిగినా ఆ అవమానం తాలూకు మచ్చమాత్రం ఆమె మనసులో ఏదో ఒక మూల అలాగే మిగిలిపోయి ఆమెని బ్రతికినన్నాళ్ళు బాధిస్తూనే వుంటుంది. ఎందుకంటే ముప్పై ఏళ్ళనాటి ఆపీడకల ఇప్పటికీ నన్ను నిద్రలో ఉలిక్కిపడేలా చేస్తోంది. అంత భయంకరమైనది అ అనుభవం.

ఆమె అన్నట్టు వాళ్ళు నేరస్థులని కోర్టు తీర్పు చెబితే, చేసిన నేరానికి వాళ్ళకి పదేశిక్ష ఏడేళ్ళు లేదా పద్నాలుగేళ్ళు అవచ్చు. కానీ ఏ నేరం చేయకపోయినా కామాంధుల పైశాచికత్వానికి బలైపోతున్న ఆడవాళ్ళకి మానసికంగా పడుతున్న శిక్ష మాత్రం లైఫ్‌టైమ్.

ఎవరిచ్చారు వాళ్ళకీ అధికారం? ఎందుకు ఈ అరాచకం యిలా కొనసాగుతూనే వుంది?

ఎవరైనా ఈ ప్రశ్నకి నిజమైన సమాధానం చెప్పగలరేమో అని ముప్పై ఏళ్ళ నుంచి నిరీక్షిస్తూనే వున్నాను.

**(ఈ ఘటనపై పాఠకుల స్పందనను ఆహ్వానిస్తున్నాము.)**

---

**10వ పేజీ తరువాయి**

**అనాటి భాషాభిమానులు భవనాలను నిర్మింపచేశారు. నేటివారు పాఠశాలలను పడగొట్టి బహుళ అంతస్థుల భవనాలను, వ్యాపార సముదాయాల మాల్‌లను నిర్మించి స్వంతానికి స్వాహా చేస్తున్నారు.**

సంవత్సరాల వయసులో అకాలమృత్యువు మింగివేసింది. దానితో గుండేరావుగారి దృష్టి సేవా కార్యక్రమాల వైపు మారింది. పాఠశాల గుర్తింపుకొరకు హరిబౌలిలో రిఫా–యె–ఆమ్ ప్రాథమిక పాఠశాలను ఉర్దూ మీడియంలో ప్రారంభించారు. 1912లో గుర్తింపు పొందిన తదనంతరం తెలుగు మాధ్యమము లోనికి మార్పుచేశారు. తెలుగు మధ్యమంగా మార్చటానికి రాజ బహద్దూర్ కొత్వాల్ వెంకట రామిరెడ్డి, ఆంధ్రపిత మాడపాటి, కొండా వెంకట రంగారెడ్డి, సురవరం ప్రతాపరెడ్డి, దివాన్ శంకరరావు లాంటి మహానుభావులంతా కృషిచేసి నిజాం ప్రభుత్వాన్ని ఒప్పించటం జరిగింది. గుండేరావు పంపాడ్ మహారాష్ట్రీయుడు, ఆర్యసమాజ నాయకులు బి. వెంకటస్వామి, నాగరాజ్ నారాయణులు గుండేరావుగారు అప్తమిత్రులు.

గుండేరావుగారు నివసించే తన రెండంతస్థుల భవనంతోపాటు, ఇంటిలోని ఖాళీ జాగాను, మహబూబ్‌నగర్‌లోవున్న 102 ఎకరాల వ్యవసాయ భూమిని పాఠశాల నిర్వహణకోసం ఇచ్చివేసారు. దానకర్ణుని లాగా తనకున్న యావదాస్తిని పాఠశాల కిచ్చివేశారు. రిఫా–యె–ఆమ్ హైస్కూల్ పేరును 'వెంకట్రావ్ మెమోరియల్ హైస్కూల్'గా మార్చారు. 70సంవత్సరాలనుంచి హైదరాబాద్‌లోని పాతబస్తీలో నేటికి నడుపబడుతున్నది. ఆనాటి భాషాభిమానులు భవనాలను నిర్మింపచేశారు. నేటివారు పాఠశాలలను పడగొట్టి బహుళ అంతస్థుల భవనాలను, వ్యాపార సముదాయాల మాల్‌లను నిర్మించి స్వంతానికి స్వాహా చేస్తున్నారు.

---

**6వ పేజీ తరువాయి**

ప్రధానమంత్రిగా ఉండగానే 1470 వస్తువుల దిగుమతులపై నున్న అంక్షలను ఎత్తివేసారు. ఇందులో పప్పుండలు లాంటివి కూడా ఉన్నాయి. బిజెపి హయాంలోనే బీమారంగ బిల్లు పార్లమెంటులో ఆమోదించబడింది. విద్యుత్‌రంగాన్ని ప్రైవేటీకరించే ఎలక్ట్రిసిటీ యాక్టు 2003ను తెచ్చింది. ఒక మాటలో చెప్పలంటే సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ వేగవంతమైంది బిజెపి హయాంలోనే. అందుకని ప్రత్యామ్నాయ విధానాల కోసం పోరాడ్డం, ప్రత్యామ్నాయ విధానాలతో ముందుకొస్తున్న శక్తుల్ని అధికారంలోకి తేవడం మనందరి కర్తవ్యం. అప్పుడే దేశానికి, ప్రజలకు ముక్తి, మోక్షం.

**గమనిక :** క్వాంటిటేటివ్ ఈజింగ్ (అంటే ఏ వడ్డీ లేకుండా బ్యాంకులు డబ్బులివ్వడం)ను కొనసాగిస్తామని 19-9-2013 అమెరికన్ ఫెడరల్ రిజర్వు ఛైర్మన్ బెన్‌బెర్నాంకే ప్రకటించాడు. దీని వలన భారతదేశం నుండి డాలర్లు బయటకు వెళ్ళే క్రమం అగడంతో రూపాయి విలువ తిరిగి పుంజుకుంది.

స్ఫూర్తి

# అందరికీ అమ్మ


మాకినేని జగదాంబ

-సుధాకిరణ్ బి.

సాధారణంగా కనిపించే మహిళల్లో అవసరం వచ్చినపుడు వారిలో ఉన్న అసాధారణ ప్రజ్ఞా పాటవాలు వెలుగు చూస్తాయి. వారు నమ్మిన ఆశయం కోసం ప్రాణాలు కూడా పెద్దగా అనిపించవు. లక్ష్యాన్ని చేరుకోవడంలో పరిణితి, పరిస్థితుల్ని అర్థం చేసుకుని ముందుకు వెళ్లడంతో సమయస్ఫూర్తి వారి సొంతమైతే... వారు ఎన్నుకున్న బాటకి సహచరుడు తోడైతే... ఉద్యమ ఊయల్లో ఉగ్గుపాలు తాగకపోయినా... వారి జీవితం ఉద్యమ జీవితంలో అంతర్భాగమవుతుంది. కదిలే అడుగులకు వారు స్ఫూర్తి ప్రదాతలవుతారు. ఆ కోవలోకే వస్తారు. ఇటీవల మృతి చెందిన తెలంగాణా సాయుధపోరాట నాయకులు జగదాంబగారు.

కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలు మాకినేని బసవపున్నయ్య గారి భార్య, ఎల్‌బిజిగారి సోదరి అయిన జగదాంబ గారు సెప్టెంబర్ 18న హైదరాబాద్‌లో మృతి చెందారు. ఆమె కమ్యూనిస్టు యోధుల కుటుంబానికి చెందిన వ్యక్తిగా అందరికి తెలుసు. కానీ ఆమె కూడా కమ్యూనిస్టు యోధురాలే. సాయుధ తెలంగాణా పోరాటంలో కొరియర్‌గా పనిచేశారు. ఆమె గురించి...

గుంటూరు జిల్లా కొల్లూరు మండల క్రాపలో 1919లో జన్మించారు. తల్లి దండ్రులు లక్ష్మీకాంతమ్మ, సుబ్రమణ్యం సోదరి సక్కుబాయి. చిన్నతనంలోనే తల్లి మరణించడంతో ఇంటి వ్యవహారాలు పట్టించుకోవడంలో తండ్రికి తోడ్పాటుగా ఉండేవారు. తండ్రి ప్రోత్సాహంతో గుంటూరులో ఉన్నవ దంపతులు స్థాపించిన శారదానికేతన్‌లో చదువుకోవడానికి సోదరితో కలిసి చేరారు. అనంతరం బందర్‌లో ఇంటర్ చదివారు. స్వతహాగానే చురుకైన వ్యక్తిత్వం గలిగిన జగదాంబగారు నిత్యం అందుబాటులో ఉన్న సాహిత్యాన్ని అధ్యయనం చేసేవారు. ఆ క్రమంలోనే ఆమెకు రాజకీయాలపట్ల ఆసక్తి పెరిగింది. సోదరుడు కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత లావు బాలగంగాధర్‌గారు (ఎల్‌బిజి) సహకారం తోడవడంతో మహిళాభ్యుదయం, మహిళాసంఘం కార్యక్రమాల పట్ల ఆసక్తి చూపించారు. అప్పటికే కమ్యూనిస్టు ఉద్యమంలో అంతర్భాగమైన మాకినేని బసవపున్నయ్యగారితో వివాహానికి ఎల్‌బిజినే ప్రోత్సహించారు. తండ్రిని ఒప్పించి ఆ వివాహం జరిపించారు. మాకినేనితో వివాహం ఆమె జీవితం ఉద్యమ జీవితంలో అంతర్భాగమయ్యింది. 1943లో విజయవాడలో జరిగిన మహిళల రాజకీయ శిక్షణా తరగతులు ఆమెను మరింత కార్యోన్ముఖుల్ని చేశాయి. సమసమాజ భావాన్ని జీర్ణించుకున్న ఆవిడ పనివారిపట్ల కుడా వివక్ష చూపించేవారు కాదని, కుటుంబ సభ్యులతోపాటు ఆహారాన్ని సమంగా వారికి కూడా పంచేవారని జగదాంబ సోదరుని భార్య సరోజినిగారు మాట్లాడుతూ తెలిపారు. ప్రేమపూర్వకంగా పనులు చేయించేవారని, ఎవరు ఇంటికి వెళ్లినా సాదరంగా ఆహ్వానించేవారని తెలిపారు. ఇబ్బందుల్లో ఎవరైనా మహిళలు ఉంటే వారికి తన బట్టలు సైతం ఇచ్చి ఆదుకునేవారని, వయస్సులో ఇరువురికి పెద్దగా తేడా లేకపోయినా తనను చిన్నపిల్లగా భావించి తన పనులు కూడా ఆమె చేసేదని సరోజినిగారు ఆమె జ్ఞాపకాలు గుర్తు చేసుకున్నారు.

వార్తా పత్రికలన్నింటినీ చదవడం ఆమె రోజువారీ జీవితంలో ఒక అలవాటుగా ఉండేది. అధ్యయనం ద్వారా రాజకీయ పరిస్థితులు, సామాజిక పరిస్థితుల పట్ల ఆమె సంపూర్ణ అవగాహనతో ఉండేవారు. చదువరి అయిన ఎంబిగారు కూడా "ఏమిటి జగదాంబ పత్రికల్లో వార్తలు?" అని అడిగేవారట.

తెలంగాణ సాయుధ పోరాటం ముమ్మరంగా సాగుతున్న దశలో ముఖ్య నాయకత్వం అజ్ఞాతంలోకి వెళ్లాల్సిన పరిస్థితి.

సాధారణంగా కనిపించే మహిళల్లో అవసరం వచ్చినపుడు వారిలో ఉన్న అసాధారణ ప్రజ్ఞా పాటవాలు వెలుగు చూస్తాయి. వారు నమ్మిన ఆశయం కోసం ప్రాణాలు కూడా పెద్దగా అనిపించవు. లక్ష్యాన్ని చేరుకోవడంలో పరిణితి, పరిస్థితుల్ని అర్థం చేసుకుని ముందుకు వెళ్లడంతో సమయస్ఫూర్తి వారి సొంతమైతే... వారు ఎన్నుకున్న బాటకి సహచరుడు తోడైతే... ఉద్యమ ఊయల్లో ఉగ్గుపాలు తాగకపోయినా... వారి జీవితం ఉద్యమ జీవితంలో అంతర్భాగమవుతుంది. కదిలే అడుగులకు వారు స్ఫూర్తి ప్రదాతలవుతారు. ఆ కోవలోకే వస్తారు. ఇటీవల మృతి చెందిన తెలంగాణా సాయుధపోరాట నాయకులు జగదాంబగారు.

వార్తా పత్రికలన్నింటినీ చదవడం ఆమె రోజువారీ జీవితంలో ఒక అలవాటుగా ఉండేది. అధ్యయనం ద్వారా రాజకీయ పరిస్థితులు, సామాజిక పరిస్థితుల పట్ల ఆమె సంపూర్ణ అవగాహనతో ఉండేవారు.

కనిపిస్తే కాల్చివేత ఉత్తర్వులు అమలులో ఉన్న దుస్థితి. ఈ పరిస్థితుల్లో సాయుధ పోరాటానికి అవసరమైన ఆయుధాలు నాగపూర్‌నుంచి మద్రాసు తీసుకువచ్చేవాళ్ళు. అక్కడి నుంచి పోరాట వీరులకు అందించేవాళ్ళు. ఆయుధాలు సేకరించే పనిని ఎంబిగారు స్వీకరించారు. ఆ పనిలో అనేక దఫాలు ముఖ్య సహాయకారిగా జగదాంబగారు పనిచేశారు. స్వయంగా ఆయుధాలు తీసుకువచ్చి నిర్ణయించిన ప్రదేశంలో అందజేసేవాళ్లు. దొరికితే పర్యవసానాలు తెలుసు. ఉద్యమంలో ఉన్న మహిళల్ని పోలీసులు పెట్టే పాశవిక హింసా తెలుసు. అయినా ఆ పనిని ఉద్యమం కోసం రైలులో సాధారణ ప్రయాణికురాలిగా ప్రయాణించి ఆయుధాలు తీసుకుని తెలంగాణా సాయుధ పోరాటానికి అందించారు. మహారాష్ట్రలోని రహస్య కేంద్రాల నుండి స్టెన్‌గన్లు, బాంబులు తీసుకుని ఆదిలాబాద్ దాకా ఆమె ప్రయాణించి అక్కడి కార్యకర్తలకు అందజేసేవారు. తెలుగుతోపాటు ఇంగ్లీషు, హిందీ, మరాఠీ బాషలను నేర్చుకుని అవసరమైన సమయంలో ఆ బాషలు మాట్లాడుతూ ఆమె పోలీసుల నుంచి చాకచక్యంగా తప్పించుకునేవారు. పోరాట కాలంలో జీవిత సహచరుడు ఎం.బి.తోనే జగదాంబ గారు ఉండేవారు. తెలంగాణా సాయుధ పోరాట విరమణ తరువాత కార్యకర్తలపై కేసులు ఉపసంహరణ విషయంలో ఎంబిగారికి తోడ్పాటునందించారు.

అత్యంత బాధ్యతతో కుటుంబంలో కుటుంబసభ్యులు, కార్యకర్తలపట్ల మానవత్వం మూర్తీభవించిన మాతృమూర్తిగా వ్యవహరించేవారని వారితో పరిచయమున్న వారు తెలుపుతున్నారు. అది ఢిల్లీ అయినా, హైదరాబాద్ అయినా నిత్యం జగదాంబగారు రాజకీయాలను సునిశిత దృష్టితో అధ్యయనం చేసేవారు. 94 సంవత్సరాల వయస్సులో అనారోగ్యంతో తీవ్ర అస్వస్థత పరిస్థితుల్లో ఉన్నపుడు కూడా చూడటానికి వెళ్లిన తెలంగాణా సాయుధపోరాట నాయకురాలు మల్లు స్వరాజ్యంగారు, ఐద్వా రాష్ట్ర నాయకులు, మాజీ శాసన సభ్యులు పుతుంబాక భారతిగార్లతో జగదాంబగారు అప్పటి రాజకీయ పరిస్థితులు, సమస్యల గురించి చర్చించారని భారతిగారు జ్ఞాపకం చేసుకున్నారు.

జీవితం, రాజకీయం కలబోసిన వ్యక్తి జగదాంబగారు. కార్యకర్తలకు అమ్మగా, స్ఫూర్తి ప్రధాతగా నిలిచిన జగదాంబగారికి అశ్రునివాళి.

రిపోర్ట్

## అయ్యో.. ఆడపిల్ల!

**దే**శవ్యాప్తంగా 2012 లో మృత్యువాత పడిన 5 ఏళ్లలోపు చిన్నారుల్లో బాలుర కన్నా బాలికలు 74 వేలు ఎక్కువగా ఉన్నారు. ప్రపంచమంతా ఆధునికతను సంతరించుకుంటున్నా భారత్‌లో ఆడపిల్లల పట్ల ఉన్న వ్యతిరేక భావనను ఈ గణాంకాలు చెప్పకనే చెబుతున్నాయి. విషాదమేమిటంటే వెనుకబడిన రాష్ట్రాల కన్నా అభివృద్ధి చెందిన రాష్ట్రాలే ఆడపిల్లలను పురిటిలోనే చంపేయడంలో ముందున్నాయి. నోబెల్ పురస్కార గ్రహీత అమర్త్యసేన్ ఇటీవల రాసిన ఓ వ్యాసంలో భారత్‌లో ఆడపిల్లల సంఖ్య గణనీయంగా తగ్గిపోతున్న విషయాన్ని ప్రస్తావించారు. యూరోపియన్ దేశాల్లో ప్రతి వెయ్యి మంది మగ శిశువులకు 935 మంది ఆడశిశువుల జననం ప్రామాణికంగా ఉంది. భారత్‌లో కేవలం 10 రాష్ట్రాల్లో మాత్రమే ఆ స్థాయిలో గణాంకాలు నమోదవుతున్నాయని ఆయన తెలిపారు. ఈ పది రాష్ట్రాల్లో వెనకబడిన చత్తీస్‌గడ్ కూడా వుంది. ఇక్కడ ప్రతి వెయ్యిమంది మగ శిశువులకు 963 మంది ఆడశిశువులు ఉన్నారు. పశ్చిమబెంగాల్, ఒడిషా, బీహార్, తమిళనాడు వంటి రాష్ట్రాల్లో యూరోపియన్ ప్రమాణాలకు అనుగుణంగా ఆడ,మగ శిశువుల లింగనిష్పత్తి ఉందని అమర్త్యసేన్ వెల్లడించారు. మరోవైపు ముంబైకి చెందిన ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ పాప్యులేషన్ సైన్సెస్‌కు చెందిన ప్రొఫెసర్ ఉషారాం, యూనివర్సిటీ ఆఫ్ టొరంటోలోని సెంటర్ ఫర్ గ్లోబల్ హెల్త్ రీసెర్చ్‌కు చెందిన ప్రొఫెసర్ ప్రతిభా జాలు సంయుక్తంగా జరిపిన పరిశోధనల్లో దేశవ్యాప్తంగా ఉన్న 597 జిల్లాలకుగాను 430 జిల్లాల్లో 5 ఏళ్లలోపు ఆడశిశువుల మరణాలు ఎక్కువగా ఉన్నట్లు తేలింది. ఈ రాష్ట్రాల్లో సంభవించిన మొత్తం శిశుమరణాల్లో మగశిశువుల కన్నా 74వేల మంది ఆడశిశువులు ఎక్కువగా మృత్యువాతపడినట్లు ప్రతిభాజా తెలిపారు. జీవ శాస్త్రపరంగా అప్పుడే పుట్టిన ఆడశిశువు మగశిశువు కన్నా బలంగా ఉండటమే కాక బతికే అవకాశాలు కూడా ఎక్కువగా కలిగి ఉంటుంది. అందుకే ప్రపంచవ్యాప్తంగా అప్పుడే పుట్టిన మగపిల్లలు ఎక్కువగా మృత్యువాత పడుతుంటారు. అందుకు భిన్నంగా భారతదేశంలో ఆడశిశు మరణాలు ఎక్కువగా నమోదవుతున్నాయని ప్రొఫెసర్ జా పేర్కొన్నారు. దీనికి ప్రధాన కారణం ఆడపిల్లంటే ఉన్న వ్యతిరేక భావనే అని విశ్లేషించారు. దేశంలోని 9 రాష్ట్రాల్లో ఆడశిశు మరణాల్లో 77శాతం ఈ రాష్ట్రాల్లోనే సంభవిస్తున్నాయని జా తెలిపారు. ఆడ శిశు మరణాలు ఎక్కువగా సంభవిస్తున్న రాష్ట్రాల్లో గుజరాత్ కూడా ఉండటం గమనార్హం.

# ఆడపిల్లగా పుట్టడమే నా తప్పా?

(అక్టోబరు 11 బాలికా దినోత్సవం సందర్భంగా ..)

కె. అంజన

అమ్మ నన్ను 'చిన్నమ్మా' అంటుంది చిన్న గొంతుతో. నా వయసు పిల్లలు ఉయ్యాల్లో కట్టిన బొమ్మలతో హాయిగా ఆడుకుంటూ వుంటారు. నేను మాత్రం ఎప్పుడూ జబ్బుతో వుంటాను. బాధతో ఏడుస్తుంటాను. నా జబ్బు పేరేంటో కూడా నాకు తెలీదు. అయితే జబ్బుతో వున్నవాళ్ళను ఆస్పత్రికి తీసుకెళ్తారు కదా. నన్ను మాత్రం ఎప్పుడూ తీసుకెళ్ళలా. పైగా ఓ రోజు నన్ను రోడ్డుమీద వదిలేశారు. అందరూ వున్నా... ఎవరూ లేని దాన్ని అయిపోయాను. నా జబ్బు తగ్గించాలని... నన్ను బతికించుకోవాలని నా వాళ్లెవరూ అనుకోనేలేదు. ఆలశ్యంగా నాకో విషయం అర్థమైంది. నేను ఆడపిల్లని. మగపిల్లాణ్ణి కాదని. అందుకే ఇంట్లో వాళ్లు నన్ను వదిలించుకున్నారని.

* * *

ప్రభుత్వాసుపత్రిలో మంచంమీద నేనున్నాను. డాక్టర్లు ఏవేవో పరీక్షలు చేస్తున్నారు. నా కాళ్లు, చేతులు గోగుపుల్లలా సన్నగా వున్నాయి. ఎముకల మీద చర్మం వేసి కుట్టినట్టున్నాను. అయిదేళ్ల పిల్లనే అయినా రెండేళ్లంటే నమ్మేస్తారు. అంత బలహీనంగా వుంటాను. అమ్మ దూరంగా నిలబడి నోటికి కొంగు అడ్డు పెట్టుకుని లోలోపలే కుమిలిపోతోంది. నిజంగానే అమ్మ ఎంత అమాయకురాలు? నాకోసం ఎంతో బాధపడుతుంది. మరి నాన్నో! ఆయనకు చెప్పలేనంత కోపం, విసుగు. ఎప్పుడూ అమ్మ మీద అరుస్తూ కోప్పడుతూ చెయ్యి చేసుకుంటూ వుంటాడు. ఇంక ఆయన కంటికి నేను కనిపిస్తే చాలు, మరింత కోపిష్టి అయిపోతాడు. అందుకే అమ్మ నాకు చెప్తుండేది. నాన్న ఇంట్లో వున్నంతసేపు ఆయన ఛాయలకు కూడా వెళ్లొద్దు అని. తాతయ్య సంగతి కూడా చెప్పుకోవాలి. ఆయనకు నేనంటే అసహ్యం. నేను పుట్టిన రోజునే నానమ్మ చనిపోయిందట. అందుకే ఆయనకు నేనంటే ఇష్టముండదట. ఆవిడ చనిపోవడానికి నేనెలా కారణమో నాకు తెలీనేలేదు. ఇంక తమ్ముడు. వాడు నిజంగానే అందంగా, చలాకీగా, ఆరోగ్యంగా వుంటాడు. అందరికీ వాడంటే చెప్పలేనంత ఇష్టం. అందరూ వాణ్ణి గారాబం చేస్తారు. ఎన్నో నోముల తర్వాత పుట్టాడని వాడంటే అంత ప్రేమ. ఇంట్లో మంచివన్నీ వాడికే. మంచి బట్టలు, బొమ్మలు, పళ్లు, ఆహారం, చిరుతిళ్లు, ముద్దులు, పొగడ్తలు, ప్రేమ అన్నీ వాడికి మాత్రమే సొంతం. నాకోసం ఏమీ వుండవు. తరుముకొచ్చే పనులేవీ లేనప్పుడు.... అదీ ఇంట్లో ఎవ్వరూ లేనప్పుడు... మాత్రమే అమ్మ నన్ను దగ్గరకు తీసుకుంటుంది. ఆ అవకాశం కోసం నేను ఎంతగా ఎదురు చూస్తుంటానో నాకూ అమ్మకే తెలుసు. సరైన తిండిలేక, పోషణ లేక నేను ఎప్పుడూ జబ్బు పడుతుండేదాన్ని. నాకు ఊపిరితిత్తుల సమస్య వుందని మంచి వైద్యం చేయిస్తే నయమౌతుందని డాక్టర్లు చెప్పారు. కానీ నన్ను ఇంటికి తీసుకొచ్చేశారు వైద్యం చేయించకుండానే. డబ్బు ఖర్చవుతుందనే అలా చేశారని తర్వాత తెలిసింది. రోజులు గడిచేకొద్దీ ఊపిరి తీసుకోవడం కూడా కష్టంగా తయారైంది. ఓరోజు స్పృహ కోల్పోయాను. అలాంటి స్థితిలో వున్న నన్ను రోడ్డు మీద వదిలి వచ్చేయమన్నారు అమ్మను. అమ్మ కళ్ళు నాకోసం ఎడతెరిపి లేకుండా వర్షిస్తూనే వున్నాయి. అలా చాలా దూరం నడుచుకుంటూ ఓ ఆస్పత్రి దగ్గరలో నన్ను వదిలేసి వచ్చింది అమ్మ. అక్కడైతే అటు వచ్చిపోయే వారెవరైనా నన్ను చూసి దయతలచి కాపాడతారని అమ్మ దింపుడు కళ్లెం ఆశ. అటు పోతున్న ఓ రిక్షా తాత నన్ను చూసి జాలిపడి ఆస్పత్రికి తీసుకెళ్లాడు. అలా మూడు రోజులుగా ఆస్పత్రిలో పడున్నాను.... ప్రాణమున్న బొమ్మలా. డాక్టర్లు చెప్పేశారు. నేను బతికే అవకాశాలు లేవని.

* * *

ఆరోజు పరీక్ష హాల్లోకి ఎంత టెన్షన్‌గా వెళ్లానో. నేను చదివినవి వస్తాయో లేవో? బాగా రాయగలనో లేదో... నని ఒకటే టెన్షన్. క్వశ్చన్ పేపర్ చూసుకున్నాక గానీ నా గుండె నార్మల్‌గా కొట్టుకోవడం మొదలెట్టింది. అన్ని ప్రశ్నలను ఛాయిస్ కూడా వదలకుండా రాసేయగలను. కలం ఝుళిపించి పరిసరాలు మర్చిపోయి వరుసగా అడిషన్లు తీసుకుంటూ రాసేస్తున్నా... అప్పుడు జరిగింది. చాలా కాలంగా నా వెంటబడి ప్రేమిస్తున్నానంటూ వేధిస్తున్న ఓ రోడ్‌సైడ్ రౌడీ సరాసరి ... పరీక్ష హాల్లోకి... నా బెంచీ పక్కకీ... తన అనుచర గణంతో ఆయుధాలతో సహా దిగిపోయాడు. వాణ్ణి చూడ్డంతోనే నాకు

చెమటలు పోసి... కాళ్లు, చేతులు వణికిపోయాయి. ఎన్నో సార్లు కాలేజీకెళ్లే దారిలో అడ్డగించి ప్రేమిస్తున్నానని.. నన్ను కూడా ప్రేమించమని అడిగాడు. నాకలాంటి ఫీలింగ్స్ లేవని.... మరెప్పుడూ నాతో మాట్లాడొద్దని చెప్పినా ఆగలా. అలా వెంటబడుతూనే వున్నాడు. నాకూ ఓ మనసుందని, దానికి కూడా ఇష్టాయిష్టాలున్నాయని... అలాంటి మూర్ఖులకు ఎందుకర్థం కాదో తెలిసేది కాదు. ఇవాళ రావడంతోనే కొబ్బరిబొండాలు నరికే కత్తితో నా మీద దాడిచేశాడు. విచక్షణా రహితంగా. పరీక్ష పేపర్లమీదే రక్తపు మడుగులో ప్రాణం వదిలేశాను. నా ప్రాణంలో ప్రాణమైన చదువుకు, నేను సాధించాలనుకున్న విజయాలకు, చేరుకోవాలనుకున్న ఉన్నత స్థానాలకు శాశ్వతంగా దూరం కావాల్సి రావడం ఎంత బాధగా వుంటుందో!

* * *

అదో గొప్ప స్కూలు. తమ చిన్నారులకు చక్కటి విద్యాబుద్ధులు అందుతాయని, ర్యాంకుల రేస్‌లో పిల్లలు ముందుంటారని... దేశ నలుమూలల నుంచి డబ్బున్నవారు తమ పిల్లలను ఇక్కడ చేర్పిస్తుంటారు. మంచి ఫ్యాకల్టీ, లాబ్స్, లైబ్రరీ, హాస్టల్, గ్రౌండ్, వాతావరణం... చాలా బావుంటాయని నన్నూ కూడా అక్కడే చేర్చారు అమ్మానాన్నా. కానీ తండ్రిలాగా మా మంచి చెడ్డలు చూడాల్సిన బాధ్యతాయుత స్థానంలో వున్నవాడికే ఆడపిల్లలను చూస్తే కన్నుకుడుతుందని మారు వేషంలో వున్న ధుర్యోధనుడని... నేనెలా ఊహిస్తాను. తీరా స్కూల్లో చేరాక ... రెండేళ్లపాటు నరకం చూపించాడు. బొమ్మలా నాతో ఆడుకున్నాడు. నేనే కాదు! నాలాంటి ఆడపిల్లలెందరో వాడి కామానికి బలైపోయారు. నాకు నోరు మెదపడానికి లేదు. ఆఖరకు ప్రాణ స్నేహితులతో కూడా చెప్పడానికి వీలు లేనంతగా నన్ను రకరకాలుగా బ్లాక్‌మెయిల్ చేసన్తా అష్టదిగ్బంధనం చేసేశాడు. నాయిష్టం లేకుండా నా మీద చేస్తున్న అఘాయిత్యాన్ని ఎంతకాలం భరించాలో అర్థమయ్యేది కాదు. ఎన్ని రాత్రుళ్లు నిద్ర లేకుండా ఏడుస్తూ గడిపానో.. ఆ మృగాడి బారినుంచి బయటపడి... అమ్మానాన్నలను చేరుకోవాలని ఎంతగా తపించిపోయానో... అఖరికి ఓ రోజున అవకాశాన్ని చేజిక్కించుకుని వాడి ఛాయ కూడా పడనంత దూరంగా.... సుదూరంగా వెళ్లి ఫిర్యాదు చేశాను వాడిమీద.

గుడియా... చిన్నమ్మ... పింకీ..నన్నీ...! పేర్లు, ప్రదేశాలు, రాష్ట్రాలు, రాజధానులు వేరైనా వీరంతా మన దేశపు ఆడపిల్లలు. మగపిల్లలతో సమంగా ప్రేమను పంచుతూ పెంచుకుంటే అపర లక్ష్మీసరస్వతీదుర్గా సమానులే. కానీ అటువంటి ఆలంబన, ప్రోత్సాహం... వారికేవీ! కంటి పాపల్లా కాపాడాల్సిన పెద్దలే వీరిని నిర్లక్ష్యం చేసిన ఘటనలు కొన్నయితే... మృగాళ్లలా మీదపడి మనసుని, శరీరాన్ని గాయపరచిన, ప్రాణాలే హరించిన ఉదంతాలు మరికొన్ని. ఈ దేశంలో ఆడపిల్లలుగా పుట్టడమే వీరు చేసినా నేరమా? ఇలా ఆడపిల్లలను అమానవీయంగా చంపుకుంటూ పోతే ఈ భూమ్మీద మిగిలేదెవరు?

## సొగసు చూడతరమా!

## సుప్రభాత సొగసు చూడతరమా!

అందాలు వెతికింది నా మందార మనసు.
పృథ్వి ఉదయాన్నే రమ్మంది, చూడగా
తన సొగసు,
మహిని మేల్కొలిపేటి మార్తాండు పిలుపు.
మంచుతెర ఒకసారి, మరల కరిగే వేళ,
మేలిముసుగును తీసి పుడమి మురిసేవేళ,
నారింజ రంగంత జగతి నిండే వేళ
రవి కిరణ కరుణతో, ఆకుల్లో మొగ్గల్లో
మంచు మాణిక్యాల కాంతి మెరిసే వేళ,
వెలుగు రేఖలలో విరులు విరిసేవేళ
విరినవ్వి, ధర నవ్వి, నవ్వు నవరతనాలు పొంగి
పొరలే వేళ
ఉదయాన్నె రమ్మంది చూడగా తన సొగసు.
పచ్చన్ని గూళ్ళల్లో గువ్వలన్నీ,
వెచ్చన్ని వేకువను పలకరించే వేళ,
కిలకిలారావాల్ని అవని అవధరించే వేళ
గగనాన భాసించు భానుడే
తన ఒడిలో బాలుడై ఆటలాడేటి వేళ,
సంద్రాన్ని చూడగా రమ్మంది భూమాత
నా మందార మనసులో మకరందమును నింప,
ఉదయాన్నె రమ్మంది ధరణీ నన్ను.
దిగిరాను, దిగిరాను, పాన్పు దిగి రానని తలచి,
సొగసు చూడ తరమా!
ఈ ప్రభాత సొగసు చూడ తరమా!
సుప్రభాత సొగసు చూడ తరమా! పొమ్మంది.

- డా॥ డి.ఎల్. విద్య

పరిశీలన

# హెచ్.పి.వి వాక్సిన్ ప్రభావం - దుష్పరిణామాలు

- డా॥ కె. భారతీ సాగర్

ఇటీవలి సంవత్సరాలలో మనం తరచుగా డాక్టర్ సలహాలలో లేదా డాక్టర్స్‌చే వ్రాయబడిన వ్యాసాలలో కానీ ఒకటి గమనిస్తున్నాం. అదే సర్వైకల్ కాన్సర్ వ్యాధి రాకుండా నివారణ కొరకు హెచ్.పి.వి. వ్యాక్సిన్ చేయించుకోమని. అదే వార్తా పత్రికలలో ఇంకో వార్త కూడా చదివాం. అదేమిటంటే సర్వైకల్ వాక్సిన్ పరిశోధన ప్రయోగాలవలన ఖమ్మం జిల్లాలో సంభవించిన మరణాలు. ఈ రెండు వార్తలను తులనాత్మకంగా చూసినపుడు మనకేమనిపిస్తుంది? హెచ్.పి.వి వాక్సిన్ ప్రయోగం వివాదాస్పదమని కదూ! అందుకే దానిని గురించిన వివరాలు మనం తెలుసుకోవలసిన అవసరం ఉంది. ప్రస్తుత వ్యాసంలో థీమ్‌కూడా అదే.

హ్యూమన్ పాపిల్లోమా వైరస్ అనే వైరస్ సోకటం వలన కొద్ది శాతం మందిలో వివిధ రకాల కాన్సర్లు వస్తాయి. వాటిలో ముఖ్యమైనది. స్త్రీలలో వచ్చే సర్వైకల్ కాన్సర్, జననేంద్రియాలలో వచ్చే పులిపిరులు (వార్ట్స్), స్త్రీ, పురుషులు ఇరువురిలో వచ్చే కొన్ని రకాల నోటి కాన్సర్, గుద క్యాన్సర్లు. ఈ వైరస్ సాధారణంగా లైంగిక సంపర్కం వలన సంక్రమిస్తుంది. ఈ హెచ్.పి.వి. వైరస్ సోకకుండా నివారించటానికి కనిపెట్టబడిన వాక్సినే హెచ్.పి.వి వాక్సిన్. ఇది 2006 లో అమెరికాలోని FDA అమోదం పొంది. 'గర్డాసిల్' (gardasil) అనే పేరుతో మార్కెట్‌లోకి వచ్చింది. తరువాత 'సర్వారిక్స్' (cervarix) అనే పేరుతో 2009 లో రెండో హెచ్.పి.వి వాక్సిన్ మార్కెట్‌లోకి వచ్చింది. ఈ రెండు వాక్సిన్‌లు హెచ్. పి. వి. వైరస్ రకాలైన HPV-6, HPV-11, HPV-16, HPV-18లను నివారించ గలుగుతాయి. ఈరెండు వైరస్‌ల వలన స్త్రీలలో సర్వైకల్ కాన్సర్లు, గుద కాన్సర్లు, వెజైనల్ కాన్సర్లు, వల్వల్ (vul-val) కాన్సర్లు వస్తాయి. కాని ఈ వైరస్ సోకిన అందరిలో కాన్సర్ రాదు. ఈ వైరస్ ముందే సోకి ఉండి, తరువాత వాక్సిన్ తీసుకుంటే ఆ స్త్రీలలో 44.6 శాతం కాన్సర్ సోకే అవకాశాలున్నాయని తెలిసింది.



ఈ వాక్సిన్ 9 నుంచి 26 సంవత్సరాల వయసున్న స్త్రీలకి, పురుషులకి ఇవ్వటానికి సిఫార్సు చేయటమైనది. ఈ వాక్సిన్ వలన ఈ క్రింది దుష్పరిణామాలు సంభవించే అవకాశాలున్నాయి :

రియాక్షన్ మరణం (అనాఫైలాక్టిక్ రియాక్షన్), స్పృహ తప్పటం, తలతిరగటం, ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచన కలగటం, తలనొప్పి, జ్వరం,

రక్తం గడ్డకట్టడం, మూర్ఛవ్యాధి, (గ్రాండ్‌మాల్ కన్వల్షన్స్), గిల్లేన్ - బరీ సింద్రోమ్, పక్షవాతం, కోమాలోకి వెళ్ళటం. మొ॥గునవి.

ఈ వాక్సిన్ ఉపయోగాన్ని ప్రపంచ ఆరోగ్య సంస్థ, అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా లాంటి దేశాలలోని ప్రజారోగ్య అధికారులు సిఫారస్ చేశారు.

అయితే అమెరికాలో ఏదైనా వాక్సిన్‌కి లైసెన్స్ ఇచ్చిన తరువాత కూడా వాక్సిన్ సురక్షితని ఫెడరల్ ఏజన్సీలు మరియు వాక్సిన్ తయారీదారులు పరీక్షిస్తూనే ఉంటారు. అమెరికాలో జూన్ 2006 నుంచి మార్చి 2013 వరకు సుమారుగా 57 మిలియన్ మందికి హెచ్.పి.వి. వాక్సిన్ ఇచ్చారు. అందులో 22,000 మందిలో వాక్సిన్ తాలూకు దుష్పరిణామాలు తలెత్తాయి. వాక్సిన్ అడ్వర్స్ ఈవెంట్స్ రిపోర్టింగ్ సిస్టమ్ (VAERS) అమెరికాలో ఈ సంస్థ ఇచ్చిన గణాంకాల ప్రకారం ఇప్పటి వరకు హెచ్.పి.వి వాక్సిన్ వలన ఈ క్రింది దుష్పరిణామాలు తలెత్తాయి.

140 మందిలో మరణాలు, 952 మందిలో డిసెబిలిటి, 6032లో రికవరీ జరగలేదు. 531లో పాప్ స్మియర్ అబ్‌నార్మల్‌గా వుంది, సర్వైకల్ డిస్‌ప్లేసియా 214 మందిలో, సర్వైకల్ కాన్సర్ 64 మందికి, మరియు ప్రాణాన్ని ప్రమాదంలో పడవేసే దుష్పరిణామాలు 562 మందిలో సంభవించాయి. ఎమర్జెన్సీ రూమ్ విజట 10,557 మంది చేసారు. చిన్న చిన్న సమస్యలతో ఆసుపత్రిలో చేరినవారు 3,065. మొత్తం 30,352 మందిలో దుష్పరిణామాలు తలెత్తగా అందులో 6, 032 కేసుల్లో రికవరీ జరగలేదు. మరియు 4,091 మందిలో సీరియస్ సమస్యలు

నమోదైనాయి.

ఇంత పెద్ద ఎత్తున మరణాలకి కారణమైన వాక్సిన్‌పైన ఎటువంటి చర్యలూ తీసుకోలేదు. అలాగే ప్రపంచ ఆరోగ్య సంస్థ కూడా నిశ్శబ్దంగా ఉంది. ఈ వాక్సిన్ తయారీదారులు, మెర్క్ సంస్థ (గర్డాసిల్) మరియు గ్లాక్సో స్మిత్‌క్లైన్ (సర్వారిక్స్), వివిధ దేశాల ఆరోగ్య సంస్థలు ఈ ప్రమాదకరమైన వాక్సిన్‌ని అప్పుడే పుట్టిన శిశువులకి కూడా వేయటానికి ప్రణాళికలు వేస్తున్నారు.

డా॥ మెర్కోలా అనే వైద్యుడు హెచ్.పి.వి. వాక్సిన్‌పై లైసెన్స్‌కి ముందు మరియు తరువాత జరిగిన పరిశోధనలను పరిశీలించి వ్రాసిన పరిశీలన వ్యాసంలో ఆయన ఈ క్రింది వివరాలను అందించారు.

– హెచ్.పి.వి వాక్సిన్ పూర్తిగా సురక్షితమని ఇంకా తేలలేదు.

– ఈ వాక్సిన్ పరిశోధించటానికి డిజైన్ చేసిన పరిశోధన పద్ధతులు. అనేక లోపాలతో కూడుకొని ఉన్నాయి. క్లినికల్ పరిశోధన ఫలితాలను కూడా సెలక్టివ్‌గా 'చెర్రీ పికింగ్' పద్ధతిలో తీసుకొన్నారు. దీనితో వాక్సిన్ ప్రభావాన్ని నిర్ధారించటంలో నెగటివ్ రిపోర్టింగ్‌ని పరిగణనలోకి తీసుకొనకుండా ఫలితాలను ప్రకటించారు.

– ప్రస్తుతం రిపోర్ట్ చేయబడుతున్న వాక్సిన్ దుష్పరిణామాలైన మరణం, శాశ్వత వికలాంగత వంటి వాటిని పరిశీలిస్తే, ఈ వాక్సిన్ సురక్షితం కాదని తెలుస్తుంది.

ఈ వాక్సిన్, కాన్సర్ నివారణలో ప్రతిభావంతమైనది కాదు కాని, అమ్మాయిల ఆరోగ్యాన్ని మాత్రం ప్రమాదానికి గురి చేస్తోంది.

అందుకే డా॥ మెర్కోలా, సర్వైకల్ కాన్సర్ మరణాలను తగ్గించటానికి ప్రతిభావంతమైన పద్ధతి సర్వైకల్ స్క్రీనింగ్ చేయటమే అని నిర్ధారించారు.

అంతిమంగా తెలుసుకొనవలసిన వాస్తవం ఏమిటంటే హెచ్.పి.వి. వాక్సిన్ కణంలో కాన్సర్ మార్పుల్ని కలగజేసే అతికొన్ని వైరస్‌లను మాత్రమే రాకుండా నిరోధించగలుగుతుంది. కొంతమందిలో అయితే ఇది సర్వైకల్ కాన్సర్‌ని కూడా కలిగించగలుగుతుంది. ఇది యాంటీ కాన్సర్ వాక్సిన్ కాదు. ఇది కేవలం కాన్సర్‌ని కలిగించే ఒక వైరస్ యొక్క కొన్ని జాతులను మాత్రం రాకుండా నిరోధిస్తుంది కాని కాన్సర్ మరణాలని కాదు.

పాశ్చాత్య మీడియా మాత్రం ఈ వాక్సిన్‌ని ఆకాశానికెత్తేసి, దీని ప్రయోగం వలన ఎటువంటి ప్రమాదకరమైన దుష్ప్రభావాలు లేవని తేల్చేసింది. వీళ్ళు కేవలం వాక్సిన్ తయారీదారైన మెర్క్ & కంపెనీ ఇచ్చిన నివేదిక ఆధారంగానే రిపోర్ట్ చేశారు కానీ, ఇదే వాక్సిన్ పైన కెనడియన్ టీమ్ ఇచ్చిన నివేదికని వదిలేశారు.

అమెరికా సిటిజన్స్ అత్యధికంగా బ్రౌజ్ చేసే WebMD (రెండవస్థానం) వెబ్‌సైట్ కూడా ఫార్మస్యూటికల్ ఇండస్ట్రీకీ అనుకూలంగా హెచ్.పి.వి. పేజ్‌లో కూడా ఈ వాక్సిన్ ప్రయోగం వలన ప్రమాదకరమైన దుష్పరిణామాలు ఏవీ లేవని చెబుతుంది.

VAERS (vaccin advrse event reporting system) సంస్థకి చెందిన అనలిస్ట్ జాన్ స్టోక్ విస్ కూడా, వాక్సిన్ ఇవ్వటం మొదలు పెట్టిన ఆరుసంవత్సరాలలో, వాక్సిన్ ఇచ్చిన స్త్రీలలో అసాధారణమైన పాప్ స్మియర్ రిపోర్టులు, సర్వైకల్ డిస్‌ప్లేసియా, సర్వైకల్ కాన్సర్ రేటు నాటకీయంగా పెరిగిందని నిరూపించాడు.

అమెరికన్ జర్నల్ ఆఫ్ ఆబ్‌స్టేట్రిక్స్ అండ్ గైనక్కాలజీ, జనవరి 2012 సంచికలో 'ATHENA HPV' అనే పరిశోధనని ప్రచురించింది. ఈ స్టడి కోసం, అమెరికాలో సర్వైకల్ కాన్సర్ స్క్రీనింగ్ పరిశోధనలలో భాగంగా 21 సంవత్సరాలకి పై బడిన 47, 208 స్త్రీలను 61 పరిశోధన కేంద్రాలనుంచి ఎన్నుకున్నారు. ఈ పరిశోధకులు తేల్చిన నిజాలు ఏమిటంటే:

వాక్సిన్ తీసుకున్న వారిలో, వాక్సిన్ తీసుకోని వారికన్నా 0.6.శాతం లో మాత్రమే ఈ వాక్సిన్ HPV-16 ఇన్ఫెక్షన్‌ను తగ్గించ గలిగింది.

2. ఇంకా ముఖ్యమైన నివేదిక ఏమిటంటే వాక్సిన్ ఇచ్చిన స్త్రీలలో, వాక్సిన్ ఇవ్వని స్త్రీలకన్నా 2.6 నుండి 6.2 శాతం మందిలో ఇతర హైరిస్క్ హెచ్.పి.వి. ఇన్ఫెక్షన్లు సోకాయి.

ఈ వాక్సిన్ గురించి ఇన్ని విషయాలు తెలుసుకున్నా వీటన్నిటికీ పరాకాష్ట అయిన ఇంకో విషయాన్ని కూడా మనం తెలుసుకోవాలి. అదేమిటంటే 2011వ సంవత్సరంలో కాలిఫోర్నియా రాష్ట్ర గవర్నర్ జెర్రీ బ్రౌన్ సంతకం చేసిన బిల్లు గురించి ఈబిల్లు ప్రకారం, ఆ రాష్ట్రంలో నివసించే 12 సంవత్సరాల వయసున్న పిల్లలందరికీ గర్డాసిల్, సర్వారిక్స్ వాక్సిన్లు తల్లి, తండ్రులకి తెలియకుండా వారి అనుమతి లేకుండా కూడా ఇవ్వ వచ్చునని.

ఈ వాక్సిన్ లాంచ్ చేసిన తరువాత అమెరికా ఫెడరల్ గవర్నమెంట్ 49మంది హెచ్.పి.వి. వ్యాక్సిన్ బాధితులకి 6 మిలియన్ డాలర్లని పరిహారంగా చెల్లించింది. ఏ వాక్సిన్ వల్లనైనా ఎవరైన దుష్పరిణాలమాలకు గురిఅయితే వారికి నష్టపరిహారంచెల్లించటానికి అమెరికాలో డిపార్ట్‌మెంట్ ఆఫ్ హెల్త్ అండ్ హ్యూమన్ సర్వీసెస్‌లో 'నేషనల్ వాక్సిన్ ఇంజురీ కాంపన్సేషన్ ప్రోగ్రామ్' క్రింద నష్టపరిహారం చెల్లిస్తారు. ఈ కార్యక్రమంలో 2013 మార్చి వరకు 200మంది హెచ్.పి.వి. వాక్సిన్ బాధితులు పరిహారం కొరకు అర్జీలు

**ఇంత పెద్ద ఎత్తున మరణాలకి కారణమైన వాక్సిన్‌పైన ఎటువంటి చర్యలూ తీసుకోలేదు. అలాగే ప్రపంచ ఆరోగ్య సంస్థ కూడా నిశ్శబ్దంగా ఉంది. ఈ వాక్సిన్ తయారీదారులు, మెర్క్ సంస్థ (గర్డాసిల్) మరియు గ్లాక్సో స్మిత్‌క్లైన్ (సర్వారిక్స్), వివిధ దేశాల ఆరోగ్య సంస్థలు ఈ ప్రమాదకరమైన వాక్సిన్‌ని అప్పుడే పుట్టిన శిశువులకి కూడా వేయటానికి ప్రణాళికలు వేస్తున్నారు.**

**ఈ విషయం మీద ఐద్వా పెద్ద ఎత్తున పోరాటాలు చేసింది. ఐద్వా జాతీయ నాయకురాలు శ్రీమతి బృందాకరత్‌తోపాటు రాష్ట్ర మరియు స్థానిక నాయకత్వం సంక్షేమ హాస్టళ్లకు వెళ్ళి బాలికలను కలిసి హెచ్.పి.వి. వ్యాక్సిన్ ప్రయోగించడంవల్ల వారి ఆరోగ్యంపై కలిగే దుష్ప్రభావాలను పరిశీలించింది. వార్డెన్‌లను, తల్లిదండ్రులను కలిసి విషయాలను తెలుసుకోవడంతోపాటు ఉద్యమం చేపట్టింది.**

పెట్టారు. అందులో 49మందికి ప్రభుత్వం ఆరు మిలియన్ డాలర్ల ధనాన్ని ఇచ్చింది. ఈ 49మందిలో ఇద్దరు మరణించిన వాళ్ళు, మిగతావాళ్లు తీవ్రమైన ఆరోగ్య సమస్యలతో బాధపడినవారు. 200 మంది పరిహారం దాఖలు చేస్తే ఇంకా 92మంది కేసులు పెండింగ్‌లో ఉన్నాయి. వీటిలో 5 మరణించిన కేసులు కాగా 87మంది తీవ్రమైన ఆరోగ్య సమస్యలతో బాధపడినవారు.

ఈ వివరాలన్నీ వాషింగ్టన్‌లోని జుడిషియల్ వాచ్‌డాగ్ అనే సంస్థ సమాచార హక్కు చట్టం క్రింద గవర్నమెంట్ నుంచి సంపాదించిన పత్రాల ద్వారా వెలుగుచూశాయి.

పైవన్నీ అమెరికాలో జరిగిన సంఘటనలైతే ఇండియాలో కూడా లైసెన్స్ పొందిన తరువాత గర్డాసిల్ వాక్సిన్‌ని ఆంధ్ర ప్రదేశ్‌లోని ఖమ్మం జిల్లాలో ప్రయోగించారు. ఈ ప్రయోగాలు వికటించి నలుగురు అమ్మాయిలు చనిపోయారు. పాథ్ అనే సంస్థ బిల్ మరియు మిలిండా గేట్స్ ఫౌండేషన్ ఆర్థిక సహాయంతో ఇండియాలో ఆంధ్ర మరియు గుజరాత్ రాష్ట్రాలలో హెచ్.పి.వి. వాక్సిన్‌పైన క్లినికల్ స్టడీస్ చేసింది 2010వ సంవత్సరంలో. అయితే ఈ ప్రయోగాలు నిబంధనలకు విరుద్ధంగా జరిగాయి. డ్రగ్స్ కంట్రోలర్ జనరల్ ఆఫ్ ఇండియా దీనికి అనుమతి ఇవ్వకముందే ఇండియన్ కౌన్సిల్ ఫర్ మెడికల్ రీసెర్చ్ సంస్థ నిబంధనలు అతిక్రమించి ఇచ్చిన అనుమతులతో మెర్క్ కంపెనీకి, గ్లాక్సో-స్మిత్‌క్లైన్ కంపెనీలకు లాభాలు చేకూర్చటానికి ఈ వాక్సిన్‌ని ప్రయోగించారు.

ఈ ప్రయోగాలలో నలుగురు అమ్మాయిలు చనిపోగా దాదాపు 120మంది విద్యార్థులు తీవ్రమైన ఆరోగ్య సమస్యలను ఎదుర్కొన్నారు.

ఈ విషయం మీద ఐద్వా పెద్ద ఎత్తున పోరాటాలు చేసింది. ఐద్వా జాతీయ నాయకురాలు శ్రీమతి బృందాకరత్‌తోపాటు రాష్ట్ర మరియు స్థానిక నాయకత్వం సంక్షేమ హాస్టళ్లకు వెళ్ళి బాలికలను కలిసి హెచ్.పి.వి. వ్యాక్సిన్ ప్రయోగించడంవల్ల వారి ఆరోగ్యంపై కలిగే దుష్ప్రభావాలను పరిశీలించింది. వార్డెన్‌లను, తల్లిదండ్రులను కలిసి విషయాలను తెలుసుకోవడంతోపాటు ఉద్యమం చేపట్టింది. పై విషయాలపై పార్లమెంటులోపల, బయట పెద్ద ఎత్తున చేసిన పోరాటాలవల్ల భారత ప్రభుత్వం దీనిమీద ఒక స్థాయీ సంఘాన్ని నియమించింది. ఆ కమిటీ నిగ్గుతేల్చిన వాస్తవాలను పార్లమెంటుకి సమర్పించింది.

**కమిటీ నివేదికలోని అంశాలు:**

- ఖమ్మంజిల్లాలో మరణాలకు హెచ్.పి.వి. వాక్సినే ప్రధాన కారణం. పాథ్ సంస్థ నిబంధనలకు విరుద్ధంగా వ్యవహరించిందని, దీనిమీద అవసరమైన చర్యలు తీసుకోవటానికి అమెరికా గవర్నమెంటుతో భారత ప్రభుత్వం మాట్లాడాలి.
- పాథ్ సంస్థ నిబంధనలకు విరుద్ధంగా అంటే మొదట పెద్దల మీద ప్రయోగాలు చేయకుండా చిన్న అమ్మాయిల మీద ప్రయోగాలు చేసింది. ఇది భారతీయ చట్టాలకు విరుద్ధమైంది.
- పాథ్ సంస్థ ఇది పరిశీలనా ప్రయోగం అని తెలిపింది. కానీ అది క్లినికల్ స్టడీ చేసింది. అది కూడా కనీస ప్రాథమిక ప్రమాణాలను పాటించకుండా చేసింది.
- పరిశోధనా పత్రాలను కూడా చూడకుండా ఎట్లా CDSCO (సెంట్రల్ డ్రగ్స్ స్టాండర్డ్ కంట్రోల్ ఆర్గనైజేషన్) అనుమతిని ఇచ్చిందని విస్మయం వ్యక్తం చేసింది.
- ప్రయోగాలకు అడ్డగోలు అనుమతులు ఇచ్చినందుకు ఐ.సి.ఎమ్.ఆర్.ని కూడా తప్పుపట్టింది.
- ఈ విషయం మీద అంతర్జాతీయంగా డైలాగ్‌ని ప్రభుత్వం ప్రారంభించాలి.
- ఈ విధమైన ప్రయోగాలు పాథ్ సంస్థ భారత్‌లోనేకాక ఉగాండా, పెరు, వియత్నాం దేశాలలో కూడా చేసింది. భారత ప్రభుత్వం ఈ దేశాలతో కూడా మాట్లాడి ద్వైపాక్షిక మార్గాలలో భారత ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకోవాలి.
- అంతర్జాతీయంగా ఈ విషయం మీద ప్రపంచ ఆరోగ్య సంస్థ, యూనిసెఫ్ లాంటి సంస్థల దృష్టికి తీసుకెళ్ళి అవసరమైన చర్యలు తీసుకోవాలి.
- పాథ్ సంస్థ ప్రయోగాలు, ప్రణాళికాబద్ధంగా భారతీయ మార్కెట్‌ని కొల్లగొట్టడానికి వేసిన ఎత్తని విమర్శించింది.

పార్లమెంటరీ స్టాండింగ్ కమిటీ లేవనెత్తిన అంశాలు, నిర్ధారణ పట్ల ఐద్వా హర్షం వ్యక్తం చేసింది. ఐద్వా క్షేత్రస్థాయిలో చేసిన పరిశీలనలో కూడ ఇవే అంశాలు బయటపడ్డాయి. స్టాండింగ్ కమిటీ నివేదికలో అంశాలను పరిగణనలోనికి తీసుకొని భారత ప్రభుత్వం ఇటువంటి ప్రయోగాలకు అనుమతి ఇచ్చేటప్పుడు ముందస్తు జాగ్రత్తలు తీసుకోవాలి. •

**గమనిక**

చట్టాలకు సంబంధించిన శీర్షికలో "మనవర్తి చట్టం"కు పైన ఇంగ్లీషులో వున్న హెడ్డింగ్‌లో "Wives"అనే పదానికి బదులు "Wivaha" అని అచ్చయ్యింది. పొరపాటు జరిగింది. గమనించగలరు.

ఎడిటర్



స్టడీ

# రష్యా విప్లవంలో మహిళల పాత్ర

## (1917 అక్టోబరు విప్లవం సందర్భంగా)

కె.నర్సమ్మ

1917 అక్టోబర్ విప్లవం ప్రపంచ చరిత్ర గతినే మార్చివేసింది. ఆ విప్లవం నేటికీ ప్రపంచ శ్రామికులకు స్ఫూర్తిదాయకంగా ఉంది. సమాజంలో సగభాగంగా ఉన్న మహిళలు అంతటి మహావిప్లవంలో గొప్పపాత్ర పోషించారు. ఆ విప్లవంలో మహిళల అనుభవాలు మహిళా ఉద్యమాలకు మార్గదర్శకం. ఆనాటి విప్లవంలో మహిళలు వేలూ లక్షల సంఖ్యలో పాల్గొన్నారు. పట్టణాలలో కార్మిక మహిళలు, పేద కార్మికుల భార్యలు, మేధావులతోపాటు గ్రామీణ ప్రాంతాలలో రైతు మహిళలు చురుకైన పాత్ర పోషించారు. ఎన్నో కష్టాలను భరించారు. పురుషులకు ధీటుగా త్యాగాలు చేశారు.

రష్యన్ రాజకీయ రంగంపై సోషల్ డెమోక్రటిక్ పార్టీ కీలకపాత్ర పోషించడం మొదలైన తరువాత ఆ పార్టీకి చెందిన మహిళా నేతలు పార్టీలో ప్రముఖ పాత్ర పోషిస్తూనే మహిళలను విప్లవంలో భాగస్వాములను చేస్తూ వారి ప్రత్యేక సమస్యలపై గొప్ప కృషి చేశారు. విప్లవానికి ముందు ఫ్యాక్టరీలలో మూడోవంతు మంది మహిళలే ఉండేవారు. వారు ఇంటి పనులు చేసుకుంటూనే సమ్మెల్లోను, ఉద్యమాల్లోను పురుషులతో సమానంగా పాల్గొనేవారు. పురుష కార్మికులు స్త్రీ కార్మికుల పట్ల చిన్నచూపు చూస్తుండేవారు. రాజకీయాలు వారికనవసరమని భావిస్తుండేవారు. విప్లవం విజయవంతమై సోషలిజం స్థాపించబడితే మహిళల సమస్యలు వాటంతటవే పరిష్కారమైపోతాయని తలచేవారు.

కార్మికవర్గ పార్టీ మహిళా కార్మికుల ప్రత్యేక సమస్యలను పట్టించుకోవాలని, లేకుంటే వారు బూర్జువా ఫెమినిస్టు సంఘాలవైపు ఆకర్షించబడే ప్రమాదం ఉందని కొల్లంతాయ్ వంటి నేతలు వాదించేవారు. శ్రామిక మహిళలు కార్మిక వర్గానికి ప్రాతినిధ్యం వహించే బోల్షివిక్ పార్టీ లోపలే ఉండి తమ హక్కుల కోసం పోరాటం చేయాలని ప్రచారం చేసేవారు.

విప్లవం విజయవంతం అయిన తరువాత కూడా ఈ కృషి కొనసాగింది. మహిళలకు సంబంధించిన చట్టాలను నూతన ప్రభుత్వం చేసింది. వాటి అమలు సక్రమంగా జరగాలంటే పోరాటం ఎంతో అవసరం అని ప్రభుత్వంలో ఉన్న ఏకైక మహిళా మంత్రి కొల్లంతాయ్ చెప్పింది. మహిళా సమస్యలను ప్రముఖంగా ముందుకు తీసుకురావాలంటే వారికి ఒక ప్రత్యేక సంస్థ ఉండాలని వాదించింది.

లెనిన్ మహాశయుడు 'ఏమిచెయ్యాలి'? అనే ప్రముఖ కరపత్రాన్ని తయారు చేశాడు. ఈ సిద్ధాంత పత్రంలో విప్లవాన్ని నడిపించే పార్టీ ఎలా ఉండాలి? అనే తన వ్యూహాన్ని పొందు పర్చాడు. ఈ వ్యూహం ప్రకారం మేధావులు పూర్తికాలం పని చేసే విప్లవకారులతో కూడిన

పార్టీ యజమానులపై కార్మికులు చేసే పోరాటాలకు మద్దతు ఇస్తుంది. ఈ పోరాటాల్లో ప్రజలందరూ పాల్గొనే ప్రజాపోరాటాలుగా అభివృద్ధి చెందుతాయి.

లెనిన్ బోధలకు ఉత్తేజితులైన కార్మికులు, రైతులు ఫ్యాక్టరీలను స్వాధీనం చేసుకుని పెట్టుబడిదారులను, జార్ చక్రవర్తిని అధికారం నుండి కిందికి దించారు. తరువాత సోవియట్ సోషలిస్టు ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు.

చాలా స్వల్ప వ్యవధిలో బోల్షివిక్ విప్లవం మహిళల జీవితాల్లో అద్భుతమైన మార్పులు తెచ్చింది. పాత కుటుంబ జీవితం నిలువు లోతున శాశ్వతంగా కప్పిపెట్టబడింది. ఆ స్థానంలో అంతకన్నా మెరుగైన జీవితాన్ని అందించడానికి బోల్షివిక్‌లు కంకణం కట్టుకున్నారు. 1917లో చేసిన వివాహ చట్టం వివాహం-విడాకులను సులభం చేసింది గర్భస్రావం చట్టసమ్మతం కావించబడింది. అన్ని వివాహాలు నమోదు- అయినవి, కానివి కూడా గుర్తించబడినాయి. పిల్లల సంరక్షణ బాధ్యత ప్రభుత్వం చేపట్టింది. వెనకబడిన రష్యాలో ఈ మార్పులు సాధించబడడం చిన్న విషయం కాదు.

1918-20 వరకు మహిళలు అంతర్యుద్ధంలో పోరాడారు. 1941-44 వరకు నాజీలు సోవియట్‌పై దురాక్రమణ చేసినపుడు ఆ భయంకర యుద్ధంలో, హిట్లర్‌ను ఓడించడంలో మహిళలు వీరోచిత పాత్ర పోషించారు.

యుద్ధం, విప్లవం శక్తి - స్వతంత్రత ఉన్న నూతన మహిళలను సృష్టించాయి. బోల్షివిక్ విప్లవం మహిళల జీవితాల్లో తెచ్చిన మార్పు యావత్ ప్రపంచంలోని మహిళలకు, మహిళా ఉద్యమాలకు ఉత్తేజాన్నిచ్చింది.

**(మెదక్‌లో జరిగిన మహిళాస్టడీ సర్కిల్‌లో వచ్చిన అభిప్రాయాల ఆధారంగా)**

మణిపూస

# ధీర వనిత శారద

-ఎస్. జగదీశ్వరి

ఆదర్శ కమ్యూనిస్టు కుటుంబంలో పుట్టి ఆఖరి శ్వాసవరకు ఆదర్శవంతమైన కమ్యూనిస్టుగా బ్రతికిన ధన్యజీవి శారద. ప్రజల కోసం సర్వస్వం ధారపోసిన కామ్రేడ్స్ డి.వి. సుబ్బారావు (డివిఎస్), భిక్షావతి దంపతుల కుమార్తె. SFI,CITU, మహిళా సంఘం -ఈ మూడు రంగాలు విశాఖలో అభివృద్ధి చెందడానికి వారధి, రథసారది శారద. అంతేకాక తనయగా, తల్లిగా, అక్కగా, అత్తగా, వదినగా, స్నేహమయిగా, కరుణామయిగా, వినయశీలిగా, మార్గదర్శిగా, కర్తవ్యబోధినిగా ఉద్యమాల నేతగా అందరి మనస్సులో చెరగని ముద్రవేసుకున్న మణిపూస కామ్రేడ్ డి. శారద.

అరుదైన వ్యక్తిత్వం ఆమె సొంతం. చెరగని చిరునవ్వు, ఆప్యాయమైన వలకరింపు ఆమె నిత్యాభరణాలు. కార్యకర్తలను ఉత్సాహపరచడం, వారికోసం నిరంతరం పరితపించడం ఆమె లక్షణాలు. అటువంటి విలక్షణ మహిళా మణిపూస జీవన గమనం, అమె ఉద్యమ సహచరుల, మిత్రుల జ్ఞాపకాల, అక్షర నివాళులే ఈ స్మృత్యాంజలి.

23-1-1953 శారద జన్మదినం. బాల్యంనుండే శారద చదువులో ఫస్ట్. చిన్నప్పటినుండి ఆటలంటే కూడా మక్కువ ఎక్కువే. 1972-73లో ఎస్ఆర్ఆర్ కళాశాలలో డిగ్రీ చదువుతున్నప్పుడు ఆటలలో ఆమె కళాశాల 'ఓవరాల్ ఛాంపియన్' కావడమే ఇందుకు నిదర్శనం. తండ్రి ప్రభావం చిన్నప్పటి నుండి శారదపై అధికం.



### నాన్న మాట-బాట

"నాన్న, మీ ఆశయ బాటలో చివరి వరకు నడుస్తాను" అని13 సంవత్సరాల శారద తన తండ్రి తుదిశ్వాస విడిచే కొన్ని గంటల ముందు తన డైరీలో వ్రాసుకున్న ఒకే ఒక వాక్యం ద్వారా తన జీవన గమనాన్ని నిర్దేశించుకుంది. ఇది ఎవరో చెపితే వ్రాసిన వాక్యం కాదు. ఆమె మనసులోంచి ఉప్పొంగిన ప్రతిజ్ఞ అది. అందుకనుగుణంగానే తండ్రి బాటలోనే నడిచింది. విద్యార్థి దశనుండే కార్యాచరణ ప్రారంభమైంది.

విజయవాడ ఎన్.ఆర్.ఆర్ కళాశాలలో అమ్మాయిలను వేధించే గ్యాంగులుండేవి. నగరంలోని అరాచక ముఠాలతో వీరికి సంబంధం ఉండేది. ఒకనాడు ఒకడు ఒక అమ్మాయిని వేధించాడు. అమె కన్నీరు పెట్టుకుని శారదకు చెప్పింది. వినీవినడంతోనే వాడి క్లాసు రూంలోకి వెళ్ళి వాడి చెంపలు చెడామడా వాయించింది. ఆరోజుల్లో ఇలా చేయడానికి ఎంతో ధైర్యం కావాలి. ఈ సంఘటన నగరంలోని ఆనాటి విద్యార్థి లోకంలో ఎంతో ఉత్తేజాన్నిచ్చింది.

ఎమర్జెన్సీలో, విజయవాడలోని సూర్యావతి గారింట్లో విద్యార్థినుల సమావేశాలు జరిగేవి. పుణ్యవతి, శారదలు కూడా ఆ సమావేశాలకు హాజరయ్యేవారు. పెద్దవాళ్ళు కట్టుకునే రూబీ వాయిల్ చీర కట్టుకుని వచ్చిన శారదను అందరూ "అమ్మా, అక్క" అని అప్యాయంగా పిలిచేవారు. అప్పటినుండి చివరివరకు శారద ప్రజలకోసం పనిచేశారు.

వెనకబడిన ప్రకాశంజిల్లా కందుకూరు సమీపంలోని నలదలపూర్ గ్రామానికి చెందిన రైతు కుటుంబానికి చెందిన యువకుడు సి. హెచ్. నర్సింగరావు. డిగ్రీ చదువు కోసం విజయవాడ కళాశాలలో చేరాడు. అదే కళాశాలలో చదువుతున్న శారద, నరసింగరావుల మధ్య పరిచయం ఏర్పడింది. ఉభయుల ఆశయాల-ఆచరణల మధ్య ఏకీభావం ఏర్పడింది. విజయవాడలో ఉద్దరాజు రామంగారి ఆచార్యత్వంలో వారి వివాహం జరిగింది. ఆ రహస్య కాలంలో వారి ఆదర్శ వివాహాన్ని కనీసం ఫోటో కూడా తీసుకునేందుకు అవకాశం లేదు.

### గుండె నిబ్బరం

కన్నబిడ్డకు పుట్టుకతోనే గుండెజబ్బు ఉందని, మృత్యువు అనివార్యమని తెలిసినా, బాబును ఏమాత్రం నిర్లక్ష్యం చేసేదికాదు. అన్ని పోరాటాలలో, ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొనేది. మరోప్రక్క శారద గోర్కీ అమ్మని మరిపించేది. తోటివాళ్లతో "కమ్యూనిస్టు సోదరిగా" చిన్నవాళ్ళకి "కమ్యూనిస్టు అత్తమ్మగా " పిలవబడేది.

కొల్లంతాయ్ చెప్పినట్లు మాతృహృదయాన్ని అందరికి పంచింది. చాలామంది తమపిల్లల్ని ఇంజనీర్లు, డాక్టర్లు కావాలనుకుంటారు. కానీ, శారద మాత్రం ఉన్న ఒక్క కూతురు సుమిత్రను ఉద్యమాలలో పాల్గొనమని ప్రోత్సహించింది, ఆడపడుచు కూతురైన వనజను కూడా అలాగే ప్రోత్సహించింది. అంతేకాక కూతురు సుమిత్రకు ఆదర్శ వివాహం చేసి అమ్మగానూ ఆదర్శం చాటుకుంది. మనుమరాలికి 'అయిలమ్మ' (తెలంగాణా పోరాట యోధురాలు) పేరుపెట్టి తమ సమభావాన్ని చాటుకుంది.

**నిరాడంబరతే ఆభరణం**

ఎంత ఉన్నత చదువులు చదివినా, ఎంత జ్ఞానం సంపాదించినా నిరాడంబరంగా అత్యంత సాధారణ కార్యకర్తలా పనిచేయడమే శారదకు ఇష్టం. పార్టీ పట్ల దాని విధానాల పట్ల ఆమెది అంకురిత విశ్వాసం. 'పిపుల్స్ డెమొక్రసీ' పత్రికను ఆమె క్రమం తప్పక చదివేది. తన ఇంటి పనిచేసుకుంటూ ఆ పనిలో భర్త సహకారం పొందుతూ తన కార్యకలాపాలను ఏ మాత్రం అశ్రద్ధ చేయకుండా ఉద్యోగిగా బాధ్యతలు నిర్వహించేది. మరోపక్క భర్తకు నోట్స్ రూపంలో సలహా సంప్రదింపుల రూపంలో తోడ్పాటునందించేది. తెల్లవారుతూనే ఇంటికి వచ్చే ప్రజలను, కార్యకర్తలను ఆప్యాయంగా పలకరిస్తూ, చెరగని చిరునవ్వుతో సవ్యసాచిలా పనిచేయడం అబ్బుర పరిచే విషయం.

పీడిత ప్రజల విముక్తిలో, వారి పోరాటం పట్ల విశ్వాసంతో వారి కష్టసుఖాలనే తనవిగా భావించిన మరో క్లారా జట్కిన్, మరో జెన్నీ మార్క్స్ కామ్రేడ్ శారద అంటే అతిశయోక్తికాదు. ఆ ఇల్లే ఒక కమ్యూన్. ఉద్యమ హోల్‌టైమర్లు, డాక్టర్లు, లాయర్లు ఇతర కార్యకర్తలు నెలల తరబడి వారింట్లో ఉండేవారు. దీనిని బట్టి శారద తోటి వారిని ఎంత అభిమానించేదో అర్థమౌతుంది.




**ఉద్యమాల నిర్మాణం**

వివాహం అయిన కొద్దిరోజులకే ఎమర్జెన్సీ ఎత్తివేయడంతో నర్సింగరావు అజ్ఞాతవాసం నుండి బయటకు వచ్చారు. తర్వాత విద్యార్థి ఉద్యమాలను కొనసాగిస్తూనే, షిప్ యార్డ్ కాలనీలో కాపురం పెట్టారు. 1980లో ప్రభుత్వరంగ సంస్థల్ని విచ్ఛిన్నం చేసే ప్రయత్నంలో హిందుస్థాన్ షిప్ యార్డ్‌ను' ప్రభుత్వం నష్టాల ఊబిలోకి దింపింది. పోస్ట్ కార్డ్‌ల మీద "షిప్ యార్డ్‌ని రక్షించండి" అనే స్లోగన్ వ్రాసి వేలాది కుటుంబాల నుండి సంతకాలను సేకరించి ప్రధానికి పోస్టు చేయడం లాంటి చక్కటి వ్యూహ రచనను శారద రూపొందించింది. సాధారణ కార్మికుల్లో ఈ కార్యక్రమం మంచి ప్రభావం కలుగచేసింది. శారద ఆచరణలో కార్యకర్తగా ఉన్నా ఆలోచనల్లో నాయకురాలిగా ఉండేది. 1980లో స్టీల్ ప్లాంట్‌లో ఒక కార్మికుని భార్యకు సరైన వైద్యం అందక ప్రసవ సమయంలో మృతి చెందితే, శారద మేనేజరు కారుకి అడ్డంగా పడుకొని 'వైద్య సదుపాయాలు మెరుగుపరుస్తాం' అనే ఒప్పందాన్ని చేసేదాక అడ్డు తొలగలేదు.

**శ్రామిక మహిళోద్యమంలో**

1979లో ఏర్పడిన శ్రామిక మహిళా సమన్వయ సంఘంలో శారద, పుణ్యవతిగారితో కలసి ప్రముఖ పాత్రను పోషించారు. శ్రామిక మహిళల్ని ఆర్గనైజ్ చేసి, కడవరకు అదేపనిలో ఉన్నారు. డెయిరీ కార్మిక సంఘానికి ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారంటే శారద పట్టుదల, దీక్షా దక్షతలు ఎటువంటివో అర్థమౌతాయి.

ఒక నాయకుని కూతురుగానో మరొక నాయకుని భార్యగానో గాక తనదైన వ్యక్తిత్వంతో పని చేసిన ధీరవనిత శారద.

**అవినీతిపై పోరాటం**

శారద ధైర్యసాహసాలకు మారు పేరు. నర్సింగరావు జైలుకు వెళ్ళినప్పుడు, తీవ్రమైన నిర్భందానికి గురి అయినప్పుడు ఆమె ఎప్పుడు నిరుత్సాహ పడలేదు. ఇదంతా ఒక ఉజ్వలమైన ఉద్యమం కోసం అని భావించేవారు. 1979లో స్టీల్ ప్లాంట్ ఉద్యమ నిర్మాణం కోసం నరసింగరావును పార్టీ గాజువాక పంపింది. శారద విశాఖ డెయిరీలో ఉద్యోగంలో చేరారు. విశాఖ పార్టీ ఉద్యమం కానీ ట్రేడ్ యూనియన్ ఉద్యమంకానీ, ముఖ్యంగా గాజువాక ప్రాంతంలో కార్మికోద్యమం, స్టీల్‌ప్లాంట్, ఆటోనగర్, విశాఖ డెయిరీ, ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లలో ఉద్యమాలు బలపడడానికి నర్సింగరావు, శారదలు ఎనలేని కృషి చేశారు.

విశాఖ సహకార డెయిరీ అధ్యక్షుడు

తులసీరావు 20 ఏళ్ళుగా సాగిస్తున్న అక్రమాలు, అవినీతిని ఏ నాయకుడు వెలికి తీసే ప్రయత్నాలు చేయక నిద్ర పోతుంటే రుజువు పత్రాలతో నిర్భీతితో వెలుగులోకి తెచ్చిన ధీశాలి శారద. అందుకే డెయిరీ కార్మికులంతా 10-1-2001న శారదను ఏకగ్రీవంగా ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు. కార్మికులు కోల్పోయిన ఆత్మవిశ్వాసాన్ని తిరిగి పొందడానికి ప్రధాన కారణం శారద ధైర్య సాహసాలే.

2004 డిసెంబర్ 14, అ రోజు శాసనసభలో విశాఖ డెయిరీ ప్రస్తావన వచ్చింది. ఈ చర్చ రావడానికి శారద చేసిన కృషి ఎనలేనిది. వివిధ పార్టీలను కలిసి డెయిరీలో జరుగుతున్న అవినీతిని వివరించారు. అంకెలు, అధారాలు, డాక్యుమెంట్లతో సహా ఫైల్స్ అందించారు. విశాఖలో ఒక ప్రెస్‌మీట్‌తో మొదలైన బహిరంగ పోరాటం, 14వ తేదిన అసెంబ్లీలో ప్రతిధ్వనించింది. రాష్ట్ర వ్యాప్తంగా సంచలనం సృష్టించింది.

జిల్లాలో అంగన్‌వాడీ వర్కర్స్ అండ్ హెల్పర్స్ యూనియన్ ఏర్పాటు, నిర్మాణంలో కీలక పాత్ర పోషించారు. యూనియన్‌కి మొదటినుండి శారద గౌరవ అధ్యక్షురాలిగా ఉన్నారు.

ప్రజాశక్తి విశాఖ ఎడిషన్ ప్రారంభించినపుడు మహిళలతో సహా వేల సంఖ్యలో హాజరవడం అందరిని ఆశ్చర్య పరిచింది. కుటుంబ జీవితాన్ని, పార్టీ జీవితాన్ని పెనవేసి, కార్యక్రమాలకు సకుటుంబంగా తరలిరావడం ఒక సాంప్రదాయంగా అలవాటు చేయడంలో శారద పాత్ర గణనీయం.

**చీకటి ముసిరినరోజు-2004-డిసెంబర్-17** ప్రతిరోజూ బస్సుమీద వెళ్ళే శారద, ఆరోజు బండి తీసింది. ఊర్వశి జంక్షన్ దాటగానే మృత్యుశకటంలా వెనకనుంచి వచ్చిన RTC బస్సు గుద్దేసింది. క్షణాల్లో ఆమెను మృత్యువు కబళించింది. అరుణతార రక్తశిక్తమైపోయింది. శారద మరణ వార్త అందరిని దు:ఖ సాగరంలో ముంచేసింది. కొద్ది గంటల్లో కలవబోతూ కలవకుండానే సుదూర తీరాలకు వెళ్ళిన నెచ్చెలిని తలుచుకుంటూ కన్నీరు మున్నీరుగా విలపించారు రాఘవులు, యంవిఎస్. శర్మ దంపతులు. రెండోరోజు వేలాదిమందితో అంతిమయాత్ర జరిగింది. అంతిమయాత్రలో పాల్గొన్నవారిని చూస్తే శారద ఎంతమంది హృదయాలను ఆక్రమించిందో అర్ధమవుతుంది.

**ఉచిత న్యాయసలహా కేంద్రం**

ఉత్తమ లక్ష్యం, ఖచ్చితమైన మార్గ నిర్దేశకత్వం కలిగి, కృషి చేసే ఎవరికైనా వారి జీవిత కాలంలో లక్ష్యం నెరవేరక పోయినా, వారి తదనంతరం వారి అనుచరులు నెరవేర్చే ప్రయత్నం చేస్తారు. మహిళల కోసం ఉచిత న్యాయ సలహా కేంద్రం ఏర్పాటు చేయాలని శారద తపించారు.

జనవరి 23-2005 శారద జన్మదినం సందర్భంగా విశాఖ నగర మేయరు, పలువురు ప్రముఖ న్యాయవాదులు, కార్యకర్తలు, వివిధ మహిళా సంఘాల సమక్షంలో శారద ట్రస్టు ఆధ్వర్యంలో " డి. శారద మహిళా ఉచిత న్యాయసలహా కేంద్రం " ప్రారంభించారు.

**అంతం కాదది ఆరంభం**

"ఆధునిక మహిళలు భారత దేశ చరిత్రను తిరగ రాస్తారు." అని మహాకవి గురజాడకు అపారమైన విశ్వాసం. శారద అకాల మరణం కలిగించిన ఆవేదనను దిగమింగి ఆచరణలో ఆమె ఒరవడిని ప్రేరణగా మలుచుకుంటేనే ఆమెకు సముచిత నివాళిని అర్పించిన వారమౌతాము.

**డిశంబర్ 17 శారద 9వ వర్ధంతి సందర్భంగా ...**

## బంధువులే కీచకులు

**(నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో నివేదిక)**

రాష్ట్రంలో గత ఏడాది జరిగిన అత్యాచార కేసుల వివరాలను పరిశీలిస్తే పక్కింట్లోనే కాటేసే పాములున్న విషయం స్పష్టమవుతోంది. నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో (ఎన్‌సీఆర్‌బీ) 2012 డేటా కూడా ఈ విషయాలనే స్పష్టం చేస్తోంది. ఈ నివేదికలో వెల్లడైన వివరాల ప్రకారం.. రాష్ట్రంలో గత ఏడాది అత్యాచార ఘటనల్లో 1341 మంది బాధితులు సమీప బంధువులు, తెలిసిన వారి అఘాయిత్యాలకే బలయ్యారు. అందులో రాష్ట్ర రాజధానికి చెందిన బాలికలు, మహిళల సంఖ్య 74. మరో 521 నేరాల్లో నిందితులు పొరుగింటి వారు కాగా. 811 మంది పరిచయస్థులు, బంధువులే అఘాయిత్యాలకు పాల్పడిన వారిలో ఉన్నారు. బాధిత మహిళలు కాస్త సన్నిహితంగా ఉన్న సందర్భాల్లోనే చాలాసార్లు అత్యాచారాలు జరుగుతున్నాయి. దీంతో విషయం బయటపడితే ఎక్కడ తమ పరువు పోతుందో అన్న భయానికి గురవుతున్న బాధితుల కుటుంబీకులు మౌనంగా వేదన అనుభవిస్తున్న వారు చాలా మందే ఉన్నారని తెలుస్తోంది. దీనికి తోడు దగ్గరి బంధువుల చేతిలో అఘాయిత్యానికి గురయిన ఘటనల్లో 90శాతం వరకు కేసులు నమోదు కావడం లేదని ఓ అంతర్జాతీయ సంస్థ పరిశోధనలో తేలిన విషయం వాస్తవ పరిస్థితులకు అద్దం పడుతోంది. కాగా... మహిళలే కాక, చిన్నారులనూ పొరుగింటి పాములు కాటేస్తున్న విషయం నివేదికలో వెల్లడైంది. గత ఏడాది 613 మంది బాలికలు అత్యాచారానికి గురయ్యారు.

గడిచిన పదేళ్లలో హోంలలో ఉన్న బాలికలపై అత్యాచారాలు 336 శాతం పెరిగినట్లు నివేదిక స్పష్టం చేసింది. ఎన్‌సీఆర్‌బీ విడుదల చేసిన క్రైమ్ డేటా ప్రకారం దేశంలో ప్రతి గంటకూ 284 అత్యాచారాలు జరుగుతున్నాయి. ఇందులో 98 శాతం తెలిసినవారే తెగబడుతున్నారు. సమాజంలో నైతిక విలువలు దిగజారడమే గాక మానసిక రుగ్మతలు ప్రమాదకర స్థాయికి చేరుకున్నాయని చెప్పడానికి ఇంతకన్నా నిదర్శనం మరొకటి ఉండదు.

కథ

# రైలెల్లిపోనాది

-జ్యోతిర్మయి మళ్ళ

"ఒరేయ్ లచ్చన్నా, ఇయ్యాలేట్రా యాపారం ఇంత నీర్సంగా ఉన్నాది? రైలుబల్లు తగ్గిపోనాయా? రోడ్డుమీద పోయేబల్లు తగ్గిపోనాయా? అడిగింది రాజమ్మ.

"అదేనే నేనూ సూత్తన్నా పొద్దున్నించీ పదిపొత్తులైనా అమ్మలేదు"

"ఒరే, ముసిలోడికి వొల్లు జొరంతో కాలిపోతన్నాదిరా. ఆడికి ఇంత పిసరు కషాయం వట్టి ఒగ్గేసొచ్చినాను. ఎలాగున్నాడో, ఏటో! ఆ పక్కింటి గంగమ్మని ఓపాలి సూసుకోయే అన్నాను సూసుకుందో, లేదో!"

చిన్నగా నవ్వాడు లక్ష్మన్న.

" ఏదో నాలుగు పొత్తులమ్మితే ఆడ్ని సాయంకాలం డాట్రుకాడికి తీసుకెల్దారనుకున్నానురా".

"హుఁ ఇయ్యాలేటోనే, గేటేసినపుడు బల్లు రావటంనేదు. తీసిగానే రయ్‌రయ్‌మని దాటుకోనెల్లిపోతున్నాయి బల్లూ, బస్సులూనూ".

"డాట్రుకి యాభై రూపాయలు, మందులకింకా ఎంతవుతాదో, ఏటో....." గొణుక్కుంటోంది రాజమ్మ. "నాలుగురోజుల్నించీ కషాయం తోటే పడుకోబెడతన్నాను. ఏటవుద్దో ఏటో! మూసిన కన్ను తెరవడంనేదు...."

"నాకు తెలీకడుగుతానే రాజమ్మత్తా. నీ కొడుకు వెంకట్రావు తాపీ పనికెల్తాడు గదా! ఆడు సూసుకోడేటి మీ కట్టసుఖాలు?"

"ఒరేయ్ ఎదవా, అమ్మనీ బాబునీ సూసుకునే ఎదవెవడ్రా ఇయ్యాల్రేపు? ఆడికి పెల్లానికి కోకలు కొండానికీ, సినిమాలకి తిప్పడానికి సాలవు డబ్బులు. రేపు పెల్లయాక నువ్వూ అంతేరా, సర్లే సూడు సూడు గేటుపడ్డాది. పొత్తులట్టుకుని పరిగెత్తు...." అంటూ నాలుగేసి వాడి చేతుల్లో పెట్టి తానూ నాలుగు పుచ్చుకుని పరిగెత్తింది చీరచెంగు దోపుకుంటూ ఆగిన బస్సువైపు. తెరిచి ఉన్న కిటికీల్లోకి తొంగి చూస్తూ "బాబూ ఏడిగా ఉన్నాయి, లేత పొత్తులు....వీలగా అరుస్తోంది. రెండ్రోజుల్నించీ డొక్క గంజినీళ్ళతోనే తడుస్తూందేమో

అంతకంటే గట్టిగా రావడం లేదు గొంతు. మధ్యాహ్నం మూడు గంటల సమయం. ప్రయాణీకులంతా భోజనాలు చేసి బస్సు ఎక్కారేమో మంచి నిద్రలో ఉన్నారు. ఎవరూ పట్టించుకోలేదు. గేటు తీయగానే వచ్చిన ఆ ఒక్క బస్సు ఎల్లిపోయింది. నీరసంగా వచ్చి గోనెసంచి మీద కూలబడింది రాజమ్మ.

"ఒరేయ్, రోజూ ఇయ్యాలప్పుడు అన్నేసి బల్లూ, కార్లూ వొచ్చీవి కదా, ఇయ్యాలేటయినాయిరా అయన్నీ? వెయ్యిన్నటియ్యి ఇరవై రూపాయలు దాసినాను. ఇంకా నలభై రూపాయలన్నా కావాల ఎలాగో ఏటో " గొణుక్కుంటూ లక్ష్మణకి చెప్తోంది రాజమ్మ. లక్ష్మన్న రోజంతా ఆగేటు దగ్గరే ఉంటాడు. ఎవరు ఏ పని చెప్తే అది చేస్తాడు. కూలి పదో పరకో తీసుకుంటాడు. రాజమ్మ గోడు వినేది వాడొక్కడే.

రాజమ్మకి డబ్బు పోగవలేదనే బాధొక్కటేకాదు, వంట్లో కూడా నీరసంగా ఉంది. పొద్దున్న గంజినీళ్ళు తాగి రెండు మైళ్ళు నడిచి సంతకెళ్ళి వచ్చి మొక్కజొన్న పొత్తులు కొని మూట నెత్తినెట్టుకుని మరో మూడు మైళ్ళు ఎండలో నడిచి ఈ రైల్వే గేటు దగ్గరకొస్తుంది.

రోజుంతా కష్టపడితే ఏభయ్యో, అరవైయ్యో మిగులుతాయి ఖర్చులు పోనూ. వెళ్ళేటప్పుడు సరుకులు కొనుకెలుతుంది ఇంటికి.

ఇంటికాడ కూకుంటే అదీ ఉండదు. పూట పూటకీ అడుక్కున్నోల్లాగా కొడుకింటికెల్లి అరుగుమీద కూసోవాల. కోడలి ఈసడింపు సూపుల్ని తట్టుకోని గడపాల.....సీ....ఎదవ బతుకు. దానికన్నా సావడమే మేలు....ఒక్కగానొక్క కొడుకుని ముద్దుసేసి పెంచినాం. ఆడు అడిగిందీ అడగనేందీ అన్నీ కొనిపెట్టేవోడు ముసిలోడు...వొచ్చిందొచ్చినట్లు కర్సు సేసేసీవోడు. 'కొంచెం దాపరికం సెయ్యి! అంటే ఇనీవోడు కాదు " ఆడిక్కాపోతే ఇంకెవరికెడతానే" అనీవోడు. ఉన్నకాడికి ఆడి పెల్లికయిపోనాది. ముసిలోడు పన్లోకెల్లినన్నాల్లూ లోటుండేదికాదు. ఇదిగో సంవచ్చరం నిండీ ఈ మాయదారి దగ్గూ, ఆయాసం అప్పుడప్పుడూ జొరం వచ్చినకాడ్నించే ఈ తిప్పలు. మొండికేసి పన్లోకెల్లినా మేస్త్రీ రానీడు. "నీరసంతో పనేం

**తరువాయి 28వ పేజీలో**

# అమ్మ నిర్ణయం

-ఎం. సుధ

అమ్మకు ఆరోగ్యం బాగు లేదని తెలిసి మనసు ఆందోళన చెందుతోంది. ఏం చేయాలి? అమ్మను చూడాలన్న కోరిక తీవ్రమైంది. ఏదోవిధంగా సర్దుబాటు చేసుకుంటాములే అని కుటుంబ సభ్యుల నుండి భరోసా వచ్చింది. ఏమైతే అయిందిలే అని ప్రయాణమయ్యాను అమ్మను చూసేందుకు.

ట్రయిన్‌లో కూర్చున్న నాకు చిన్నప్పటి జ్ఞాపకాలు గుర్తుకు వచ్చాయి. అమ్మ ఎంత గుంభనంగా ఉండేది? ఎంత సర్దుకుపోయే తత్వం, ఎదుటి వారికి ప్రేమ పంచటంలో ఆమె తర్వాతనే ఎవరైనా అనిపించేది. అమ్మ ఎనిమిదేళ్ళు ఒంటరి జీవితం గడిపింది భర్త ఉండి, పిల్లలు ఉండి. ఎందుకు అమ్మ ఇలాంటి నిర్ణయం తీసుకుంది? అని అనిపించేది.

అమ్మ పుట్టింది ఓ రకంగా పేదరికంలోనే. అక్కడున్న వాతావరణం ఆమెను చైతన్యపరచి సంఘజీవిని చేసింది. ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ చాలా బలంగా ఉండేది ఆ ప్రాంతంలో. అమ్మ ప్రజానాట్య మండలి పాటల దళంలో ఊరూరూ తిరుగుతూ పాటలు పాడేదట. ఆ విషయం చాలా రోజుల తర్వాత గానీ మాకు తెలియలేదు. అమ్మది కులాంతర వివాహం. ఆ రోజుల్లో కులాంతర వివాహాలు ఎక్కడో కానీ ఒకటీ అరా జరిగేవి కావు.

కొత్త కాపురం పెట్టిన తర్వాత కానీ అర్థం కాలేదు అమ్మకు చుట్టపక్కల వారి చూపులు, చేష్టలు భరించలేమనుకున్నది. సంసారాన్ని మరోచోటికి మార్చడమయింది.



పుట్టినింటికి దూరం అయినా అభ్యుదయ భావాలు గల (కమ్యూనిస్టు) కుటుంబానికి దగ్గరవటంతో 'హమ్మయ్యా' అని ఊపిరి పీల్చుకుంది అమ్మ. ఏ కష్టమొచ్చినా ఆ కుటుంబమే ఆదుకునేది.

మేము అయిదుగురం పిల్లలం. ఎవరి పుట్టుక సందర్భంలోనూ నాన్న దగ్గరలేరంట. ఆయన పనులు ఆయనవే. అమ్మను పట్టించుకునేవాడు కాదట. అమ్మ చెబుతుండేది. నాన్న వ్యాపారం కొద్ది కొద్దిగా పుంజుకోవడం ఆరంభమయింది. కానీ అమ్మ పద్ధతుల్లో మార్పు లేదు. అదే పొదుపు, అదే జాగ్రత్త. మా చదువులు పూర్తయి పెళ్ళిళ్ళ దగ్గరకొచ్చేటప్పకి కానీ అర్థం కాలేదు అమ్మ పడుతున్న ఆవేదన.

నాన్నకు ఎదురు మాట్లాడటం అన్నది అప్పటివరకూ జరగలేదు.

ఒక రోజు నాన్నతో 'నేను జీవిత భాగస్వామిని కాదా? నాకెందుకు చెప్పవు?' అని గట్టిగా వాదిస్తోంది అమ్మ. పిల్లల పెళ్ళిళ్ళ విషయంలో ఏకపక్షంగా నిర్ణయించడంతో విసిగిపోయిన అమ్మ

'నాతో సంప్రదించి ఆ పని చేస్తే ఏమౌతుంది? ఏ విషయం కూడా నాకు చెప్పనప్పుడు నీ భార్యగా నేనెందుకు?' అని అంటున్న అమ్మను చూస్తే అర్థమయింది ఆమెలో నిగూఢమై ఉన్న బాధ.

ఆ వాదన మరింత ఎక్కువయింది.

అమ్మ ఏడుస్తూ అంటోంది 'చావనైనా చస్తాను కానీ నీతో కలిసి ఉండటం అసంభవం' అని.

బిక్క మొహాలతో ఉన్న మాకు ఏమి జరుగుతుందో అర్థం కాలేదు.

అర్ధరాత్రి వేళ అన్నయ్య 'మా కోసం నువ్వు బతకాలమ్మా. నీకు మేమున్నాం కదమ్మా' అంటూ అమ్మని బ్రతిమలాడుతూ వెంట వెళుతున్నాడు.

రెండో రోజు అమ్మమ్మ ఇంటికి వెళితే కానీ అర్థం కాలేదు. అమ్మ చనిపోవటానికి సిద్ధపడింది జీవితం మీద విరక్తితో. కానీ మా కోసం, కేవలం మా కోసం బతికింది. అమ్మ విషయంలో నాన్న చేసిన నిర్లక్ష్యం ఒక్కటొక్కటి గుర్తుకు రాగాసాయి.

ఏ వ్యక్తి విజయం వెనుకైనా స్త్రీ ఉంటుందని అన్న నానుడి ఊరికే రాలేదు. నాన్న వ్యాపారంలో ముందుకు సాగటానికైనా, ఆస్తులు సంపాదించటానికైనా అమ్మ సహకారమే అన్నది నాన్నకు ఎప్పుడూ అనిపించదు. 'ఆస్తి అంతా నేనే సంపాదించాను అనుకుంటూ' అమ్మ పేరున ఉన్న ఆస్తి కూడా

అమ్మేసాడు. అవసరాలు లేకపోయినా ఆస్తులు అమ్మటం అమ్మకు నచ్చలేదు. తనకు ఏది తోస్తే అదిచేయటం, ఏ విషయంలోనూ అమ్మను సంప్రదించకపోవడం ఈ నియంతృత్వ ధోరణికి అమ్మ విసిగిపోయింది. పిల్లలను కనిపెంచి, ఇంటి పనులు చేసే యంత్రంలా చూశాడు. భార్యకు చెప్పేది ఏముందిలే అనుకుంటూ అన్ని విషయాల్లోనూ నిర్లక్ష్యం చేశాడు నాన్న. అమ్మ ఎంత మానసిక క్షోభను అనుభవించిందో కదా అనిపిస్తుంది. విరిగిపోయిన అద్దం విరిగిన మనసు అతకదు అన్నది వాస్తవం. అదే జరిగింది అమ్మ విషయంలో.

అప్పటికి మా చదువులు, పెళ్ళిళ్ళు, పురుళ్ళతో సహా అన్ని బాధ్యతలు పూర్తయినాయి. ఆఖరికి నిలువనీడ లేకుండా ఇల్లును కూడా చెప్పకుండా అమ్మేయడంతో అమ్మ సహనం కోల్పోయింది. భార్యగా ఏమాత్రం విలువ ఇవ్వని నాన్నతో సంసారం ఇక వ్యర్థం అనుకున్నది. ఒంటరిగా ఉండేందుకు నిర్ణయం తీసుకుంది. మనసు ఎంత గాయపడితేనో కదా ఇటువంటి నిర్ణయానికి వచ్చింది అమ్మ.

రైలు నేను దిగాల్సిన స్టేషన్లో ఆగింది. నా ఆలోచనలకు తెరపడింది.

అమ్మను ఆ స్థితిలో చూడగానే బాధ కలిగింది. ఒకరి మీద ఆధారపడని అమ్మ అలా మంచం మీద ఉండటం బాధ కలిగించింది. నాన్నతో మాటల్లేవు. అలా పాతికేళ్ళుగడిచిపోయాయి. ఎంత మౌనవేదన అనుభవించిందో. దానికి బలమైన కారణం ఉండకుండా ఉంటుందా?

నెల రోజుల నుండి అనారోగ్యంతో బాధపడుతోంది. అయినా ఆమెను చూస్తే ఏదో తెలియని అనుభూతి. అమ్మకు 83 ఏళ్ళ వయసు. అలా అనిపించదు.

ఒకొక్కసారి అనిపిస్తుంది. బాధను, సంతోషాన్ని పంచుకోవటానికి కుటుంబ సభ్యులం ఎవరం దగ్గరలేమే అని. ఎనిమిదేళ్ళు ఒంటరిగా జీవించింది అమ్మ. నాకు తెలిసి అమ్మ నాన్నతో కలిసి ఏ పెళ్ళికి కానీ, విందులు, వినోదాలకు కానీ వెళ్ళటం చూడలేదు. పెళ్ళయినప్పటి నుండీ ఇల్లు, పిల్లలే లోకంగా బతికింది. ఈ ఎనిమిదేళ్ళు అమ్మ ఎక్కడికి వెళ్ళాలనుకుంటే అక్కడికి వెళ్ళింది. ఎవరి ప్రశ్నా లేదు, ఎవరి ఆదేశం లేదు. ఎవరి నిర్ణయం లేదు. ఇది చాలు. ఆమెకోసం ఆమె జీవించిన ఆ జీవితం చాలు. ఇవన్నీ తలచుకుంటే అనిపిస్తుంది. అందుకే అమ్మ నిర్ణయం కరెక్టే అని.

వైద్యం కోసం హైదరాబాద్ తీసుకువచ్చాము. ఒక వారం రోజులు ఆసుపత్రిలో ఉండి కొంత పుంజుకున్నాక ఇంటికి తీసుకువచ్చాము. రోజు రోజుకీ క్షీణిస్తున్న అమ్మ ఆరోగ్య స్థితిని చూసి ఒకరోజు 'నాన్నను పిలవమంటావా' అమ్మా అని అన్నాను. 'ఎందుకు? ఏమీ వద్దు' అని గట్టిగా అన్నది. తన ఇష్టానికి వ్యతిరేకంగా ఏమీ చేయ కూడదన్నది నా అభిమతం. ఒక వారం రోజుల తర్వాత ఆసుపత్రిలో మరణించింది అమ్మ. చివరి దశలోనైనా ప్రశాంతంగా, ఆత్మాభిమానంతో బతికింది అమ్మ. అదే అమ్మ కోరుకున్నది. •

---

26వ పేజీ తరువాయి

జేస్తవ్, ఇంటికెళ్లి పడుకో" అంటాడు. నిజమే ఆడు మాత్రం ఏం కస్టపడతాడు? ఏదో నేనే తిప్పలు పడదావంటే ఈ యాపారం ఇలాగ;" ఆలోచనల్లో కొట్టుకుంటోంది రాజమ్మ. మనసు విలవిల్లాడుతోంది. ఆడికి రెక్కలొచ్చినాయి... అవు్మ, నాన్నకష్టపడిందంతా మరిసిపోనాడు...." కొడుకుని తిట్టుకుంది...మళ్ళీ తానే "సరే ఆడ్నని ఏంలాభం. మాకు బుద్ధిలేదు. కూసింత ఎనకేసుకునేంటే ఇయ్యాల దర్జాగా కూకోని తినేటోల్లవే గదా! ఆడైనా సల్లగుండాల..." కొడుకుని తిట్టుకున్నందుకు తన్ను తాను తిట్టుకుంది. అంత బాధలోనూ తల్లి మనసు కొడుకు శ్రేయస్సు కోరుతోంది. కళ్ళుతుడుచుకుంది రాజమ్మ. గుండెలో మాత్రం బొగ్గునిప్పు లాంటి మంట!

ఆలోచనల్లో పడి పట్టించుకోలేదు. గేటు పడింది. రెండు మూడు బస్సులాగాయి "ఒరే ఎక్కడ సచ్చావురా?" లక్ష్మణ పరిగెత్తుకుంటూ వచ్చాడు. ఇద్దరూ ఆగిన బస్సులవైపు పరిగెత్తారు.

ఒక కార్లోంచి ఓ పిల్లాడు చెయ్యూపాడు, రాజమ్మ పరుగు పరుగున అటుపోయింది. రెండు పొత్తులు తీసుకుని పదిరూపాయలిచ్చాడా పిల్లవాడు. నోటు తీసుకుంది రాజమ్మ. గేటు లేచింది. కొంగున ముడేసుకోబోతూ చూసుకుంది నోటు కాస్త చిరిగి ఉంది.

"బాబూ, నోటు బాలేదు ఇంకోటియ్యి బాబూ" అరుస్తూ కారువైపు పరిగెత్తింది. అప్పటికే తీసి ఉన్న గేటువైపు దూసుకుపోతోంది కారు. చీరకొంగు జారుతున్నది కూడా పట్టించుకోకుండా పరిగెడుతోంది రాజమ్మ. ఎవరికి వారే గేటు ముందుగా దాటేయాలనుకునే వాహనాల మధ్య ఎక్కువసేపు వేగంగా పరిగెత్తలేక నిస్సత్తువతో చెల్లని నోటు చేత్తో పట్టుకుని ఆగి ఇటువైపు తిరిగిన రాజమ్మకి ఒక్క క్షణం ఏం జరిగిందో తెలీలేదు. దబ్బున కూలబడింది రోడ్డుకడ్డంగా.....

కిందపడి ఊపిరొదిలిన రాజమ్మ శరీరాన్ని తొక్కకుండా జాగ్రత్తగా తప్పించుకుని వెళ్ళాయి వాహనాలన్నీ. ఒక్క సైకిలు మాత్రం ఆగింది. మాట్నీ సినిమాకెళ్ళి వస్తున్న (రాజమ్మ కొడుకు) వెంకట్రావుది.... సైకిలు దిగి రోడ్డు వారకెళ్ళి నిలుచుంది వెంకట్రావు భార్య!

**(చైతన్య మానవి దశాబ్ది ప్రత్యేక సంచిక విడుదల సందర్భంగా నిర్వహించిన కథల పోటీలో సాధారణ ప్రచురణకు ఎంపికైన కథ)** •

పుస్తక పరిచయం

# మహిళా చైతన్యంపై మాట్లాడుదాం రండి...!

-యు. వాసుకి

గత సంచిక తరువాయి

**సర్వం పురుషాధిక్యమయం**

నేడు గత చరిత్రలనూ, పురాణేతిహాసాలనూ స్త్రీల దృష్టితో పునః పఠనం, పునఃపరిశీలన చేస్తున్నారు. పునః పరిశీలనంటే..? ఆనాటి పురాణాల్లో, కావ్యాల్లో స్త్రీల చిత్రణ ఆకాల సామాజిక పరిస్థితులననుసరించి ఉంటుంది. కానీ ప్రస్తుతానికి ఆ పరిస్థితుల్లో ఎన్నో మార్పులొచ్చాయి. కనుక ఆనాటి మహిళా చిత్రణలను కూడా మనం ఆధునిక కోణంలో అర్థంచేసుకోవాల్సి ఉంది. ఈ అంశాన్ని నొక్కి చెప్పేందుకు నేడు పురాణాల పాత్రలతో కథలు, నవలలు ఆసక్తికరంగా వస్తున్నాయి.

మార్క్స్, ఏంగెల్స్, లెనిన్,మున్నగు వారు స్త్రీ బానిసత్వాన్ని వివరించి, ఆమె విముక్తి చెందేందుకు అవసరమైన మార్గం కూడా చూపారు. ఒక ఇంటి లోపల బందీయై రాత్రింబవళ్ళు శ్రమిస్తున్న మహిళా ప్రపంచం కుదించుకుపోతుంది. ఆమె జ్ఞానాభివృద్ధికి ఆ వాతావరణం సానుకూలంగా లేదు. దీనిని గ్రహించిన లెనిన్ ఇంటి పనులు మహిళను ఎలా కుంగదీస్తున్నాయో ఇలా వివరించాడు.

**'స్త్రీకి ఏవిధంగానూ ప్రయోజనం లేని, జంతువులా ఒకే పనిని మాటి మాటికీ చేసే పరంపరలో ఆమె సృజనాత్మక శక్తి పూర్తిగా నశించిపోతుంది.**

**'గృహ కార్యాలు మహిళల పనిగా భావింపబడుతున్న సమాజంలో భర్త భార్య పనుల బరువును పంచుకుంటే ఆమె బాధలను, చింతలను కొంత వరకు తేలిక పరచొచ్చు. లేక పూర్తిగా కూడా తొలగించవచ్చు. అయితే ఆ విధంగా భార్యకు సహకరించటాన్ని సమాజం అతడికి సంబంధించినంత వరకు అగౌరవమైన విషయమని భావిస్తోంది'.**

నిజానికి మన భాషలు కూడా పురుషాధిక్యతతో కూడి ఉన్నాయి. సూక్ష్మంగా పరిశీలిస్తే దీన్ని అర్థం చేసుకోవచ్చు. ఉదాహరణకు గయ్యాళి, ముండమోపి, వేశ్యలాంటి పదాలు. ఇలాంటి పనులు పురుషులూ చేస్తారు. అయితే వారికీ ఇలాంటి పదాలు అన్వయింపచేయరు. పురుషుడు కూడా ఎక్కువగా మాట్లాడొచ్చు. భార్యను కోల్పోయి ఉండొచ్చు. వ్యభిచారమూ చేయొచ్చు. అయినా అతడికి ఏపేరూ లేదు. స్త్రీ తప్పు చేసినప్పుడు పురుషుడు ఆమెను 'అణిచేస్తాడు' కానీ పురుషుడు తప్పు చేసినప్పుడు స్త్రీ అతడ్ని దండించలేదు. 'దిద్దుబాటు' మాత్రమే చేయగలదు. ఇలాగే అధ్యక్షుడు, నాయకుడు, మేనేజర్, రాజకీయవేత్త, రైతు, కార్మికుడు, వ్యాపారి, పత్రికా విలేఖరి, వైమానికుడు మొదలగు పదాలు విన్నప్పుడు మన బుర్రలో పురుషుడు మాత్రమే ప్రత్యక్షమవుతాడు.

సమాజంలోని ముఖ్యమైన అంగాలైన కుటుంబం, మతం, చట్టం, రాజకీయం, విద్య, ఆర్థిక సంస్థలు, ప్రసార సాధనాలు, జ్ఞానార్జనా సాధనాలు-అన్నీ పురుషాధిక్యతా లక్షణాలను జాగ్రత్తగా కాపాడేవిగానే ఉన్నాయని ఒక అధ్యనం పేర్కొంటోంది.

గుర్తుకొస్తోందే...గుర్తుకొస్తోందే
ఎక్కడో...ఎప్పుడో..విన్నట్లుందే
కుటుంబమంటే చెరసాల అని
ఎక్కడో...ఎప్పుడో..విన్నట్లుందే
గుర్తుకొస్తోందే...గుర్తుకొస్తోందే

గుర్తుకు రావడం మంచిదే. పురుషుడి కన్నా ఎక్కువగా శ్రమించే స్త్రీ కుటుంబంలో ఎలా పరిగణింపబడుతోంది. పాదరక్షలా, నిచ్చెనలా, మానవ యంత్రంలా అని చెబితే చాలామంది ఆగ్రహంతో ఊగిపోతారు. అయితే పైన చెప్పిన వాటి నీడకూడా లేకుండా మన కటుంబాల్లో మహిళలున్నారా...? అని ప్రతి పురుషుడు ఆత్మశోధన చేసుకోవాల్సిన అవసరముంది. చేయి చేసుకోవడం, కాల్చేయడం, అవమానించడం లాంటి రకరకాల దైర్జన్యాలు స్త్రీలపైన కటుంబంలోనే జరుగుతున్నాయి.

**ఇంటి పనులను సార్వత్రికం చేసే ప్రయత్నంలో (అనగా స్త్రీలు, పురుషులు కలిసి చేసుకునే**



(ప్రయత్నంలో) సోసలిస్టు దేశాలు కొన్ని ప్రత్యేక ఏర్పాట్లు చేశాయి. అనగా ఉమ్మడి వంటశాలలు, ఉమ్మడి బట్టల శుభ్రత, పిల్లల సంరక్షణశాలలు ఆ దేశాల్లో ఏర్పాటు చేశారు. ఇందువల్ల అక్కడి మహిళలు కుటుంబ సంరక్షణ చేసుకుంటూ తమతమ వృత్తులూ చేసుకుంటూ, సామాజిక కార్యకలాపాల్లో కూడా పాల్గొనేందుకు వీలైంది. అయినా ఈ దేశాల్లో కూడా మహిళ పూర్తి విముక్తి చెందలేదని, సాంస్కృతికంగా స్త్రీ పురుషుల సమానత్వం సంపూర్ణంగా సాధించబడలేదని విమర్శలు కూడా ఉన్నాయి.

ఒక కటుంబంలో భర్త మాత్రమే సంపాదనా పరుడైనా, ఇంట్లో ఉండి మాత్రమే గృహకార్యాలు నిర్వర్తించే భార్యకు కూడా భర్త ఆస్తిలో సగం భాగం ఇచ్చి తీరాలని మహాత్మాగాంధీ నొక్కి చెప్పారు. నేటి మహిళోద్యమం కూడా ఈ డిమాండే చేస్తోంది. అయితే 75 సంవత్సరాలకు మునుపే గాంధీజీ ఈ డిమాండు చేశారంటే దీని సమంజసత్వాన్ని ఎవరూ సవాలు చేయలేరు.

వివాహం అనేది స్త్రీకి ఆర్థికాశ్రయం అనే పరిస్థితి మారితేనే ఆమె విముక్తి చెందగలదని, జవహర్‌లాల్ నెహ్రూ కూడా ఆ కాలంలోనే చెప్పారు. భర్తపై ఆధారపడి బతికే మహిళలు ఎన్నటికీ స్వతంత్రులు కాలేరు. సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రాతిపదికన ఉండే స్త్రీ, పురుష సంబంధం మాత్రమే ఆదర్శవంతమవుతుందని ఆయన పేర్కొన్నారు.

మైథిలి శివరామన్ రచించిన 'మహిళా హక్కులు- మార్క్సిస్టు దృకథం' పుస్తకం నుంచి)

ఇందువల్ల కుటుంబమే అవసరం లేదని మనం నిర్ణయించుకోవాల్సిన పనిలేదు. స్త్రీ కూడా స్వేచ్ఛావాయువులు పీల్చుకునే ఒకచోటుగా కుటుంబం ఉండాలని మాత్రమే మనం చెబుతున్నాం. కుటుంబమనే వ్యవస్థలో ప్రజాస్వామ్యం ఉండాలని మనం కోరుకోవటంలో తప్పేముంది..? బయట మాత్రం ప్రజాస్వామ్యం, ఇంటిలోపల నా నియంతృత్వం, వీలైతే కాస్త 'ఉదారంగా' వ్యవహరిస్తాను అనే దృక్పథం సరైందేనా..? మరీ చెబితే, కుటుంబమనే వ్యవస్థ చరిత్ర గతిలో ఎన్నో మార్పులకు లోనైంది. చరిత్ర ప్రారంభ కాలంలో 'కుటుంబం' అనేదే లేదు. అప్పుడు మనుషులు గుంపులు గుంపులుగా, బృందాలుగా, గణాలుగా కలిసి జీవిస్తున్నప్పుడు వాటినే మనం కుటుంబాలుగా వరిగణించొచ్చు. తదనంతరం ఉమ్మడి కుటుంబాలొచ్చాయి. ప్రస్తుతమైతే భార్య, భర్త, పిల్లలు మాత్రమే కుటుంబవై పోయింది. ఉద్యోగం వెతుక్కుంటూ పురుషుడు వెళ్ళినప్పుడు, భర్తను కోల్పోయినప్పుడు స్త్రీ మాత్రమే ఆ కుటుంబ యజమానురాలవుతుంది. కొన్ని దేశాల్లో అసహజమైన సంబంధాలు కొనసాగి వారే కుటుంబాలుగా చలామణి అవుతుంటారు.

ఇప్పుడు కట్నం తీసుకోని వారెవరండీ...?

కట్నం అందరూ తీసుకుంటున్నారని చెప్పినంత మాత్రాన ఒక మంచి విషయం కాబోదు. వివాహమనేది స్త్రీలకు, పురుషులకు సమానంగా కొన్ని మేళ్ళు చేస్తాయి. అయినా వివాహ వ్యవస్థలో ఇద్దరూ సమాన భాగస్వాములే. కానీ స్త్రీ మాత్రం పురుషుడికి పైకం చెల్లించే ఆ వ్యవస్థలో ప్రవేశించాలనటం ఎంత వరకు సమర్థనీయం...? కళ్యాణ మండపాల్లో వివాహాల సందర్భంగా వరుడుకిచ్చే మంచాలు, బీరువాలు, పురుపులు, గిన్నెలు, చెంబుల్లాంటి పాత్రలతో పాటు సబ్బుపెట్టెలు, సబ్బులు, పౌడర్లు, పుట్టబోయే బిడ్డకోసం ఉగ్గుపాల గిన్నెలు, స్పూన్లు వంటి వాటినీ ప్రదర్శనగా, అందరూ చూసే విధంగా అమర్చిపెడతారు. ఇదేగాక పెళ్ళికి వచ్చినవారందరినీ వాటిని చూడమని బలవంతం చేస్తారు. అంటే పెళ్ళినాటి ముందు వరకు పెళ్ళికొడుకు ఇంట్లో సబ్బుపెట్టెలు కూడా లేవా...? అని ప్రశ్నించబుద్ధవుతుంది. పెళ్ళికొడుకింటి వారు అంత దరిద్రులా..? అని అడగాలనిపిస్తుంది.

ఇది మహిళా చైతన్య దృష్టితో మాత్రమే కాదు. సామాన్యుల దృష్టిలో సైతం అత్యంత హేయమైన విషయం.

తరువాతి కాలంలో కుటుంబ వ్యవస్థ అభివృద్ధి చెందాలంటే కుటుంబ ప్రజాస్వామ్యం వరిథవిల్లాలని నొక్కి చెప్పాల్సిన అవసరం కలుగుతోంది. కుటుంబమనేది మహిళలకు మాత్రమే పవిత్రమైనదిగా ఉండాలా..? పురుషుడికి ఆ బాధ్యత లేదా..? అనే ప్రశ్నలు నేడు అసంగతాలు ఏమీకావు.

మతాలకు సంబంధించినంత వరకు అన్ని మతాలూ స్త్రీల బానిసత్వాన్ని గట్టిగా సమర్థిస్తాయి. స్త్రీల పట్ల వివక్షతను అంగీకరిస్తాయి. హిందూ మతంలో శివుడిమాట విననందుకు పార్వతి శాపగ్రస్తురాలవుతుంది. క్రైస్తవ మతంలో పురుషుడి వెన్నెముక నుండే మొదటి స్త్రీ సృష్టింపబడింది. అనగా పురుషుడి ఒక భాగంగానే ఆమె రూపొందించబడింది. మతాలకు సంబంధించిన నియమ నిబంధనలు, చట్టాలు స్త్రీలను పురుషులకన్నా తక్కువగానే పరిగణిస్తాయి. హిందూ ఉమ్మడి కుటుంబంలో మహిళలకు ఆస్తిహక్కు లేదు. క్రైస్తవులకు సంబంధించిన విడాకుల చట్టంలో విడాకుల కారణాల్లో స్త్రీ, పురుషులకు వివక్షత చూపబడివుంది. ముస్లీం మహిళలకు సమాన ఆస్తి హక్కులు లేవు. ఆలయ గర్భ గృహాల్లోనూ, మసీదుల్లోనూ మహిళలు ప్రవేశించరాదు. ఆలయ అర్చకులుగా స్త్రీలు అనర్హులు. ముస్లీమ్ జమాతుల్లో స్త్రీలకు ప్రాతినిథ్యం లేదు. క్రైస్తవ చర్చిల్లో కూడా మహిళలకు పూర్తి ప్రాతినిథ్యం లేదు.

సనాతన ధర్మ పరిరక్షకులుగా హిందుత్వం మాట్లాడే ఆర్‌ఎస్‌ఎస్ నేతలు

స్త్రీలకు కుటుంబం మాత్రమే ప్రధానంగా ఉండాలని, దృఢకాయులైన హిందూ మగపిల్లలను కనివ్వటమే వారి పవిత్ర కర్తవ్యమని ఉద్బోధిస్తుంటారు. 'భగవంతుడు పురుషుణ్ణి సృష్టించాడు. వాడిని పోషించేందుకు తల్లిని సృష్టించాడు. తల్లి తరువాత పురుషుణ్ని గమనించుకోవటానికి భార్యను రూపొందించాడు. కనుక తల్లి, భార్య సమానులే' అనే భావజాలాన్ని వారు వ్యాప్తి చేస్తుంటారు. మొత్తంగా ఆడజన్మ భర్తను, కుమారుణ్ని చూసుకోవడానికే, పోషించడానికే. ఆమెకంటూ ఒక ప్రత్యేకమైన అభిరుచి, ఆలోచన ఉండరాదు. ఆమెకంటూ ఒక ప్రత్యేకమైన పనీపాట ఉండరాదు. సామాజిక దృక్పథం ఉండరాదు. సమాజంలో ఆమె పాత్ర అనవసరం అనే బావనలు ఇక్కడ పని చేస్తున్నాయి. మొత్తం మీద స్త్రీ కూడా ఒక వ్యక్తి, ఆమెకో వ్యక్తిత్వం ఉంది. ఆమెకూ ఇష్టాఇష్టాలుంటాయి. అనే అంశాలు ఎక్కడా అంగీకరింపబడలేదు.

**కుటుంబాన్ని పోషించేవారు, నిర్వహించేవారు మాత్రమే కుటుంబ యజమానులయ్యే అర్హత కలిగున్నారనుకుంటాం. ఆ విధంగా చూసినా కుటుంబ యజమానురాలుగా ఉండేందుకు అవసరమైన సంపూర్ణమైన అర్హత స్త్రీకి ఉంది. అయితే కుటుంబ యజమాని పేరు సాధారణంగా పురుషునిదిగానే ఉంటుంది. ఒకడు ఇంట్లోనే ఉండడు. బయటే కాలం వెళ్ళబుచ్చుతుంటాడు. అయినా అతడే కుటుంబ యజమానిగా పరిగణింప బడుతున్నాడు. తన సంపాదనను బయటే దుబారా ఖర్చు చేసేసి, భార్య కష్టపడి సంపాదించిన పైకాన్ని తాగుడుకు తగలేసే 'ఉత్తమ భర్తలు' ఉంటారు. కడుపుమండి భార్య ప్రశ్నిస్తే చావబాదుతారు కూడా. అయినా వారే కుటుంబ యజమానులుగా చలామణి అవుతున్నారు. భర్తా, భార్యా ఇద్దరూ సమానులుగా, కుటుంబ యజమానులుగా పరిగణింపబడితే లోకం విరుచుకుపడిపోతుందా...?**

అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) మహిళా చైతన్య దృక్పథాన్ని ఎలా వివరిస్తుంది..? దాన్ని రకరకాలుగా వ్యాఖ్యానిస్తారు. అదీగాక దీనిని ఎక్కువగా స్త్రీ, పురుషుల సంబంధాల్లో నెలకొన్న సమస్యలు, వ్యక్తిగత మానవహక్కులకు సంబంధించిన విషయాలకే వర్తింపజేస్తారు. కనుక మహిళా సంఘం దాన్ని అలాగే స్వీకరించటం లేదు. చైతన్యంలో ముఖ్యాంశాలుగా ప్రజాస్వామ్యం, సమానత్వం, మహిళా విముక్తి అనే అత్యంత ప్రధానమైన మూడు అంశాలను ముందుకు తెస్తుంది. మహిళలు లైంగికంగా మాత్రమే గాక కులరీత్యానూ, వర్గరీత్యానూ దోపిడీకి గురవుతున్నారు. దీని వెనుక పెట్టుబడిదారీ వ్యవస్థ, భూస్వామ్య పెత్తందారీతనం ఉన్నాయి. నిజంగా మహిళలు విముక్తి చెందాలంటే ఈ రెండు వ్యవస్థలను సంపూర్ణంగా మార్చేయాలి. ఈ లక్ష్యాన్నే ఐద్వా తన ఆదర్శంగా ఉంచుకుంది. సామాజిక మార్పు జరగాలనుకునే ఇతర సామాజిక సంస్థలతోనూ కలిసి పోరాడేందుకు మహిళా సంఘం సిద్ధంగా ఉంటుంది. అందువల్లే దానికి కేవలం పురుష వ్యతిరేకత విధానంగా లేదు. అది పురుషాధిక్యతను మాత్రమే వ్యతిరేకిస్తుంది. లింగ వివక్ష, వర్గ వివక్ష, కుల వివక్షలను ధ్వంసం చేసేందుకు అది అందరితోనూ సహకరించేందుకు సిద్ధంగా ఉంది.

**మహిళల సమస్యలు ఏవి..?**

మహిళలకు వర్గరీత్యా సమస్యలంటే ఏమిటీ..? వారు వ్యవసాయంలో, చేనేతలో, భవన నిర్మాణంలో, కార్యాలయాల్లో, ఇంకా అనేక ఇతర రంగాల్లో కార్మికురాళ్ళుగా, ఉద్యోగినులుగా పనిచేస్తున్నప్పుడు ఆయా రంగాల్లో అప్పుడప్పుడు ఏర్పడుతున్న సంక్షోభాలు, పని పరిస్థితులు, కూలీలు, జీతాలు లాంటి సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుంది. ఇవన్నీ మహిళలకు సంబంధించిన సమస్యలే. గృహాల్లో మహిళలకు కలిగే సమస్యలు, వీధుల్లో తటస్థించే లైంగిక హింసలు మాత్రమే వారి సమస్యలు కావు. వారు ఎక్కడున్న వారికి సంభవించే సమస్యలు 'మహిళల సమస్యలే' స్త్రీవాద దృక్పథం ఈ అంశాన్నీ తనలో ఇముడ్చుకోవాలి.

అదే విధంగా కులరీత్యా సమస్యలు కూడా మహిళలను బాధిస్తాయి. దళితుల పట్ల మన సమాజం ఆచరించే అంటరానితనం, వారిని నాలుగో శ్రేణి పౌరులుగా చూడటం-ఇవన్నీ దళిత మహిళలనూ ఎక్కువగా పీడిస్తాయి. కనుక అస్పృశ్యత, కులవివక్షత కూడా మహిళల సమస్యలే.

ఇంకా చెప్పాలంటే శాసనసభ కార్యకలాపాలు, సాధారణంగా ప్రజాతంత్ర హక్కుల అపహరణ, అమెరికా సామ్రాజ్యవాద ఆధిక్యత, భారత పాకిస్తాన్ సంబంధాలు కూడా మహిళలు చింతించాల్సిన విషయాలే. ఎందుకంటే వారు స్త్రీలుగా మాత్రమే లేరు. పౌరులుగా కూడా ఉన్నారు. దేశానికి సంబంధించిన అన్ని సమస్యల పట్ల వారు కూడా శ్రద్ధ కనబరచాల్సి ఉంది. పురుషులు మాత్రమే ఆలోచిస్తే చాలదు. జనాభాలో సగమున్న మహిళలు సామాజిక స్పృహ లేకుంటే లేదా, సామాజిక స్పృహకు వారిని దూరంగా ఉంచితే దేశం నిశ్చయంగా ముందుకెళ్ళదు.

మహిళలపట్ల ఉన్న ఈ వివక్ష మన దేశంలో మాత్రమే కాదు, ప్రపంచమంతా ఉంది. అయితే చైనా, ఉత్తరకొరియా,వియత్నాం, క్యూబా వంటి సోషలిస్టు దేశాల్లో ఈ వివక్ష చాలా వరకు తగ్గించబడింది. కారణం ఆదేశాల్లో హెచ్చు, తగ్గుల సమాజాన్ని చాలా వరకు మార్చేశారు. ప్రస్తుతం కూడా అసమానతలను చాలావరకు తగ్గించేందుకు నిరంతరం కృషి చేస్తున్నారు. అన్ని రకాల వివక్ష కూడా తగ్గుముఖం పడుతుంది. ఆ సోషలిస్టు దేశాల్లో విద్య, ఉపాధి, ఆదాయం, ఆస్తిలాంటి

ముఖ్యమైన అంశాల్లో మహిళలకు నిజంగానే సమానవకాశం కల్పించబడుతోంది. వారు ఇంటినొదిలి బయట పనీపాటలు చేసేందుకు వెళుతున్నందువల్ల ఇంటిపని, పిల్లల పెంపకం వంటి సమస్యలను అక్కడి ప్రభుత్వాలు మహిళల సమస్యలుగానే భావించడంలేదు. వాటి పరిష్కారం కోసం శతవిధాలా ప్రయత్నిస్తూనే ఉంటాయి. అయినా ఆ దేశాల్లోనూ సాంస్కృతికంగా స్త్రీ, పురుష సమానత్వం ఇంకా సాధించాల్సే ఉంది. ప్రజాతంత్ర దృక్పథం లేక మానవీయ దృక్పథం లేదా వర్గ దృక్పథం సముచితంగా ఉన్నవారూ స్త్రీల పట్ల సరైన దృక్పథం కలిగుంటారనుకోలేము. అందువల్లే అన్నిదేశాల్లో ప్రజాతంత్ర, వర్గ ఉద్యమాలున్నా మహిళోద్యమం కూడా ప్రత్యేకంగా అవసరమవుతుంది.

**'స్త్రీలకు నిజమైన స్వాతంత్ర్యం లభించాలంటే వైవాహిక జీవితంలో ఇద్దరికీ ఒకే విధమైన నైతిక విలువలు, కట్టుబాట్లు విధించాలి. ఈ విషయంలో దేశ రాజ్యాంగాన్నీ సవరించాలి. మహిళలు సైతం బానిస మనోభావాల్ని, భయాల్ని పూర్తిగా పోగొట్టుకోవాలి'.**

**-పెరియార్ ఈవే, రామస్వామి.**

భారతదేశంతో సహా ఇతర దేశాల్లో కూడా స్త్రీ బానిసత్వం కొనసాగుతూనే ఉంది. ఎందుకంటే హెచ్చుతగ్గుల సామాజిక వ్యవస్థకూడా కొనసాగుతూనే ఉంది. అందువల్లే అంతర్జాతీయంగా మహిళా మహాసభలు జరుగుతున్నాయి. వీటిలో పాల్గొనే మహిళలందరూ సోషలిస్టులు, కమ్యూనిస్టులు కారు. 'పేదరికం-హింసకు వ్యతిరేకంగా ప్రపంచ మహిళల మహాసభ' కూడా ఇటీవలే జరిగింది. ఇక్కడ ప్రతిపాదించిన పేదరికం-హింసకు సంబంధించిన డిమాండ్లు తయారుచేసే కమిటీలో ఈ పుస్తక రచయిత్రి కూడా పాలుపంచుకుంది. ఈ మహాసభ కెనడాలోని మాంట్రియల్ నగరంలో నిర్వహించారు. ఐదా్వ తరపున రచయిత్రి పాల్గొంది. ముసాయిదా తీర్మానంలో డిమాండ్ల పట్టికలో కేవలం మహిళలపై హింస అనే అంశం మాత్రమే చోటుచేసుకుంది. మగవారి చేతిలో మగువలు అనుభవిస్తున్న హింసకు సంబంధించి మాత్రమే పేర్కొనబడింది. ఈ విధంగా చేసేందుకు కారణమేమిటంటే ఈ మహాసభలో పాల్గొన అనేక మహిళా సంస్థలు హింసను కేవలం స్త్రీ పురుషుల సంబంధంగా మాత్రమే చూశాయి. అయితే ఈ రచయిత్రి లాంటి వర్ధమాన దేశాలకు చెందిన అనేక మంది మహిళలు ఒత్తిడి చేసిన తరువాతే అంతిమ తీర్మానంలో ప్రపంచీకరణ, విభిన్న దేశాలు అనుభవించే ఆర్థిక విధానాలూ, వీటి వెనుక ఉన్న ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య వ్యవస్థ (ఐఎంఎఫ్) రాజ్యహింస, కులవివక్షత, మతోన్మాద దుశ్చర్యలు మొదలగువాటిని చేర్చుకోవటం జరిగింది. ఆమహాసభలో పాల్గొన్న స్వలింగ సంపర్కం గురించి చెప్పే లెస్బియన్ గ్రూపులు, సమలైంగిక సంబంధాలను కూడా మహిళా హక్కుల్లో చేర్చాలన్నారు. దీన్నిబట్టి స్త్రీవాదమన్నా, మహిళా హక్కులన్నా ప్రపంచ మహిళల్లో రకరకాల అభిప్రాయాలు ఉన్నాయనే సంగతి స్పష్టమవుతుంది.

స్త్రీ, పురుష సమానత్వమనేది ఏదో మహిళోద్యమాల డిమాండు మాత్రమే కాదు. దాన్ని ఐక్యరాజ్య సమితే అంగీకరించింది. భారత రాజ్యాంగ చట్టం కూడా దాన్ని అంగీకరించింది. కనుక స్త్రీ పురుష సమానత్వాన్ని ఒప్పుకోని వారు మన రాజ్యాంగ చట్టాన్నే ధిక్కరిస్తున్నారన్నమాట, అనుమానిస్తున్నారన్నమాట.

**వివరణలు సరే, మహిళవట్ల వివక్షతను చూపుతున్నారు కదా..? దీనికేమంటారు..?**

లేదని ఎవరు చెబుతున్నారు...? మగవాడు గొప్ప, ఆడది తక్కువ అనే ఆలోచనా ధోరణి ఎన్నో శతాబ్దాలుగా అందరినీ పట్టిపీడిస్తోంది. పురుషులనూ, స్త్రీలనూ సమానంగా ఈ ఆలోచనా ధోరణి కల్లోలపరుస్తోంది. పురుషాధిక్యత భావన మగవారిలోనూ ఉంది, ఆడవారిలోనూ ఉంది. కానీ అదే సమయంలో దీన్ని మార్చాలనే భావన, పట్టుదల గల మహిళలూ ఉన్నారు. పురుషులూ ఉన్నారు. అందుకోసం ఇరువురూ దృఢసంకల్పంతో పాటుపడుతున్న దృష్టాంతాలున్నాయి. ఇద్దరూ కలిసి కృషి చేయాల్సిన అవసరమూ ఉంది.

ఒక కాలంలో ఉన్నత స్థితిలో ఉండిన స్త్రీ ఈనాడు అధఃపాతాళానికి కుంగిపోయి, సమానత్వం పోగొట్టుకుని, ఆడశిశువును గర్భంలోనే నాశనం చేసే పరిస్థితికి చేరుకుంది. తన గౌరవ మర్యాదలను పోగొట్టుకుని ఉంది. అయితే ఇది ప్రకృతి సహజమైనదేమీ కాదు. మానవజాతి ఆవిర్భవించిన కాలంలో ఈ దయనీయమైన పరిస్థితి లేదు. స్త్రీని ఏవిధంగా బానిసగా మార్చారు, మతము, పురాణాలూ, నైతిక విలువలూ, ప్రస్తుతం ప్రసార సాధనాలు-అన్నీ ఆమెను బానిసగా మార్చేందుకు తమవంతు పాత్ర నిర్వర్తించాయి, నిర్వర్తిస్తున్నాయి అనే విషయాన్ని మనం ఈ పుస్తకంలో గమనించాం. ఇది ఒకే రాత్రిలో జరిగిపోలేదు. నేడు, నిన్న మాత్రమే కాదు కొన్ని వందల సంవత్సరాలుగా క్రమక్రమంగా జరిగింది. ఈ వందల సంవత్సరాల్లో మానవజాతి మస్తిష్కంలో నింపి ఉంచిన ఈ తప్పుడు అభిప్రాయాలను, భావాలను తుడిచిపెట్టాల్సిన అవసరముంది. కొన్ని సందర్భాల్లో నేర్చుకున్నదాన్ని కూడా మరచిపోవటం అవసరమే.

దానితోపాటే మహిళా చైతన్య దృష్టితో మన కుటుంబాన్నీ, బయట ప్రపంచాన్నీ చూసేందుకు కూడా నేర్చుకుందాం. ఇందుకు అందరం గట్టిగా ఆలోచించాలి. తరచుగా మాట్లాడుకోవాలి. దాన్ని మన జీవితాల్లో అనుసరించాలి కూడా. ●

వారు స్త్రీలు మాట్లాడటాన్ని, రాయటాన్ని సహించలేరు. ఒక దేశంలో అకృత్యాలు. మరో దేశంలో ఆంక్షలు... ఇంకొక చోట స్వేచ్ఛ హరింపు... మరోచోట మతోన్మాదం. అంతిమంగా వీటన్నింటికీ బలయ్యేది మగువే... ఇలాంటి ఉన్మాదపు ప్రపంచాన మరో చైతన్య దీప్తి ప్రాణాలు గాల్లో కలిసిపోయాయి. ఇలా అర్ధాంతరంగా కిరాతక మూకల చేతుల్లో ప్రాణాలు కోల్పోయింది ఎవరో కాదు.. మన దేశానికి చెందిన మహిళే. ఆమె చేసిన నేరమల్లా తాలిబన్ స్త్రీలను సంస్కరించడమే! మొన్న మలాలా...! నిన్న సుస్మిత... మరిరేపు..?

# స్త్రీ చైతన్యంపై తాలిబన్ల ఉన్మాదం

-నవ్య

తాలిబన్లు మరోసారి చెలరేగిపోయారు. భారత్‌కు చెందిన రచయిత్రి 49 ఏళ్ల సుస్మిత బెనర్జీని కాబూల్‌లో దారుణంగా కాల్చి చంపారు. పక్తికా రాష్ట్రంలోని ఆమె నివాసముంటున్న ఇంటి బయటే తీవ్రవాదులు ఈ ఘాతుకానికి పాల్పడ్డారు. ఆమె ఇంట్లోకి చొరబడి ఆమె భర్తను, కుటుంబసభ్యులను కట్టేసి బెనర్జీని బయటకు తీసుకెళ్లి మరీ కిరాతకంగా కాల్చి చంపేశారు.



**ఆమె చేసిన తప్పేంటీ...?**

కోలకతాలోని సర్వేపార్క్ ప్రాంతానికి చెందిన సుస్మిత బెనర్జీది ఓ మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబం. వైద్య సేవకురాలిగా పనిచేస్తున్న సమయంలో ఆఫ్ఘనిస్తాన్‌కు చెందిన జాన్‌బాజ్ ఖాన్ అనే వ్యక్తితో పరిచయం ఏర్పడింది. ఆ పరిచయం కాస్తా ప్రేమకు దారితీసింది. ముస్లిం మతానికి చెందిన జాన్‌బాజ్‌ను పెళ్లి చేసుకునేందుకు సుస్మిత తల్లిదండ్రులు అంగీకరించలేదు. దీంతో ఆమె వారిని ఎదిరించి, 1989లో జాన్‌బాజ్‌ను పెళ్లాడారు. అయితే జాన్‌బాజ్‌కు అప్పటికే వివాహమైంది. సుస్మిత జాన్‌బాజ్‌కు రెండోభార్య. పెళ్లయ్యాక భర్తతో ఆఫ్ఘన్ వెళ్లారు. భర్త నుంచి ఎలాంటి సమస్యలు లేకున్నా.. అక్కడకు అడుగుపెట్టిన దగ్గర నుంచి ఆమెకు అత్తింటి పోరు తప్పలేదు. అంతకుమించి పరాయి మతానికి చెందిన స్త్రీ అనే ముద్రపడటంతో తాలిబన్ల నుంచి వ్యతిరేకతను ఎదుర్కొన్నారు. అలా దాదాపు పదేళ్ళు ఆమె అక్కడ నరకాన్ని చవిచూశారు. అక్కడ కష్టాలను భరించలేక ఆమె అనేకసార్లు చెప్పకుండానే కోల్‌కతాకు వచ్చేసేవారు. అయితే పరాయి దేశానికి చెందిన వ్యక్తిని పెళ్ళి చేసుకోవడం వల్ల తల్లిదండ్రులూ సహకరించేవారు కాదు. సొంతకాళ్లపై నిలదొక్కుకోవాలంటే డబ్బుల్లేవు. ఇలాంటి నేపథ్యంలో కోల్‌కతాకు వచ్చినప్పుడు ఆమె 2002లో 'కాబూలీ వాలాస్ బెంగాలీ వైఫ్' అనే పుస్తకాన్ని రాశారు. ఆ పుస్తకం రాసిన తర్వాత ఆమెకు తాలిబన్ల నుంచి బెదిరింపులు మరింత ఎక్కువయ్యాయి. స్వయంగా అత్తమామల ఆసరా తీసుకుని తాలిబన్లు అనేకసార్లు సుస్మితపై దాడులకూ తెగబడ్డారు.

కేవలం ప్రేమ అనే బంధంతో భర్తను నమ్మి ఆఫ్ఘనిస్తాన్ వెళ్లిన సుస్మిత అత్తారింటిలో సుఖపడిందేమీ లేదు. మట్టితో కట్టిన ఇంట్లోనే ఆమె ఉండాల్సి వచ్చేది. 'అదరించాల్సిన అత్తమామలే భారత్‌కు పంపాలా? లేక కాల్చి చంపేయాలా? అని మాట్లాడుకునే వారని.. ఆ మాటల్ని తాను తలుపు చాటున ఉండి వినేదాన్న'ని తన ఆత్మకథలో ఆమె రాసుకున్నారు. ఇలాంటి ఎన్నో ఇబ్బందులు, బెదిరింపుల నేపథ్యంలో తాలిబన్ల నుండి నాటకీయంగా ఆమె ఎలా తప్పించుకోగలిగింది అనే కథనంతో 'ఎస్కేప్ ఫ్రమ్ బాలీవుడ్' చిత్రం కూడా రూపొందింది. దీంట్లో సుస్మిత పాత్రలో మనీషా కొయిరాల నటించారు. 2003లో విడుదలైన ఈ సినిమా ఆఫ్ఘన్‌లో మహిళలపై తాలిబన్లు ఎలా నిరంకుశంగా వ్యవహరిస్తున్నారు అనే వాస్తవాన్ని కళ్ళకు కట్టింది. 'ఏ కాబూలీవాలాస్ బెంగాలీ వైఫ్' అనే పేరుతో సుస్మిత రాసిన ఈ పుస్తకం బెస్ట్ సెల్లర్‌గా రికార్డు సృష్టించింది.

**ఆఫ్ఘన్ వెళ్లినప్పుడు..**

కోల్‌కతా నుంచి తిరిగి ఆఫ్ఘన్ వెళ్ళిన తర్వాత సుస్మితపై మరిన్ని వేధింపులు, ఆంక్షలు, బెదిరింపులు మొదలయ్యాయి. అయినా ఆమె మొండి

**తరువాయి 37వ పేజీలో**

కథ

# జీవిత భాగస్వామి కథ

- పి. షహనాజ్

నా స్థానంలో మీరుండి - మీ స్థానంలో నేనుంటే మీరేం చేసేవాళ్ళు? చెప్పండి. ఈ పాటికి ఏ వార్తా పత్రికల్లోనో నా భార్య సంసార సుఖానికి యోగ్యురాలు కాదని అందుకు ద్వితీయ వివాహానికై ఓ ఆడది కావలెనని ప్రకటన ఇచ్చే వాళ్ళు కదూ? అంతేకాదు. ఎన్ని అడ్డదారులు త్రొక్కేవాళ్ళో "పాపం"

భార్య సంధిస్తున్న ఒక్కోమాట అతని గుండెల్లో ములుకుల్లా గుచ్చుకుంటున్నాయి. మస్తిష్కం దిమ్మెరపోయింది.

సమాధానం ఇవ్వలేక లోలోన తెగ గింజుకుంటూ అటుతిరిగి పడుకుండిపోయాడు.

అహల్య, నారాయణరావుల దాంపత్య జీవితం సుదీర్ఘంగా, సాఫీగా సాగిపోయింది. ముగ్గురు పిల్లలు కలిగారు. పెరిగి పెద్ద వారయ్యారు కూడా.

నారాయణరావుకు వయస్సు పైబడే కొద్దీ ఒక్కొక్కటిగా వ్యాధులు అతని ఒంట్లోకి చేరుకున్నాయి. మధుమేహం, బిపి, గుండె జబ్బులు, మోకాళ్ళనొప్పులు మున్నగునవి అతనిని పీల్చి పిప్పిని చేశాయి. ఖరీదయిన వైద్యం చేయించుకున్నా లాభం లేకపోయింది. కాలం గడిచే కొద్దీ శారీరకంగా బలహీనుడయి పోయి దాంపత్య సుఖానికి దూరమయ్యాడు అతను.

"ఎందుకింత బాధపడుతున్నారు. మనం పాతికేళ్ళుగా ఆనందంగా సుఖమయమయిన సంసారం చేశాము. ముగ్గురు పిల్లల్ని కన్నాము. ఇప్పుడు అలాంటి ఆలోచనలను మానుకోండి. నాకయితే ఎటువంటి అసంతృప్తి గాని, అశాంతిగాని లేవు. మీ మనస్సును మళ్ళించుకోండి. అనుమానాలకు, సందేహాలకు తావు యివ్వవద్దు." అని ఓదార్చేది అహల్య.

కానీ అతను మాత్రం అసహనంగా రోజులను గడపసాగాడు. న్యూనతా భావంతో లోలోన కుమిలిపోతున్నాడు. అతనిలోని పురుషాహంకారం ఎగిసిపడుతోంది. భార్య ఎదుట ఎక్కడ లోకువ అయిపోతానో అనే భయాందోళనలు పట్టుకున్నాయి. ఆమె పట్ల ఆధిపత్యాన్ని చెలాయిస్తూ ఎప్పటికప్పుడు జాగ్రత్త పడుతున్నాడు. తనలోని లోపాన్ని కప్పి పుచ్చుకోవటానికి తెగ ప్రయత్నిస్తుంటాడు. లోకుల దృష్టిలో తనలోని బలహీనత బయటపడకుండా భార్యతో పరుషంగా మాట్లాడుతూ, కఠినంగా ప్రవర్తిస్తూ 'మగమహారాజులా' బ్రతికేస్తున్నాడు.

ఆమె అందమైనది. తనకంటే వయస్సులో చిన్నది. తీరని కోర్కెలతో ఎక్కడ ప్రక్కదారులు పడ్తుందోనని బెంబేలెత్తి పోతున్నాడు. అందుకే అనుక్షణం ఆమెను కనిపెట్టుకుంటూ గడుపుతున్నాడు. ఇంటికి ఏ మగాడు వచ్చినా ఆమెను శల్య పరీక్షలు చేసి వేధించుకు తింటున్నాడు.

ఆమె భర్త యొక్క చవకబారు చేష్టలను భరిస్తూనే ఉంది. ఈ మధ్య వయస్సులో తన పిల్లలకు సైతం పిల్లలు కలుగుతున్న కాలంలో భర్తతో విభేదించి బ్రతకడం యిష్టం లేక పోయింది. కాలమే అతనికి గుణపాఠం చెబుతుందని వేచి చూడసాగింది.

తన శరీరంలోని అవయవాలన్నీ శక్తి హీనమై పోయినా అతను మాత్రం పరాయి ఆడవాళ్ళతో స్నేహాలు చెయ్యటం, వాళ్ళను తన వాక్చాతుర్యంతో ఆకర్షించబడాలని ప్రయత్నించటం మానలేదు.

ఆరోజు నారాయణరావు చెల్లెలు కాదంబరి వచ్చింది. ఆమెకు దాదాపు నలభై ఏళ్ళుంటాయి. మరో ఊరిలో ఉద్యోగం చేస్తోంది. ఇరవయ్యేళ్ళ క్రితం ఆమెకు వివాహమైంది. వివాహం జరిగిన ఒక నెలరోజులకే పెళ్ళి పెటాకులయ్యింది. అతను దాంపత్య జీవితానికి అశక్తుడన్న విషయం బయటికి పొక్కింది. కాదంబరి తరుపు వారు అగ్గి మీద గుగ్గిలమయ్యారు. ఇరువక్షాల వారు కొట్టుకున్నారు, తిట్టుకున్నారు. పంచాయితీ పెట్టించారు. ఫలితంగా ఆ వివాహ బంధం తెగిపోయింది.

అతను కాదంబరి పట్ల ప్రేమ చూపబోయినా వాళ్ళు మాత్రం అతనికి విడాకులిచ్చేసి మా అమ్మాయికి రెండో వివాహం జరిపిస్తామని ఎగిరిపడ్డారు. కానీ చెప్పినంత సులభం కాలేదు ఆమెకు రెండో పెళ్ళి చెయ్యడం. ఎన్నో ఆటంకాలు, అవరోధాలు, అవమానాలు ఎదుర్కొనవల్సి వచ్చింది. ఒకదశలో కాదంబరి విసిగిపోయి ద్వితీయ వివాహానికి అంగీకరించలేదు. పెళ్ళితో ఆగిపోయిన తన చదువును కొనసాగించింది. చదువు పూర్తయిన తరువాత ఉద్యోగంలో చేరిపోయింది. ఒకటి

నాస్థానంలో మీరుండి- మీ స్థానంలో నేనుంటే మీరేం చేసేవాళ్ళు? చెప్పండి. ఈ పాటికి ఏ వార్తా పత్రికల్లోనో నా భార్య సంసార సుఖానికి యోగ్యురాలు కాదని అందుకు ద్వితీయ వివాహానికై ఓ ఆడది కావలెనని ప్రకటన ఇచ్చే వాళ్ళు కదూ? అంతేకాదు. ఎన్ని అడ్డదారులు త్రొక్కేవాళ్ళో "పాపం"

**అతనిలోని పురుషాహంకారం ఎగిసిపడుతోంది. భార్య ఎదుట ఎక్కడ లోకువ అయిపోతానో అనే భయాందోళనలు పట్టుకున్నాయి. ఆమె పట్ల ఆధిపత్యాన్ని చెలాయిస్తూ ఎప్పటికప్పుడు జాగ్రత్త పడుతున్నాడు. తనలోని లోపాన్ని కప్పి పుచ్చుకోవటానికి తెగ ప్రయత్నిస్తుంటాడు. లోకుల దృష్టిలో తనలోని బలహీనత బయటపడకుండా భార్యతో పరుషంగా మాట్లాడుతూ, కఠినంగా ప్రవర్తిస్తూ 'మగమహారాజులా' బ్రతికేస్తున్నాడు.**

రెండు సార్లు అతనొచ్చి పిల్చినా ఆమెను వెళ్ళనివ్వలేదు.

అలా కొంతకాలం గడిచిన పిమ్మట తల్లిదండ్రులు గతించడంతో ఆమె గురించి పట్టించుకునే వారే లేకపోయారు.

చాలాకాలం తరువాత వచ్చిన చెల్లెలను చూసి ఆశ్చర్యపోయాడు నారాయణరావు.

"అన్నయ్య నేను తిరిగి ఆయన దగ్గరికి వెళ్ళాలనుకుంటున్నాను. పాపం అయినవాళ్ళందరూ దూరమయ్యారు. ఒంటరిగా బ్రతుకుతున్నాడట. ఆయనతో తిరిగి జీవితాన్ని కొనసాగించాలనుకుంటున్నాను. ఆశీర్వదించు" అని చెబుతున్న చెల్లెలి వంక కోపంగా చూసి ఏమి జవాబు చెప్పక తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"అన్నయ్యకు ఇష్టం లేనట్టుంది" మెల్లిగా గొణిగింది కాదంబరి. "అయినా నా నిర్ణయంలో మార్పులేదు." దృఢంగా పలికింది.

"నిన్ను అభినందిస్తున్నాను కాదంబరి. నీ నిర్ణయం నాకెంతో సంతోషాన్నిస్తున్నది. ఇప్పటికే చాలా ఆలస్యం చేశావు. భార్యభర్తల నడుమ ఉండాల్సింది శారీరక సంబంధం మాత్రమే కాదు. అంతకంటే మించినది మానసిక అనుబంధం, పవిత్ర బంధం, నమ్మకం. అది ఒక తీయని అనుభూతిగా మిగిలిపోవాలి. నీ వయస్సు పిన్న వయస్సు కాదు. నీకు ఓ తోడు కావాలి. అతనితో జీవితాన్ని పంచుకో. సహజీవనాన్ని కొనసాగించు. నీ జీవితంతోబాటు అతని జీవితం చక్కబడ్తుంది. ఆనాడు నువ్వు అతనిని త్యజించావు కానీ అతను నిన్ను వదులుకోలేదు. ఇతరులు ఏదైనా సలహాలు ఇవ్వగలరు వాళ్ళ సొమ్మేం పోయింది. నష్టపోయేది నువ్వే." అహల్య తన ఆడపడుచుకు సలహాలివ్వసాగింది.

"అవును వదినా! నేను చాలా ఆలోచించాకే ఈ నిర్ణయానికొచ్చాను. నేను సగం జీవితం గడిచి పోయిన ప్రౌఢను. మంచికో చెడుకో ఒకప్పుడు మాకిద్దరికి పెళ్ళయింది. ఒక బంధం ఏర్పడింది. కాని విడిపోవల్సి వచ్చింది. ఇరువురం ఒంటరి బ్రతుకులను వెళ్ళదీస్తున్నాము. ఇంతకాలానికి మాకు తోడు అవసరమనిపించింది. కల్సి బ్రతకాలని కోరుకుంటున్నాము." అని కాదంబరి చెబుతుంది.

" అవును కాదంబరి శారీరక సంబంధం పెట్టుకుని మోజు తగ్గాక వదిలించుకోవడానికి ఇది అక్రమ సంబంధ కాదు, వివాహబంధం. పరస్పరం మమతానురాగాలను, ప్రేమాభిమానాలను పంచుకుంటూ జీవన యాత్రను సాగించవల్సిన బంధం. జీవిత భాగస్వాముల నడుమ నమ్మకం ఉండాలి. ఎన్నేళ్ళయినా ఆ విశ్వాసం వమ్ముకాకుడదు. అప్పుడే ఆ దాంపత్య జీవితం ఆనందమయంగా గడిచిపోతుంది.

ఆ ఇద్దరు ఆడవాళ్ళ సంభాషణ నారాయణరావు చెవులదాక చేరుతున్నాయి. ఆమాటలు సూటిగా అతని మనస్సులో నాటుకుపోతున్నాయి.

ఆ సమయంలో వాళ్ళిద్దరూ ఎంతో ఎత్తుకు ఎదిగిన మహా విదుషీమణులుగా కన్పించారు. " రేపు ఆయన వస్తే వెళ్ళిపోవాలనుకుంటున్నాను. మీరిద్దరూ ఆశీర్వదించాలి. నా జీవిత భాగస్వామి నాకు తిరిగి దక్కాలనుకుంటున్నాను. అన్నయ్య నీ జీవితమే నాకు ఆదర్శం వదినా" చెప్పింది కాదంబరి.

ఆశ్చర్యంగా ఆమెవంక చూస్తు చిన్నగా నవ్వింది అహల్య.

మీ అన్నయ్య కూడా తప్పక అంగీకరిస్తాడు. అక్కడ నువ్వు ఆనందంగా ఉంటావు. నీ ధైర్యం, నీ చొరవ, నీ మంచితనం తప్పక రక్షిస్తాయి.

ఇక్కడ నారాయణరావు లోలోన కుంచించుకుపోతున్నాడు. ఇన్నాళ్ళు భార్య మనస్సును గుర్తించక ఆమెను ఎంత కష్ట పెట్టాడు. అనుక్షణం అనుమానంతో ఆమెని ఎంత క్షోభకి గురిచేశాడు. ఆమెలోని ఉన్నతమైన భావాలను తెలుసుకోలేకపోయాడు.

తన దగ్గర సుఖం దక్కక ఎక్కడ ప్రక్కదారులు పడ్తుందోననే అపోహలతో ఎంత కించ పరిచాడు. భార్యా భర్తల నడుమ ఉండవల్సిన బంధాన్ని గుర్తించలేక పోయాడు.

'ఛీ....ఛీ.... తన పాపానికి నిష్కృతిలేదు' అతని హృదయం మౌనంగా రోదించసాగింది.

మరుసటిరోజు చెల్లెలు భర్త వెంట జీవితాన్ని పంచుకోవడానికి వెళ్తుంటే మనసారా ఆశీర్వదించి సాగనంపాడు. •

**వివాహబంధం. పరస్పరం మమతానురాగాలను, ప్రేమాభిమానాలను పంచుకుంటూ జీవన యాత్రను సాగించవల్సిన బంధం. జీవిత భాగస్వాముల నడుమ నమ్మకం ఉండాలి. ఎన్నేళ్ళయినా ఆ విశ్వాసం వమ్ముకాకుడదు. అప్పుడే ఆ దాంపత్య జీవితం ఆనందమయంగా గడిచిపోతుంది.**

అవగాహన సందర్భం

# నైర్మల్యపు రోజుల్ని సాధించుకుందాం!



-శిలాలోలిత

స్వేచ్ఛంటే హాయిగా నవ్వగలగడం. మాట్లాడగలగడం. ఏ ఆటంకాలు లేకుండా గాలి పీల్చగలగడం. తన కళ్ళతో తాను స్వయంగా చూడగలగడం. తన మెదడుతో తాను ఆలోచించి నిర్ణయాలు తీసుకుని అమలు పర్చుకోగలగడం. తనకిష్టమైన పనిని, చదువును, ఉద్యోగాన్ని చేయగలగడం. తన ఊహల శిల్పి తానే కాగలగడం. తాను సంపాదించే ప్రతి రూపాయి మీద హక్కును పొందగలిగి ఉండడం. ఎవరి ఆధిపత్యాలకు, అహంకారాలకు లొంగకుండా, ఆత్మగౌరవంతో బతకగలగడం. చావుపుట్టుకల అజమాయిషీలు లేకుండా ఉండడం. తన ఇంట్లో సైతం తన అడుగులు తానే వేయగలగడానికి మించిన స్వేచ్ఛ ఏముంటుంది?

ఇప్పటి వరకూ ఇన్ని అనుకున్నాం కదా! ఇవేమీ ఇప్పటి వాళ్ళు అనుభవించడం లేదు. ఇప్పటి వాళ్ళే కాదు ఎప్పటి నుంచో ఈ చట్రం కొనసాగుతూనే వుంది. బయటికి అందమైన పూల పొదరిళ్ళలా అన్పించినా, ముళ్ళ జెముళ్ళే పొదల వెనుకంతా. రక్తసిక్త గాయాలమయమే. మోహంలేని, ప్రాణంలేని, మెదళ్ళు చిట్లిపోయినా మొండాలు మాత్రమే ఉన్నాయి.

తలుచుకుంటే గొంతులో కొండరాళ్ళు పడ్డట్టే ఊపిరి బిగబట్టి వినాల్సిందే. ఎందుకు? ఎందుకింత హింస నానాటికీ పెరిగి పోతోంది.? ఎవరేంచేసారు? పిల్లలు పసిపిల్లలు, మొగ్గలు పసిమొగ్గలు, అప్పుడప్పుడే ఊహల ఉయ్యాల్లో ఆడుకుంటుంటే అమాయకపు పదారేళ్ళ యవ్వనాలు, పెళ్ళైన రాత్రి నుంచీ నరకపు అంచునుండి వేలాడుతున్న శరీరాలు, తమకడుపున పుట్టిన పిల్లలే సంకెళ్ళయి, ఇళ్ళే జైళ్ళయిన సందర్భాలు, తొంబై ఏళ్ళు వచ్చినా, ఈ ముసలి శరీరం ఎలా ఉందో చూద్దామనే కాంక్షతో చేసే వికృత చేష్టలు- ఇవన్నీ స్త్రీలుగా పుట్టినందుకు, ఒక యోనిని జననానికి గాక జీవనానికి, మరణానికి కూడా వాడుకోగలిగే పరికరాలౌతున్నారు స్త్రీలు.

'ఓల్గా'- 'అయోని' అనే ఓ కథరాసింది. రేప్‌కి గురైన ఒకచిన్నపాప మానసిక సంఘర్షణ అది. ఈ యోని లేకుండా ఉండుంటే ఇంత చిత్ర హింసలుండవు కదా అని ఆవేదనతో రాసిన కథ అది. అలాగే బి. పద్మావతి- దాదర్ ఎక్స్‌ప్రెస్‌లో జరిగిన సామూహిక రేప్ మీద 'గాయపడ్డ పనిముట్టు' అనే కవిత రాసింది. చదివిన తర్వాత మనం కన్నీళ్ళుగానో, కన్నీళ్ళు మనం గానో మిగిలిపోతాం. 'నరమేధ కాష్టంలో రగిలే చిరురవ్వలు'-అనే కవితను బలవంతంగా పసిపిల్లలతో శరీర వ్యాపారం చేయిస్తుంటే వాళ్ళుపడే నరకాన్ని గురించి శిలాలోలిత రాసింది.

మనషులు లింగనిర్ధారణను బట్టి స్త్రీలుగా, పురుషులుగా, ఎటూ కానివారుగా గుర్తింపబడ్డారు. స్త్రీలను సాటి ప్రాణులుగానే గుర్తించకుండా, ఆమెను ఎలాగైనా హింసించే, అనుభవించే, చంపే అధికారం మాకుంది అని అనుకోవడం. అనుకోనివ్వడం, అమలు చేయడం వల్లనే ఇంత క్రూరత్వం పెరిగిపోతోంది. వాకపల్లిలోని రాజ్యహింసను మర్చిపోనేలేదింకా మనం.

నిన్నగాక మొన్న 'నిర్భయ' ను తలుచుకుంటేనే రౌద్ర వర్షాలమవుతాం. ఎంత హింస, ఎంత హింస.... అసలు మాట్లాడుకోవడానికేమన్నా మిగిలిందా? ఇనుపరాడ్లను యోనిగుండా గుచ్చి పేగుల్ని అరచేతుల్తో కెలికి, వక్షోజాలను ముక్కలు ముక్కలుగా కొరికి ఏకకాలంలో అనేకులు

**ఎందుకు? ఎందుకింత హింస నానాటికీ పెరిగి పోతోంది.? ఎవరేంచేసారు? పిల్లలు పసిపిల్లలు, మొగ్గలు పసిమొగ్గలు, అప్పుడప్పుడే ఊహల ఉయ్యాల్లో ఆడుకుంటుంటే అమాయకపు పదారేళ్ళ యవ్వనాలు, పెళ్ళైన రాత్రి నుంచీ నరకపు అంచునుండి వేలాడుతున్న శరీరాలు, తమకడుపున పుట్టిన పిల్లలే సంకెళ్ళయి, ఇళ్ళే జైళ్ళయిన సందర్భాలు, తొంబై ఏళ్ళు వచ్చినా, ఈ ముసలి శరీరం ఎలా ఉందో చూద్దామనే కాంక్షతో చేసే వికృత చేష్టలు-**

**స్త్రీలను సాటి ప్రాణులుగానే గుర్తించకుండా, ఆమెను ఎలాగైనా హింసించే, అనుభవించే, చంపే అధికారం మాకుంది అని అనుకోవడం. అనుకోనివ్వడం, అమలు చేయడం వల్లనే ఇంత క్రూరత్వం పెరిగిపోతోంది.**

రేప్ చేస్తూ మూత్రాలు నోట్లో పోస్తూ వీర్యపు చిత్తడిలో చెలరేగిపోయి భయంతో బాధతో అరుస్తూ విలవిల్లాడుతుంటే, మత్తెక్కిపోయి విజృంభించిన వైనం ఇంకా కంటిబొమ్మ నుంచి చెరిగిపోనే లేదు. తీరిగ్గా ఇవ్వాళ వాళ్ళు తాగిన మత్తులో చేశారు. చేయాలనుకోలేదు. ఆడవాళ్ళు రాత్రిపూట రాకూడదు కదా? నేరం వాళ్ళదే. ఏం డ్రస్సులవి? ఇలాంటి చౌకబారు వ్యాఖ్యలు, వాళ్ళను సమర్థించే మనుష్యుల సంఖ్య చూసి రక్తం సలసలమని మరిగిపోతుంది.

మనం కన్నపిల్లలే, మనం మనుషులుగా పెంచిన తర్వాత కూడా మనమీదికే కత్తి ఎత్తడం భరించలేనిది? రోజురోజుకీ ఎందుకింత హింస పెరిగిపోతోందని ఆలోచిస్తే, మూలల్లోకి వెళ్ళితే, వ్యవస్థ ఎంత లోప భూయిష్టంగా ఉందో తెలుస్తుంది. కుటుంబాల్లో మార్పు రావాలి. జెండర్ వివక్ష వల్ల చిన్నప్పటి నుంచీ మగవాడేం చేసినా ఫర్వాలేదన్న ధోరణుల్లో మార్పురావాలి. మనుషులుగా మానవత్వం నిండిన వ్యక్తులుగా పెంచడానికి యత్నించాలి. భార్యాభర్తల మధ్య ఇగోల, ఆధిపత్యాల పద్ధతులు మారాలి. సృష్టికి ప్రతిసృష్టి చేసే వాళ్ళిద్దరూ పిల్లల పెంపకంలోనూ సరైన అవగాహనతో ప్రవర్తించాలి. మానసికంగా ధైర్యవంతులుగా, శారీరకంగా, ధృడవంతులుగా స్త్రీలను తయారు చేయాలి. ఒక ప్రాణి మరొక ప్రాణిని హింసించకూడదనీ స్పష్టంగా తెలియజెప్పాలి. ఆ మధ్యన సైకాలజిస్ట్ ఒకరు రాసిన ఆర్టికల్‌లో, తల్లిదండ్రులు సరిగ్గా లేకపోతేనే నేరస్థులుగా తయారవుతున్నారనీ, ప్రతి నేరస్థుడి వెనకా కుటుంబ చరిత్ర ప్రతిఫలాలుంటాయనీ, బాల్యంలో పిల్లలపై పడిన ముద్రలే పెద్దయిన తరువాత కార్యరూపం దాలుస్తాయని చెప్పుకుంటూ వచ్చారు.

**కుటుంబాల్లో మార్పు రావాలి. జెండర్ వివక్ష వల్ల చిన్నప్పటి నుంచీ మగవాడేం చేసినా ఫర్వాలేదన్న ధోరణుల్లో మార్పురావాలి. మనుషులుగా మానవత్వం నిండిన వ్యక్తులుగా పెంచడానికి యత్నించాలి. భార్యాభర్తల మధ్య ఇగోల, ఆధిపత్యాల పద్ధతులు మారాలి. సృష్టికి ప్రతిసృష్టి చేసే వాళ్ళిద్దరూ పిల్లల పెంపకంలోనూ సరైన అవగాహనతో ప్రవర్తించాలి.**

స్త్రీలపట్ల గౌరవంగా, ప్రేమగా, మానవత్వంతో ప్రవర్తించాలనే విషయాల్ని పదేపదే చెబుతూ మానసిక పరివర్తనను కుటుంబాల్లోనే ముందుగా తీసుకురాగలగాలి.

పెరుగుతున్న టెక్నాలజీ దుర్వినియోగాలకు కాకుండా మనిషితనంతో బతకడానికి వినియోగించుకోగలగాలి. నేరస్థులకు కఠినమైన శిక్షలను వెంటనే అమలు పరిచేట్లుగా చేయగలగాలి. వారిలో మానసిక పరివర్తనకై శిక్షణ, శిక్షల ద్వారా కృషి చేయాలి. ఏం చేసినా, డబ్బుంటే, అధికారముంటే ఏం చేసైనా తప్పించుకోవచ్చునుకొనే ధీమాలు పోవాలి. కఠినమైన శిక్షలు సత్వరమే అమలు జరిగితే భయం ఏర్పడి కొంత హింస తగ్గడానికి ఆస్కారముంది.

ఈ భూమీమ్మీద పుట్టినందుకు, పువ్వుల్లా బతకగలిగే, నవ్వగలిగే, హాయిగా జీవించగలిగే, మానవత్వపు పరిమళాలను వెదజల్లగలిగే, హింసలేని నైర్మల్యపు రోజులకోసం స్వప్నిస్తూ, యత్నిస్తూ సాధించుకొనే రోజులకోసం ఎదురు చూద్దాం.

**33వ పేజీ తరువాయి**

ధైర్యంతో దయాగన్ సోర్కాలా అనే గ్రామంలో ఆమెకున్న వైద్యరంగ అనుభవంతో వైద్యసేవలందించారు. ముఖ్యంగా గైనకాలజీపై స్థానిక మహిళలకు అవగాహన కల్పించడం, ప్రత్యేక శిక్షణనివ్వడం చేసేవారు. అలా వృత్తిపరంగా చేస్తున్న సేవల్లో భాగంగా ఆవిడ స్థానిక మహిళల చిత్రాలను తీసేవారు. కాబూల్ మహిళల్ని ఫోటోలు తీయడం అనే అంశంపై తాలిబన్లు మరింత కక్ష పెంచుకున్నారు. ఇక తనని బతకనివ్వరని సుస్మితకు అర్ధమైపోయింది. అయినా కూడా మొండి పట్టుదలతో ముందుకు సాగారు. కానీ చివరకు తాలిబన్ల చేతిలో బలయ్యారు. "చదువంటే ప్రాణాలు తీస్తారు.. సాటి మనిషిని ప్రేమించడమే నా కుటుంబం నాకు నేర్పిన సంస్కారం... నా మీద తూటాలు కురిపించిన తాలిబన్ వచ్చి ఎదురుగా నిలిచినా అతడిని నేను క్షమిస్తాను" అన్నవే ఆమె చివరి మాటలు.

యావత్ ప్రపంచమంతా స్త్రీ పురుషులిద్దరూ సమానమేనని నమ్ముతోంది. ఇద్దరికీ తేడా లేకుండా వ్యక్తిగత ప్రతిభాశక్తులతో స్త్రీ అంతకంతకు పురోగమిస్తుంది. కానీ తాలిబన్ వంటి ఉగ్రవాద సంస్థలు.. ఎక్కడో ఒకచోట ఏదో ఒక రూపంలో మహిళా లోకాన్ని అణగదొక్కుతూనే ఉన్నాయి. విద్యా, సాంస్కృతిక, సామాజిక రంగాల్లో ఎదగనీయకుండా చేస్తూనే ఉన్నాయి. ప్రగతిశీలమైన భావ ప్రకటనా స్వేచ్ఛను అణచేస్తూనే ఉన్నాయి. కానీ ప్రపంచం చూస్తూ ఊరుకోదు. వారి దురాగతాలను అడ్డుకోవడానికి మలాలా వంటి ఎగిసిపడే సముద్ర కెరటాలు పుడుతూనే ఉంటాయి! సాటి మహిళలకు అండగా నిలుస్తూనే ఉంటాయి.!!

మీడియా

# తప్పించుకున్నామా... ధన్యులం!

- కె.అరుణ

కలల రాకుమారులు, స్వయంవరాలు మన చిన్నప్పటి కథల్లో వినేవుంటాం. 'ఓయమ్మో' అనుకుని అబ్బురపడీ ఉంటాం. కానీ నేడు ఈ తరం వెర్రి వెంగళాయిల కోసం మరో కొత్త పద్ధతిలో స్వయంవరాలు నేడు మన కళ్లముందే నట్టింట్లో ప్రత్యక్షం. ఇదేం కథా... ఇదేం కమామీషు అంటారా? వివరాల్లోకి వెళ్లిపోదాం పదండి.

ఇంతకు ముందు రాఖీసావంత్ స్వయంవరం గుర్తుందా? ఇలాంటి కార్యక్రమాలకు పెట్టింది పేరయిన ఇమాజిన్ ఛానల్ నిర్వహించి ప్రేక్షకులను త్రిశంకు స్వర్గంలో ఊగిసలాడించిన కలల ప్రపంచం అది! దాని ప్రకారం, ఐటమ్ సాంగులతో వినుగెత్తిన రాఖీ తన జీవనసాథీని వెతుక్కోవాలనుకుంది.. అదీ ఛానల్ ద్వారా! (ఇదంతా ఛానల్ వారు లాభాలు పెంచుకునే వ్యాపారపు కిటుకుల్లో ఓ భాగమేనన్నది మీకు తెలుసుగా!) వాళ్లలా ప్రకటించగానే ప్రపంచంలో మరెక్కడా సలక్షణమైన అమ్మాయి దొరకనట్లు ఓ ముప్ఫైమంది యువకులు రెడీ అయిపోయారు. వాళ్లందరినీ ఒయ్యారాలు పోతూ రాఖీ సావంత్ ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించింది. ఆపై ఒక వీరుడు ఆమె మనసు (!) గెలుచుకున్నాడు. ఆపై ఏముంటుందని ఊహిస్తున్నారు. చెప్పండి? ఇంకేముందీ... అమ్మాయి అబ్బాయి ఒకటయ్యారు అనేనా! అదే జరిగితే ఇప్పుడు మనం ఎందుకు బుగ్గలు నొక్కుకుంటాం? వాళ్లిద్దరూ పెళ్లీ చేసుకోలేదు. ప్రేమించుకోనూ లేదు. కార్యక్రమానంతరం అతా పతా లేకుండా పోయారు. కానీ, ఛానల్ మాత్రం కాసులు పండించుకుంది. అంటే, ఎత్తుగడ పారిందన్నమాట! శహభాషు అని భుజాలు చరుచుకుని ఈసారి అమ్మాయిల ద్వారా మార్కెట్ పెంచుకోవాలని ఎత్తుగడ పన్నింది సదరు ఛానల్.

ఫలితమే... వివాదాలకు ఆలవాలమైన శ్రీశ్రీశ్రీ రాహుల్ మహాజన్‌గారి స్వయంవరం, ఇతగాడు గుర్తున్నాడుగా ప్రముఖ (!) రాజకీయ నాయకుడు ప్రమోద్ మహాజన్ సుపుత్రుడు. ఈయనగారి చరిత్ర గంజాయి, హెరాయిన్ అంత నిఖార్సయినది నమ్మీ! అయినా, మన పిచ్చి గానీ, స్వయంవరాలకు కావలసింది పేరెన్నికగన్న, పేరు ప్రఖ్యాతులున్న, నీతి నిజాయితీలకు ఆలవాలమైన, విలువలకు మారుపేరయిన.... వగైరా వగైరా వ్యక్తులు అనుకుంటున్నారా.?! కానేకాదు! ఆయా సెలబ్రిటీలు ఎంత కుళ్లు కంపు కొడితే అంత గొప్ప. ఎంత బురద అంటించుకుంటే అంత 'ఫేమస్సు'. ఇది నూటికి నూరుపాళ్లూ యస్సు! అన్నట్లు, అప్పటికే అతగాడు ఒకరికి విడాకులు ఇచ్చున్నాడు. అయితేనేం! స్వయంవరం మొదలైంది. అమ్మాయిలంతా తమకేం తక్కువ అనుకుంటూ తగుదునమ్మా అని పోటీకి సిద్ధమై పోయారు. వాళ్లు పెట్టిన తింగరబుచ్చి పోటీలలో వెర్రిగా పాల్గొన్నారు. ఛానల్‌వాళ్లు చెప్పిన దానికల్లా తానా తందానా అన్నారు. గెంతారు, ఆడారు, పాడారు, చిందులేశారు. చివరికి ఏం జరిగిందో తెల్సా! గెలిచిన డింపీ గంగూలీకి వరుడు దక్కాడు. శుభం అనుకుంటున్నారా! కాళ్ల పారాణి ఆరకుండానే ఆ అమ్మాయి ప్రమోద్‌పై గృహహింస కేసు పెట్టింది. ఇతగాడితో వేగడం నావల్ల కాదంటూ ఆ ఇంటి నుండి వెళ్లిపోయింది. హతోస్మి!

ఆ తరువాత మరో ముద్దరాలు వీణామాలిక్, ఆపై రతన్ రాజ్‌పుత్... ఇలా స్వయంవరాలు ప్రకటించారు. చివరికి, ఈ రకం స్వయంవరాలు పెళ్లిళ్లకోసం కాదని... కేవలం హల్‌చల్ సృష్టించడానికేనని తేలిపోయింది. మెల్లమెల్లగా టిఆర్‌పి రేటింగ్స్ తగ్గుముఖం పట్టాయి. వాస్తవం జనాలకు అర్థమైపోయిందని ఛానల్‌వాళ్ల బుర్రలకీ తెలిసిపోయింది. దరిమిలా కొన్నాళ్లపాటు ఈ గొడవ సద్దుమణిగింది.

మళ్లీ ఇప్పుడు మనం ఈ టాపిక్ ఎందుకు మాట్లాడుకుంటున్నామంటే.... ప్రస్తుతం మరో ఐటమ్ గాళ్ మల్లికా షెరావత్ 'దిబాచిలరేట్... మేరే ఖయాలోంకి మల్లిక' అంటూ చిన్న తెరపై నవ్వులు రువ్వుతోంది. (ఖర్మ కాకపోతే కలల రాకుమారి ఎవరైనా ఇలాంటి వారిని కూడా ఎంచుకుంటారా చెప్పండి? పోగాలం దాపురించడం అంటే ఇదే కామోసు! ఈ వేపకాయంత వెర్రి ప్రోగ్రాములు హాలీవుడ్‌లో కూడా ఉన్నాయి తెల్సా! అంటే, పిచ్చి విశ్వవ్యాపితం అన్నమాట!) మన దేశంలో 'లైఫ్ ఓకే' అన్న ఛానల్ దీనికి కర్త, కర్మ, క్రియ! అసలైన మాట మర్చిపోతే ఎలా? ఈసారి తెలివైన (!) మల్లిక ముందే ఓ విషయం ప్రకటించింది అదేమనగా...'ఇది నా జీవిత భాగస్వామిని వెతుక్కునే కార్యక్రమం కాదు. గెలిచిన వారిని నేను పెళ్లి చేసుకోను ఇది కేవలం నేను నా 'సోల్‌మేట్' (దీని భావమేమి తిరుమలేశా!)ను వెతుక్కునే పోటీ మాత్రమే' అని! వహ్వా! ఏమి తెలివి? సరే!

మిమ్మల్నందరినీ కోతుల్ని చేసి ఆడిస్తాను రండి అనగానే ముప్పైమంది కథానాయకులు సిద్ధం! ఈ పర్వం కొనసాగుతోంది. ఏమవుతుందో వేచి చూడాల్సిందే!

ఇదంతా మనం ఎందుకు మాట్లాడుకోవాలి? వీటినుండి ఏం తెలుసుకోవాలి? తప్పకుండా ఒక్కటన్నా ఉంటుంది. అది మనల్ని సరైన పంథాలో నడుపుతుంది. మనకు ఎదురయ్యే ప్రతి అంశంలోనూ మంచి చెడులను బేరీజు వేసుకుని సరైన మార్గంలో నడవడమేగా మనిషిగా మనం చేయవలసింది. అదేగా! మనల్ని ప్రగతిమార్గాన నడిపించేది.

ప్రతి మనిషిలోనూ ఓ దుగ్ధ ఉంటుంది. తనను పదిమందీ గుర్తించాలని! తనను గురించి నలుగురూ మాట్లాడుకోవాలని గుంపులో ఒక్కరిగా కాక ప్రత్యేకంగా కనిపించాలని! ఓ రకంగా కీర్తి కండూతికి వచ్చిన తిప్పలనుకోండి! ప్రేక్షక మహాశయులకు వీటన్నింటికీ ఈ కార్యక్రమాలు వేదికగా కనిపిస్తున్నాయి. సరిగ్గా... అదే ఛానల్‌వారికి కావలిసింది వారిని లాభాల బాట పట్టించే దినుసు అదే! ఈ క్రేజును ఉపయోగించుకుంటే చాలు... వ్యాపారం మూడు పువ్వులు... ఆరు కాయలు అన్నది వారికి వెన్నతో పెట్టిన విద్యలా అబ్బేసింది. దానికి అమాయకంగా బలవుతున్నది ఎవరయ్యా అంటే... సామాన్యజనం. ఇదేదో వరమువద సోపానమని తెలుసుకోవడం లేదు. ఇందులో పాములుంటాయనీ తెలియదు. మెట్లు పాతాళంలోకి లాక్కెళ్తాయని తెలియదు. ఎవరో తోలుబొమ్మల్లా ఆడిస్తుంటే తాము కీ ఇచ్చినట్లు ఆడుతున్నామనీ తెలియదు. తమ వెర్రి వేషాలు, తమ తిక్క చేష్టలు మరొకరికి కాసులు రాలుస్తున్నాయనీ తెలియదు.

వీరి సంగతి సరే! చూసే వాళ్ల సంగతేంటీ? ఈ కార్యక్రమాల వల్ల ప్రయోజనమేంటీ? దమ్మిడీ ఉపయోగం లేకపోగా... ఆలోచనను తుంచేయడం. 'ఏమో గుర్రం ఎగరావచ్చు' అని భ్రమిస్తూ అమాయకులను ఆశల రెక్కలపై ఎక్కి విహరింపజేయడం! ఇలాంటి పనికిమాలిన కార్యక్రమాలు చూస్తూ సమయం వృథా చేసుకునేకన్నా.. ఉపయోగపడే విషయాల గురించి ఆలోచించుకుంటే ఉత్తమం. తమ జీవితం, కుటుంబం, ఆపై సమాజం గురించి ఆలోచిస్తే అత్యుత్తమం. అసలు సమాజాన్ని పట్టి పీడిస్తున్న... విలువలను భ్రష్టుపట్టిస్తున్న... మానవ సంబంధాలను తునాతునకలు చేస్తున్న అంశాలపై దృష్టి సారించితే శ్రేయస్కరం.

ఇదనే కాదు, మీడియాలో రెచ్చిపోతున్న ఛాలెంజ్‌లు, మోడ్రన్ మహాలక్ష్ములూ, డాన్సులు, కామెడీలూ అన్నీ ఇలాంటివే! ఈ కార్యక్రమాలన్నీ మసిపూసిన మారేడుకాయలు. అందమైన ముసుగు వేసుకున్న మాయల మరాఠీలు. మనసుపై మత్తుజల్లి విచక్షణ కోల్పోయేలా చేసే అయస్కాంతాలు. ఈ తిప్పలనుండి తప్పించుకున్నామా ధన్యులం... లేదంటే....!

## స్పందన

ఎడిటర్‌గారికి,

చైతన్యమానవి మహిళలు ఎదుర్కొంటున్న అనేక రకాలైన సమస్యలను ఆవిష్కరిస్తున్నది. జులై - సెప్టెంబర్ పత్రిక ఎడిటోరియల్ బావుంది. గురజాడగారి పై వ్యాసం, డా॥ భారతిసాగర్ వ్రాసిన ఆర్టికల్ స్తన విచ్ఛేదన- తెర వెనుక వాస్తవాలు చదివిన తర్వాత కార్పోరేట్ సంస్థలు ఏరకంగా తమ అభివృద్ధికి ప్రజలపై దోపిడీకి ప్రయత్నిస్తున్నాయో తెలిసింది.

**కోమలి,హైదరాబాద్.**

చైతన్య మానవి పత్రిక చాలా విజ్ఞానదాయకంగా వుండడంతోపాటు అన్ని ఆర్టికల్స్ వెంటనే చదవాలి అనేంతగా వుంటున్నవి. అయితే ఇంకొన్ని జాగ్రత్తలు తీసుకుంటే ఇంకా మెరుగులు దిద్ద వచ్చును అన్పిస్తుంది. చట్టాలు శీర్షిక క్రింది ప్రతి సంచికలో ఒక చట్టం గురించి వివరిస్తున్నారు. బావుంది. కానీ చట్టాల్లోని ముఖ్యంశాలను 1,2,3,అని బుల్లెట్లుగా ఇస్తే చదవడానికి ఇంకా బావుంటుంది. ప్రతి సంచికలో సూక్తి ఇస్తున్నారు బావుంది. కానీ దీన్ని అందరి చూపు పడేచోట పెడితే ఇంకా హైలెట్ అవుతుంది. కథలు మూడైనా వుంటే బావుంటుంది. వకుళాభరణం లలిత గారు, వేములపల్లి సత్యవతి గారి ఆర్టికల్స్ పత్రికకే హైలెట్‌గా వున్నాయి.. మ్యాగజైన్ రాగానే "అవగాహనా సందర్భం" శీర్షిక కోసం వెతుకుతున్నాం. అందరినీ ఆలోచింప చేస్తున్న శిలాలోలితగారికి నమస్సులు.

**వి. గౌరి, హైదరాబాద్.**

"ఆధునిక స్త్రీలే చరిత్రని పునర్నిర్మిస్తారని గాఢంగా నమ్మిన 19వ శతాబ్దపు కథానాయకుడు గురజాడ గారి వ్యాసం చదివాను. అప్పట్లోనే ఎంతో ప్రగతిశీల ఆలోచనలతో కావ్యాలు వ్రాశారంటే ఆయన ఎంతటి స్త్రీ జన పక్షపాతో అర్థమౌతుంది. ఈ వ్యాసం వ్రాసిన డా॥ నళిని గారికి ధన్యవాదములు. శిలాలోలితగారు వ్రాసిన "బజారుల్లో కొనలేనివి" అన్న శీర్షిక నేటి వృద్ధుల పరిస్థితులను అద్దం పడుతుంది.

మహిళా ఉద్యమాలు, స్త్రీవిద్య, ఆరోగ్యం, చరిత్ర, మంచి కథలతో కూడిన " చైతన్య మానవి'' సంపాదకులకు, సంపాదకవర్గానికి ధన్యవాదములు.

**భావన రాజ్యలక్ష్మి, ప్రగతినగర్**

స్తన విచ్ఛేదన - తెరవెనుక వాస్తవాలు' శీర్షిక ద్వారా మహిళలందరినీ కలవరపాటుకు గురిచేసిన "జన్యు పరీక్షలు స్తనవిచ్ఛేదన " అంశం మీద చక్కటి వివరణ యిచ్చి, మాకు సరైన అవగాహన కలిగించినందుకు చైతన్య మానవికి ధన్యవాదములు. ఇంత సున్నిత విషయం మీద (జన్యువులు) కార్పోరేట్ సంస్థలు గుత్తాధిపత్యం వహించి, వ్యాపారం చేయడం చాలా బాధాకరమయిన విషయం.

**శాంత కుమారి, ప్రగతినగర్**

చట్టాలు

# వరకట్న నిషేధ చట్టం 1961

## The Dowry Prohibition Act 1961

-ఆర్. దుర్గా ప్రసన్న
అడ్వకేట్

ప్రాచీనమైన సంస్కృతి కలిగిన మన భారతదేశం అనేకమైన పెనుమార్పులను ఎప్పటికప్పుడు సంతరించుకుంటూనే ఉంది. ధార్మిక ఆధ్యాత్మిక భావనలకు ఆలవాలం అనుకుంటున్న భారతదేశంలో స్త్రీని శక్తి స్వరూపిణిగా పూజించే ఈ దేశంలో అనేకానేక మత, రాజకీయ, ఆర్థిక కారణాలు, సమాజంలో చోటు చేసుకున్న పెనుమార్పులు స్త్రీని అబలగా నిలబెట్టాయి. ఆర్థిక సంబంధాలు మనుష్యుల మధ్య బలమైన అడ్డుగోడలుగా నిలచినపుడు స్త్రీకి సమాజంలో ఆస్థిహక్కు లేకపోవడం, కుటుంబ వ్యవస్థలో ఆడపిల్లని వేరే కుటుంబానికి పంపటం అది పెళ్ళి పేరుతో, కన్యాదానం పేరుతో పరాధీనగా వెళ్ళడం అనే ప్రక్రియలో భారత స్త్రీ అనేక ఒడిదుడుకులను ఎదుర్కోవలసి వచ్చింది. పిల్లలు, ఇతర కుటుంబ సభ్యుల అవసరాలకు తగినట్లుగా కుటుంబానికి సహకరించవలసిన భాధ్యతకు మాత్రమే పరిమితమైంది. ఫలితంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, విద్యకు దూరమైంది. అంతేకాక పురుషుని ఆస్థిలో ఇటు కుమార్తెగానూ, అటు భార్యగానూ కూడా వాటాగానీ, హక్కుని గానీ పొందలేని కట్టుబాట్ల తెరలు దట్టంగానే నిలచాయి. సతీసహగమనం, కన్యాశుల్కం లాంటి దురాచారాలు కాల క్రమంలో మరుగున పడినా స్త్రీకి "వరకట్నం" అనే చిన్నవేడుక, అతిపెద్ద ఆచారంగా దురాచారం వేళ్ళూనుకుంది సమాజంలో. ఎందుకంటే ఆస్తి హక్కుల్లేని అబలకి పుట్టింటివారు పెళ్ళి సమయంలో కొంత ధనం కానుకల రూపేణా ఆమె యొక్క ఆర్థిక భద్రతకోసం గానీ, పుట్టింటివారి యొక్క సంతోషానికిగాని ఇవ్వడం జరిగేది. స్త్రీపైన, ఆమెయొక్క ఆస్థి పాస్తులపైన కూడా పురుషుడు అంటే ఆమె భర్త అధికారం చెలాయించడం సమాజంలో అతి మాములు విషయం. చివరకు ఈ వరకట్నం అనేది అనేక విషకోరలను చాచి సమాజంలో నవవధువు ఉనికినే ప్రశ్నించే స్థాయికి చేరింది. 1961వ సంవత్సరంలో వరకట్న నిషేధానికి చట్టం చేయడం జరిగింది. అంటే సమాజంలో ఒక అమ్మాయికి వివాహం జరగాలంటే పురుషునికి అతడు కోరినంత ధనం విధిగా చెల్లించాలి అన్నమాట. వరుని / వరుని యొక్క కుటుంబీకుల కోర్కెలు తీర్చడం వధువు తండ్రికి తలకుమించిన భారం అయింది. అప్పుచేసి మరీ అడిగినంతా ఇచ్చి వివాహం చేసినా, వివాహానంతరం అదనపు కట్నంకోసం అమ్మాయికి హింస, అవమానం తప్పనిసరి అయిపోయింది సమాజంలో. అనేక కుటుంబాల్లో వరకట్నం 'అతివ' జీవనంలో చిచ్చుని రేపి, మారణహోమాన్ని రగిలించింది. పరిస్థితిని అదుపులోకి తేవడానికి (The dowry prohibition Act 1961) వరకట్న నిషేధ చట్టం 1961ని అమలులో తీసుకురావడం జరిగింది.

'వరకట్న నిషేధ చట్టం' 1961 జులై 1వ తేదీ నుండి జమ్ము, కాశ్మీర్ రాష్ట్రాలు తప్ప మిగిలిన భారతదేశం అంతటా వర్తిస్తూ అమలులోకి వచ్చింది. అంతేకాదు భారతదేశంలోని భారతీయులందరికీ అంటే హిందువులు, ముస్లింలు అంటూ మత బేధం లేకుండా అందరికీ వర్తింప చేశారు.

ఈ చట్ట ప్రకారం వరకట్నం ఇవ్వడం, తీసుకోవడం నేరం, అంతేకాదు స్థిర, చరాస్తులు వివాహ విషయంగా వరునికి ఇచ్చి పుచ్చుకోవడానికి ఒప్పందాలు చేసుకున్నా ఇరువైపుల వారు నేరస్థులే అవుతారు. అనంతర కాలంలో పెళ్ళి కుమారునికి ఇచ్చే వాచీలు, సైకిళ్ళు (స్కూటరు) టి.వి., ఫ్రిజ్‌లు లాంటి కానుకలు అడగడం, ఇవ్వడం కూడా నేరమే అంటూ వరకట్న నిషేద చట్టంలో చాలా వివరంగా పొందుపరచడం జరిగింది. సాధారణంగా చట్టాలన్నీ కూడా నేరస్థులు బాధితులు వేరుగా విభజించబడి వుంటాయి. కానీ ఈ వరకట్న నిషేద చట్టంలో కట్నం డిమాండ్ చేసి తీసుకున్న వారేకాక షరతులకు తలొగ్గి కట్నం ఇచ్చిన వారూ శిక్షార్హులే అవుతారు.

ఎంతో పటిష్టంగా వరకట్న నిషేధ చట్టం తయారు చేయడం జరిగింది అనేక విషయాలను కూలం కషంగా చర్చించడం జరిగింది. కానీ చట్టం అమలులో ఘోరంగా విఫలమైంది అని చెప్పకతప్పదు. అందుకు సాక్ష్యం 1961వ సంవత్సరంలో చట్టం వచ్చినా 1980వ దశకానికి 'వరకట్నం' దురాచారాస్థాయినుండి 'వరకట్న దహనాలు'గా రూపాంతరం చెంది నవవధువులు అనేక రూపాల్లో అగ్నికి అహుతి కావడం మనకు తెలిసిందే. అందువల్ల ఈ చట్టానికి మళ్ళీ మళ్ళీ అవసరమైన సవరణలు (1998)లో చేయవలసి వచ్చింది. ఏది ఏమైనా వరకట్న నిరోధకచట్టం వరకట్న హత్యలను నిరోధించవలసి రావడం దురదృష్టకరం. అయితేనేం ఈ చట్ట ప్రకారం ఏ స్త్రీ అయినా వరకట్న వేధింపులకి గురిఅయినా, ఆత్మహత్యకి, హత్యకి గురి అయినా అందుకు

**'వరకట్న నిషేధ చట్టం' 1961 జులై 1వ తేదీ నుండి జమ్ము, కాశ్మీర్ రాష్ట్రాలు తప్ప మిగిలిన భారతదేశం అంతటా వర్తిస్తూ అమలులోకి వచ్చింది. అంతేకాదు భారతదేశంలోని భారతీయులందరికీ అంటే హిందువులు, ముస్లింలు అంటూ మత బేధం లేకుండా అందరికీ వర్తింప చేశారు.**

కారకులుగా అమె భర్తనే కాక, అత్తమామలు ఇతర కుటుంబ సభ్యులు కూడా నేరస్థులుగా తేలితే శిక్షార్హులు. ఒక వివాహితను వరకట్నం కోసం వేధించినా, బాధించినా, అమె మరణానికి కారకులైనా అత్తింటి వారందరినీ అరెస్టు చేసే వీలుంది. ఏ కారణం చేతనైనా వివాహిత స్త్రీ ఆత్మహత్యను తరువాత కాలంలో వరకట్న హత్యగా అనుమానించినపుడు కూడా 1 సంవత్సరకాలం వ్యవధిలో న్యాయస్థానాన్ని ఎవరైనా సరే బాధితురాలి తరపున న్యాయస్థానాన్ని ఆశ్రయించవచ్చును. వరకట్న నిషేధ చట్టానికి అవసరమైన సవరణలకు అనుగుణంగా క్రిమినల్ ప్రోసీజరల్ కోడ్ 1973 లోను, INDIAN EVIDENCE ACT 1872(ఇండియన్ సాక్ష్యాధారముల చట్టం) లోనూ కూడా సవరణలు చేయడం జరిగింది. NON-BAILABLE అంటే బెయిల్ ఇవ్వడానికి వీలులేని తీవ్రమైన నేరంగా పరిగణించబడుతుంది. అయినప్పటికీ న్యాయస్థానాన్ని ఆశ్రయించి న్యాయాన్ని పొందిన భాదితులుగానీ, శిక్షించబడిన నేరస్థులుగానీ ఎంతమంది అనేది ప్రశ్నే? అయితే స్త్రీల హక్కుల రక్షణకోసం మనదేశంలో వచ్చిన చట్టాలలో ఇదికూడా ఒక ముఖ్యమైన చట్టంగా చెప్పుకోవాలి. సమాజంలో స్త్రీలపై జరిగే దౌర్జన్యాన్ని హింసల్ని గుర్తించి అవసరమైన సవరణలు చేసినప్పటికీ పరిస్థితి తీవ్రతను చెప్పకనే కళ్ళకు కడుతున్నాయి. స్త్రీకి విద్య, ఉద్యోగ, ఆస్తి హక్కులు ఎన్ని వున్నా స్త్రీని, అమెయొక్క ఆస్థిని పురుషుడు తన ఆస్థిగా భావిస్తున్నంతకాలం, స్త్రీపై అధికారాన్ని చెలాయించాలనే పురుషాధిక్య ధోరణి మారనంతకాలం చట్టాలు మాత్రమే స్త్రీకి రక్షణ నివ్వలేవు-అనేది విస్పష్టం చేసిందీ చట్టం.

## సంక్షేమానికి బాటలు ఐ.ఎల్.ఓ సదస్సు

అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఓ) ఒక ప్రాముఖ్యత కలిగిన అంతర్జాతీయ సదస్సును నిర్వహించింది. ఆ సదస్సు ఇంటి పనిని కూడా ఆర్థిక రంగంలోని ఒక ఉత్పాదక పనిగా గుర్తించాలని తీర్మానించింది. అంతేకాక భారతదేశంలో ఈ రంగం సుదీర్ఘ నిర్లక్ష్యానికి గురవడాన్ని కూడా సదస్సు గుర్తించింది. ఇంటిపని వారి విషయంలో కొన్ని ప్రామాణికాలు పాటించాల్సి వుందని అంతర్జాతీయ కార్మిక సంస్థ నిర్ణయించింది. అందులో భాగంగా ఇంటిపని వారు స్వేచ్ఛగా సంఘం పెట్టుకొనే అవకాశం వుండాలనీ, వారు తమ జీత భత్యాల గురించి యజమానులతో బేరసారాలు ఆడే హక్కు కలిగి వుండేలా చూడాలనీ రాష్ట్రాలను అదేశించింది.కాని ఇంటిపని వారు పనిచేసే ప్రదేశాలు వేరు వేరుగా వుండడం, ఒకటి కంటే ఎక్కువ చోట్ల పనిచేయడం మొదలైన కారణాలతో వారు సంఘటితమై హక్కులకోసం పోరాడడం చాలా కష్టతరంగా వుంది. ఒంటరిగా, రక్షణలేని పరిస్థితుల్లో పనిచేయాల్సిరావడం, 80శాతం పైన మహిళలే ఈ రంగంలో పనిచేయడంతో వీరు దోపిడీకి గురయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటున్నాయి. వీరిలో ఎక్కువ శాతం వలస వచ్చిన వారు కావడం వలన కూడా వీరు మరింత అభద్రతా భావంతో పనిచేస్తూ ఇంకా ఎక్కువ దోపిడీకి గురవుతున్నారు.

ప్రపంచవ్యాప్తంగానే మిగిలిన రంగాలతో పోల్చితే ఈ రంగంలో ద10శాతం మంది మాత్రమే సాధారణ కార్మిక చట్టాల పరిధిలోకి వస్తున్నారనే విషయం ఆశ్చర్యకరమే కాదు. 2013లో ఐఎల్ఓ విడుదల చేసిన ఒక నివేదిక ప్రకారం ఆసియా, పసిఫిక్ ప్రాంతాల్లోనే 41శాతం ఇంటిపని వాళ్ళు కేంద్రీకృతమై వున్నారు. కానీ వీరికి చట్టపరమైన రక్షణ విషయంలో మాత్రం ఈ ప్రాంతాలు చాలా వెనకబడివున్నాయి.

ప్రపంచంలో సాధారణంగా 50శాతం మందికి ఒక వారాంతపు సెలవు వుండగా ఇంటిపని వారిలో మాత్రం 3 శాతం మందికి మాత్రమే వారాంతపు సెలవు వుంది. ఆసియా, పసిఫిక్ ఖండాలలోని ఇంటిపని వాళ్ళలో ఒక్క శాతం మందికి మాత్రమే పని గంటలపై గరిష్ట పరిమితి వుంది. లాటిన్ అమెరికా దేశాలలో హక్కులుగా పొందుతున్న కనీస వేతనాలు, ప్రసూతి వసతులు లాంటివి ఆసియా దేశాలలో సుదూర స్వప్నాలుగానే వున్నాయి.

ప్రపంచంలోని ఇంటిపని వాళ్లలో 8శాతం మంది భారతదేశంలో వున్నారు. వీరికి చట్టబద్ధమైన రక్షణ కల్పించే ప్రయత్నంలో 1950వ సం॥లో భారత పార్లమెంటులో ఒక ప్రైవేటు బిల్లు ప్రవేశ పెట్టారు. ఈ మధ్య తమిళనాడులో చేతిపని కార్మికుల చట్టం పరిధిలోకి ఇంటిపని వారిని తేవడం మరియు కేరళ, కర్నాటక, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రాల్లో వీరి కనీస వేతనాలకు చట్టబద్ధమైన గ్యారంటీనివ్వడం, వీరికి రక్షణ కల్పించే చట్టాల కోవలోకి వస్తాయి. వారాంతపు సెలవు, వేతనంతో కూడిన సెలవు మరియు ఇతర దీర్ఘకాల న్యాయబద్ధమైన కోర్కెలు పరిష్కరించినప్పుడు మాత్రమే వారు కార్మికులుగా, సమాజంలో గుర్తింపు పొందగలుగుతారు.

భారతదేశంలో మారుతున్న కుటుంబ పరిస్థితులు, పట్టణీకరణ వంటి కారణాలతో రోజు రోజుకూ ఇంటిపని కార్మికుల అవసరం పెరిగి వారి సంఖ్య పెరుగుతుంది. ఐఎల్ఓ సదస్సు తీర్మానాన్ని ఆమోదించి ముందుకు తీసుకువెళ్ళడం ద్వారా మిలియన్ల కొద్దీ పనిచేస్తున్న ఈ రంగంలోని ఇంటిపని వాళ్ళకు మేలు జరుగుతుంది. దీనికితోడు ఇంటిపని వాళ్ళకోసం పటిష్ట చట్టాన్ని రూపొందిచాల్సిన అవసరం వుంది. ఇది సాధ్యపడాలంటే ముందుగా ఇంటిపని వాళ్ళ పని పరిస్థితుల మెరుగుదలకై జాతీయ మహిళా కమిషన్ ప్రతిపాదించిన 2008 డ్రాఫ్ట్ బిల్లును పార్లమెంటు ఆమోదించి అమలు పర్చాల్సిన అవసరం ఎంతైనా వుంది.

సేకరణ : మానవిడెస్క్

కేస్ స్టడీ

# మూఢ భక్తే (అంధ విశ్వాసమే) ముంచింది....!

-శాంతి శ్రీ

మతం మత్తులాంటింది అన్నాడు మార్క్స్. అది ఎంత నిజమో ఒక కుటుంబంలో జరిగిన ఘటన కళ్లకు కట్టింది. ఆమె మూఢభక్తి పారవశ్యం తనని దోషిగా నిలబెట్టడమే కాకుండా, ఆర్థికంగా ఆరోగ్యంగా నష్టం చేసింది. అంతేకాదు యావత్తు కుటుంబాన్నీ చుట్టూ ఉన్న సమాజం వేలెత్తి చూపేలా చేసింది. ఆమెపై ఉన్న అపార నమ్మకం స్థానే మోసకారిగా ముద్ర పడింది. తనపై నమ్మకం ఉంచిన వారిని మోసం చేయాలనేంత తప్పులోకి జారిపోయింది. అంతేకాదు కుటుంబం మొత్తం అప్పుల సుడిగుండంలో చిక్కుకు పోయింది. ఆమె మంచితనం కన్నా ఆమె, ఆమె కుటుంబం మొత్తానికి ఉన్న మూఢభక్తి పారవశ్యమే ఇంతపని చేయించిందంటే ఎవరికైనా ఆశ్చర్యం కలగక మానదు. అది ఎంత వాస్తవమో తెలియజేప్పేదే ఈ ' కేస్ స్టడీ' లో కథనం...

నాలుగుపదులు దాటిన ఒకామె తన భర్తతో కలిసి మోటూరు ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో నడున్తున్న కుటుంబ న్యాయసలహా కేంద్రానికి వచ్చింది. సమస్య ఏమిటో చెప్పమన్నారు బాధ్యులు. ఆమె భర్త ఇలా చెప్పుకొచ్చాడు.

“నా భార్య పేరు సరోజ, నా పేరు నదానందం. నా భార్య చాలా మర్యాదస్తురాలు. మృదు స్వభావి. ప్రతిరోజు క్రమం తప్పకుండా పూజ, లేకపోతే వంట. అంతకుమించి రెండోపనిలో ఉండదు. అలాంటి ఆమె అందరి దగ్గరా అప్పులు చేసి ఆమె బావ (అక్క భర్త)కు 47లక్షల రూపాయలు అప్పజెప్పింది. ఇది మా ఇంటిల్లిపాదిని ఆశ్చర్యంలో ముంచెత్తిన విషయం. ఆమె అలాంటిదంటే మాకు ఇప్పటీకి నమ్మకం కలగడం లేదు. అతను ఆమెకేదో ఇంజెక్షన్ ఇచ్చాడంటుంది. అది వాళ్ళ పుట్టింట్లోనే జరిగింది. వాళ్ల అమ్మ నాన్నకు విషయం తెలుసు. కానీ వాళ్ళూ ఆమెదే తప్పు అంటున్నారు. ఇంట్లో బంగారం, డబ్బు అంతా వాళ్ల బావకే ముట్టజెప్పింది. ఆఖరుకు ఇంట్లో పనిచేసే ఆమె వద్ద కూడా అప్పు చేసింది. మా పరువంతా పోయింది. మా అమ్మ మా ఆవిడపై పడిన ముద్ర తుడిపేసుకున్నాకే ఇంట్లో అడుగుపెట్టమంటుంది. మాకు ముగ్గురు కొడుకులు. అందరూ మంచిగా చదువుకునే వాళ్లు. మా చిన్నోడు గ్రూప్స్‌కు ప్రిపేర్ అవుతున్నాడు. వాడు మా అమ్మ దగ్గరే ఉన్నాడు. ఈ పరిస్థితుల్లో 98శాతం మార్కులు వచ్చేవాడు మొదటిసారి తప్పాడు. పెద్దవాళ్లిద్దరూ ఒకరు సిఏ చేస్తుంటే, మరొకరు ప్రముఖ పేరున్న కంపెనీలో ఉన్నతోద్యోగం చేస్తున్నాడు. ఇప్పటికే సంవత్సరంపైగా తమ్ముడి ఇంట్లో తలదాచుకుంటున్నాం. ఇలా ఎంతకాలం ఉంటాం? అందుకే నా భార్యపై పడిన మచ్చ తుడిపేయాలంటే మీ సహాయం కావాలి. ఎవరైతే నా భర్యను బ్లాక్‌మెయిల్ చేస్తున్నారో వారి బండారం బయటపెట్టాలి” అన్నాడు సదానందం.

ఆమెను ' ఏమిటమ్మా? ఆయన చెప్పేదంతా నిజమేనా?' అని అడిగితే కన్నీరు తప్ప ఒక్క మాట మాట్లాడటం లేదు. బాధ్యులు ఆమె భర్తను బయటకు పంపి ఒక్కదాన్నే కూర్చోబెట్టి అసలు జరిగిందేమిటో చెప్పమ్మా?' అన్నారు. ఆమె చెప్పటం మొదలుపెట్టింది.." నాభర్త చెప్పినదంతా నిజమేనమ్మా! నా బావ దీనికంతటికీ కారకుడు. అతను, అతని కొడుకు ఇద్దరూ కలిసి మా అమ్మగారింటికి వెళ్ళినప్పుడు నా తలలో ఏదో ఇంజెక్షన్ చేశారు. 'ఇక నుండి నీకు భవిష్యత్తు అంతా తెలుస్తుంది నీతో దేవుడు మాట్లాడతాడు. నీ దగ్గరకు ఎవరైనా సమస్య కోసం వస్తే నువ్వు వారికి పరిష్కారం చూపించగలవు' అని చెప్పారు. నేను కూడా అలాగే నాకేదో శక్తి వచ్చిందని అనుకున్నాను. నాకు తెలియకుండా నేనేదో మైకంలో ఉండటం ప్రారంభమైంది. నా బావ రోజూ మా ఇంటికి వచ్చేవాడు. ముందు ఇంట్లో వాళ్లందరూ నాలో శక్తి ఉందని నమ్మారు. ఆ తర్వాత ఆ విషయం మా బంధువులకి, ఇంటి చుట్టుపక్కల వారికి కూడా తెలిసింది. చివరకు నా భర్త చేసే ఉద్యోగం మానేసి నాతో పాటే ఈ దేవుడి సేవలో ఉండిపోయాడు. ఇలా నిత్యం పూజల్లో ఉండటం, వచ్చిన వాళ్ల సమస్యను విని పరిష్కారం చెప్పడంతో గడిచిపోయేది. వచ్చిన వాళ్లందరూ నన్నో దేవతలా చూడటం మొదలు పెట్టారు. కానుకలు ఇవ్వడం ప్రారంభించారు. సమస్యలు పరిష్కారమైన వాళ్లు 'ఎంతివ్వమంటారు?' అని అడగటం మొదలైంది. దీన్ని బావ పసిగట్టాడు. దీనికోసమే అతను ఇదంతా చేసింది. ఏ సమస్యకు ఎంత డబ్బు తీసుకోవాలో ఆయనే నిర్ణయించేవాడు.

ఆమె మూఢభక్తి పారవశ్యం తనని దోషిగా నిలబెట్టడమే కాకుండా, ఆర్థికంగా ఆరోగ్యంగా నష్టం చేసింది. అంతేకాదు యావత్తు కుటుంబాన్నీ చుట్టూ ఉన్న సమాజం వేలెత్తి చూపేలా చేసింది. ఆమెపై ఉన్న అపార నమ్మకం స్థానే మోసకారిగా ముద్ర పడింది. తనపై నమ్మకం ఉంచిన వారిని మోసం చేయాలనేంత తప్పులోకి జారిపోయింది.

ఆయన చెప్పినట్లే చేసేదాన్ని. అలా వచ్చిన డబ్బులన్నీ ఆయనకు ఇచ్చేసే దాన్ని. చివరకు అతని ధనదాహం ఎక్కడవరకూ వెళ్లిందంటే ఇంట్లో డబ్బులు, బంగారం కూడా ఎవరికీ తెలియకుండా ఆయనకు యిచ్చేశాను. మా మామగారి స్నేహితుల్ని, తెలిసిన వాళ్ళని ఇంట్లో వాళ్లకి చెప్పకుండా అప్పు అడిగి బావకు తెచ్చిచ్చాను." అని చెప్పింది సరోజ.

'ఎందుకలా ఇచ్చావు? అతను నువ్వు ఇవ్వనంటే ఏమంటాడు? నువ్వు చేసింది తప్పే కదా?' అని బాధ్యులు అడిగితే అప్పుడు అసలు విషయం చెప్పుకొచ్చింది.

"ఇప్పటి వరకూ ఈ విషయం నా భర్తకు కూడా చెప్పలేదు. అతను వచ్చినప్పుడల్లా నాకేదో ఇంజెక్షన్ చేసి లొంగదీసుకునేవాడు. ఒకసారి ఆ పరిస్థితిలో ఉన్న నన్ను నగ్నంగా ఫోటోలు తీశాడు. వాటిని చూపెట్టి నన్ను బ్లాక్‌మెయిల్ చేశాడు. నన్ను నా కుటుంబానికి కాకుండా చేస్తానని బెదిరించాడు. ముందు అతను చెప్పేవన్నీ నమ్మాను. ఆ తర్వాత నేను జనాన్ని మోసం చేస్తున్నానని అనిపించింది. అప్పుడు ఆ ఫోటోలు చూపించాడు. అప్పటివరకూ ఫోటోలు తీసినట్లుగానీ, నన్ను అతనలా లొంగతీసుకుంటున్నాడని గానీ నాకు తెలియదు. నన్ను తెలియని స్థితిలో పెట్టి, అతను అలా ప్రవర్తించాడని తెలిసి నిలువునా నీరుగారిపోయాను. ఏడ్చాను. అతని కాళ్లు పట్టుకుని బతిమలాడాను. ఆయినా అతను కరగలేదు. అతను ఏం చెప్తే అది చేశాను. చివరికి ఎప్పుడైతే పనిమనిషి దగ్గర అప్పు చేశానో అప్పుడు ఇంట్లో వాళ్లకి నా మీద అనుమానం వచ్చింది. ఎందుకలా చేశావని అడిగారు. నన్ను లొంగదీసుకున్నాడన్న విషయం చెప్పలేదుగానీ, నా బావే నా చేత ఇవన్నీ చేయిస్తున్నాడని చెప్పాను. మా అత్తగారు చాలా బాధపడ్డారు. మా కుటుంబంలో అందరూ చాలా మంచివాళ్లు. ఉమ్మడి కుటుంబమైనా ఎప్పుడూ ఎటువంటి గొడవలు జరగలేదు. ఇంత జరిగినా, ఈ అప్పులు తీర్చడానికి నా తోడికోడళ్లు, అత్తగారు వాళ్ల నగలు, వాళ్ల వాళ్ల పుట్టింటి దగ్గర డబ్బులు తెచ్చి తీర్చారు. నా పుట్టింటి వాళ్లకి బావ నా మీదే తప్పేసి లేనిపోనివి చెప్పాడు. మా అమ్మకి విషయమంతా తెలుసు. మా అమ్మను ఎవ్వరూ మాట్లాడనివ్వరు. నేనే నా బావ వెంటపడుతున్నానని మా వాళ్లందరికీ చెప్పి, నన్ను వాళ్లతో తిట్టించాడు. నాకు మా మరిది వాళ్లింట్లో ఉండబుద్ధి కావడం లేదు. ఒక్కసారి మా ఇంటికి వెళ్లి వస్తాను. మా అమ్మకు ఎలాగో నచ్చజెప్పి ఇక్కడకు తీసుకొస్తాను" అని బోరున ఏడ్చింది.

అంతా విన్న బాధ్యులు ముందు హతాశులయ్యారు. సదానందాన్ని పిల్చి, వాళ్లమ్మ దగ్గరికి సరోజని పంపమని చెప్పారు. పైవారం సరోజ అమ్మనాన్నని, మామగారిని తీసుకుని రమ్మన్నారు.

పై వారం సరోజ మామగారు ఒక్కరే వచ్చారు. సరోజ తల్లిదండ్రులు రామన్నారు. పైగా బాధ్యులు ఫోను చేస్తే 'ఆమె ఎవరో మాకు తెలియదు. మాకు సంబంధం లేదు.' అంటూ సరోజ తండ్రి దుర్భాషలాడి ఫోను పెట్టేశాడు.

సమస్య ఏమిటో చెప్పమంటే సరోజ మామగారు మాట్లాడుతూ.. 'నాపేరు శ్రీనివాసరావు. మా కోడలు కడిగిన ముత్యం. మాకు డబ్బు అవసరం లేదు. దీనికంతటికి కారకుడైన వాళ్ల బావ గౌరవంగా తిరుగుతున్నాడు. ఈ మొత్తం చదరంగంలో నా కోడలు పావు అయ్యింది. ఇంటాబయటా పరువు పోయింది. ఎక్కడికీ వెళ్లలేని పరిస్థితి. అతన్ని దోషిగా నిలబెట్టి, నా కోడలు తప్పులేదని రుజువు చేయండి. అదొక్కటి చేస్తే చాలు. అప్పుడు నా కోడల్ని నేను సగౌరవంగా ఇంటికి తీసికెళ్తాను" అని చెప్పి వెళ్లిపోయారు.

పై వారం సరోజ బావ పాపారావుని రమ్మని లేఖ పంపారు. రెండు వారాల వరకూ రాలేదు. ఫోను చేసినా అతని నుండి స్పందన లేదు. మూడోవారం మరో లేఖ పంపారు. పాపారావు తన ఇంటి దగ్గర స్నేహితుడిని వెంటబెట్టుకుని ఆ వారం వచ్చాడు. విషయం ఏమిటో చెప్పమని బాధ్యులు అడిగారు.

మా కోడలు కడిగిన ముత్యం. మాకు డబ్బు అవసరం లేదు. దీనికంతటికి కారకుడైన వాళ్ల బావ గౌరవంగా తిరుగుతున్నాడు. ఈ మొత్తం చదరంగంలో నా కోడలు పావు అయ్యింది. ఇంటాబయటా పరువు పోయింది. ఎక్కడికీ వెళ్లలేని పరిస్థితి. అతన్ని దోషిగా నిలబెట్టి, నా కోడలు తప్పులేదని రుజువు చేయండి. అదొక్కటి చేస్తే చాలు. అప్పుడు నా కోడల్ని నేను సగౌరవంగా ఇంటికి తీసికెళ్తాను"

"నాకు ఎటువంటి పాపం తెలియదు. నేను వాళ్లింటికి కూడా చాలా అరుదుగా వెళ్లే వాడిని. ఆమె, ఆమె కుటుంబమంతా డబ్బులు సంపాదించడానికి నాటకం ఆడారు. నన్ను కావాలని ఇరికిస్తున్నారు. నేనెలాంటివాడినో నా స్నేహితుడిని అడగండి చెప్తాడు" అని అంటుండగానే సదరు స్నేహితుడు కలగజేసుకుని "నాపేరు బలరాం యాదవ్. నాకు చాలా పేరుంది. నేను కూడా మా ఇంటి వద్ద పంచాయితీలు చేస్తాను. ఇతను ఇంటి దగ్గర తలదించితే మళ్లీ ఆఫీసుకాడే తలెత్తుతాడు. ఈ మధ్య రిటైర్ అయ్యాడు. 40లక్షల పైనే చెప్తున్నారు మీరు. అంత సొమ్ము ఉన్నట్లుగా ఆయన కనిపించడం లేదు. మామూలుగా ఉంటున్నాడు." అన్నాడు.

ఆయనకి జరిగినవన్నీ బాధ్యులు వివరించాక, సదరు స్నేహితుడు నోరు వెళ్లబెట్టాడు. ఏమో అతని గురించి నాకు తెలిసింది. మీకు చెప్పాను. మీ ఇష్టం అన్నాడు.

బాధ్యులు పాపారావుని ఉద్దేశించి మాట్లాడుతూ..." సరోజకు నలుగురు బావలు ఉంటే మీ ఒక్కరి పేరే ఎందుకు చెప్తుంది? మీరు బ్లాక్‌మెయిల్ చేశారా? లేదా?" అని గట్టిగా అడిగేసరికి.

తరువాయి 48వ పేజీలో

ఆరోగ్యం

# ఊబకాయం అనర్ధాలు

డా॥ ఎ.టి. అల్బర్టు
(ప్రకృతి వైద్య నిపుణులు, సైకాలజిస్టు)

ఆధునిక యుగంలోని అసాధారణ జీవన శైలి-ఆహారపుటలవాట్లు, అత్యధికులు ఊబకాయం బారినపడటం సర్వ సాధారణమైంది. దీనిని ఆధునిక వైద్య పరిబాషలో ఈ చెడు జీవన శైలివల్ల కలిగే ఊబకాయాన్ని "ఒబేసిటి" అంటారు. శరీరంలో చర్మం క్రిందికణాల్లో నిల్వవున్న కొవ్వువల్ల ఈ రకమైన విపత్తుకు గురౌతున్నారు. దీనివల్ల సహజ ఆరోగ్యకరమైన, సంపూర్ణ ఆనందదాయకమైన జీవన విధానానికి విఘాతం కల్గుతూ, వివిధ రకములైన మానసిక, శారీరక రుగ్మతలకు అత్యధికులు గురవుతున్నారు. అందుచేత ఈ " రుగ్మతను" చులకనగా తీసుకోకూడదు. దేశాన్ని, జాతిని, ప్రపంచాన్ని కాపాడటంలో బాధ్యతలు వహించే వారందరూ అనివార్యంగా తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

**ఊబకాయం అంటే ఏమిటి?**

సాధారణ జీవన ప్రక్రియలో కల్గే మార్పులవల్ల అధికబరువుకు గురికావటానికి కారణాలు.

1. శైశవ దశ నుండే వంశపారంపర్యమైన పెంపక విధానం, బాహ్య,బౌతికంగా అనుసరించే విధానాల వల్ల అధిక బరువుకు గురికావటం.




2. ప్రకృతిలోని జీవకోటిలో అన్నిరకాల ప్రాణులు మానవులతోపాటు, ఈ రకమైన పెరుగుదల బాల్యం నుండి వృద్ధావ్యం వరకు గురికావటం సర్వసాధారణం.

అయితే మానవ శరీర అభివృద్ధియెడల నిర్వహించిన, నిరంతర శాస్త్ర సాంకేతిక పరిశోధనల ఫలితంగా, రూపొందించిన 4 ప్రమాణాల ఆధారంగా (వయస్సు, శరీర నిర్మాణం, ఎత్తు, లింగం) తదనుగుణంగా వుండవలసిన బరువుకన్న 8-9 కిలోలు అధిక బరువు వున్న వారందరు ఊబకాయులేనని నిర్ధారితమైనది.

**అందరికి సంబంధించిన స్థూలకాయానికి కారణాలు:**

**వంశపారంపర్య లక్షణాలు :-** తరతరాలుగాను, తల్లి దండ్రుల నుండి సంక్రమించిన జీవనపు అలవాట్లు,

**స్థిరంగా కూర్చొని చేసేపనులవల్ల :-** ఆధునిక యుగంలో శాస్త్ర సాంకేతిక రంగాలు శరవేగంగా అభివృద్ధి చెందటంతో, విద్యా, వాణిజ్య, వ్యాపార, సాంకేతిక, ప్రసార, యాంత్రిక రంగాలలో అనేక సౌకర్యాలవల్ల శారీరక శ్రమ దినదిన ప్రవర్తమానంగా క్షీణించటం కూడా " స్థూలకాయానికి " కారణం. కేవలం ఆహారపు అలవాట్లలో మాత్రమే పాశ్చాత్య దేశాల ప్రజలను అనుకరించి, వారు నిర్వహించే క్రమబద్ధమైన శారీరక వ్యాయామమునకు స్వస్థి పలకటం కూడా ఈ ఊబకాయానికి కారణమవుతున్నది.

ఈ రకంగా స్థిరంగా కూర్చుని చేసే పనులవల్ల పొందిన శక్తి వినియోగంపై నియంత్రణ లోపించటం జరుగుతుంది.

**రోజువారీ పనులలో మానవ శారీరక శ్రమకు అవసరమగు శక్తిని ఈ క్రింది విధంగా నిర్ధారించడమైనది.**

**1. స్థిరంగా కూర్చొని చేసే పనులకు రోజుకు 2150 కిలో క్యాలరీలు అవసరం,**

**2. తేలికపాటి పనుల నిర్వాహణలో రోజుకు 3000కిలో క్యాలరీలు పురుషులకు. 2700 కిలో క్యాలరీలు స్త్రీలకు అవసరం.**

**3. కఠినమైన, బరువైన పనుల నిర్వహణలో పురుషులకు 4000కిలో క్యాలరీలు, ఆడవారికి 3000కిలో క్యాలరీలు, అవసరం.**

అయితే 12 నిమిషాలు జాగింగ్ కాని, గంట నడవటంకాని, అరగంట స్విమ్మింగ్‌కాని, 4 గం॥ అంట్లు కడగటం కాని, 14గంటలు టీవి వీక్షించటం కాని చేయడం ద్వారా కేవలం 200 కిలో క్యాలరీల శక్తి మాత్రమే ఖర్చు అవుతుంది. అంటే అతిశయోక్తికాదు.

**అదనంగా భోజనం చేయటం వల్ల:-** ఆచార, సాంప్రదాయాలవల్లనో, లేదా రుచికరమైన వంట వల్లనో, మిగిలి పోతుందనో, తదితర నెపాలతో అదేపనిగా భోజనం అదనంగా తినటం జరుగుతుంది. అంటే అవసరం కన్నా అదనంగా లాగించటం' ఈ రకమైన భోజనపుటలవాటు అంటే శరీర అవసరం కన్నా, నిజంగా కల్గిన అకలికన్నా అదనంగా పొట్టలో నింపటం ఇలాంటి చర్యల వల్ల శరీరంలో రోజుకు 50కిలో క్యాలరీల చొప్పున సంవత్సరంలో 4 పౌండ్లు (2కిలోలు) బరువు అధికంగా పొందుతారు. కావున దీనిని ఖచ్చితంగా నివారించుకోవాలి.

**అధిక జాగ్రత్తలవల్ల :** అనారోగ్య కారణాల వల్లకాని, చిన్నచిన్న శస్త్ర చికిత్సలవల్లకాని మరే కారణాలవల్లకాని విశ్రాంతిలో వుండగా అవసరం కన్నా అధికంగా పౌష్టికాహారం తీసుకోవటం కూడా అనర్ధదాయకం.

**జబ్బులు :** కష్టిమెసిన్ సిండ్రోం

వల్లకూడా స్థూలకాయం వస్తుంది.

**హార్మోన్ల అసమాన్యత వల్ల:-** శరీర నియంత్రణకు అవసరమైన హార్మోన్లకన్న అనవసరమైనవి అధికంగా శరీరంలో చేరటం వల్ల హార్మోన్ల అసమానతకు దోహదం చేసి, స్థూలకాయం పెరుగుదలకు తోడ్పడుతుంది.

**మద్యం సేవించటంవల్ల :** విందులు, వినోదాల్లో అధికంగా మద్యం సేవించటంవల్ల అదనంగా భోజనం చేయటం కూడా ఈ స్థూలకాయం పెరగటానికి దోహద పడుతుంది.

**మందులవల్ల :** అవసరం కన్నా అదనంగా టానిక్కులు, విటమిన్ల బిళ్లలు, పౌడర్లు, ఇత్యాదివాటివల్ల అనవసరమైన శక్తి పోగవ్వటం కూడా స్థూలకాయానికి కారణం అవుతుంది. అందుచేత నిర్ధారిత, అవసరం మేరకే వాడుకోవటం జరగాలి.

**2. మహిళలకు వర్తించే కారణాలు:**

1. అధికంగా భోజనం చేయటం, స్థిరంగా నిలకడగా కూర్చొని పనిచేయటం బరువు పెరుగుదలకు కారణం.

2. తరచుగా వాడే కాంట్రా సెప్టిక్ బిళ్ళల వల్ల, అధిక బరువు పెరగటంతో ఊబకాయానికి దారితీస్తుంది.

3. ఆరోగ్యకరమైన మహిళ గర్భదారణ సందర్భంలో 10-13కిలోల బరువు, సాధారణం కంటే అధికంగా పొందటం జరుగుతుంది. అయితే ప్రసవానికి ముందు తరువాత అధిక జాగ్రత్తవల్ల శారీరక శ్రమలేని ఈ కాలంలో పౌష్టికాహారం పరిమాణంలో అధికం, ప్రమాణంలో లోపంతో కూడినది తీసుకోవటంవల్ల దీని ప్రభావం జీవితాంతం వుంటుంది.

**ఫలితంగా కల్గే బాధలు - రోగాలు:** పై వాటి పర్యవసానంగా అనేక వ్యాధులు, రోగాలు అనగా వారికోస్ వెలాయిక్, హెర్నియా హైపర్ క్లోస్ట్రేమియా, కండరాలనొప్పి, వారికోస్ వెన్స్, బిపి, గుండె జబ్బు/పోటు, మధుమేహం, కీళ్ళనొప్పులు, ఎముకలు అరగటం, గాలిబ్లాడర్‌లో రాళ్ళు, కిడ్నీలలో రాళ్ళు, థైరాయిడ్, రొమ్ము, మర్మాంగ,( కొలన్) గొంతు మెదలగు క్యాన్సర్లు, గర్భం నిలబడకపోవటం, చూపుకోల్పోవటం, అస్థమా మొదలగు వాటితోపాటు మానసిక రుగ్మతలకు కూడా గురవ్వవచ్చు.

**సహజ పద్ధతుల్లో నివారణ చర్యలు:**

**1.ప్రివెన్షన్ /నివారణ:-** శరీర బరువు అమాంతం గాలిలోనుండి పెరగదనేది ప్రథమంగా గుర్తించాలి. అది మనం తినే అహారం నుండి మాత్రమే పెరుగుతుంది. అందుచేత బతకటం కోసం తినటం తప్ప తినటం కోసం బతకటం కాదనే విధంగా మన మైండ్ సెట్‌ను మార్చుకోవాలి. కాబట్టి సరైన, అవసరమైన, మితంగా, హితంగా వున్న ఆహారం మాత్రమే తీసుకోవాలి. తదనుగుణంగా శారీరక శ్రమ చేయటంకూడా అనివార్యం.

**2. ఆరోగ్యకరమైన పూర్వపు స్థితికి చేరుకోవటం :** పూర్వపు స్వస్త స్థితికి, యిప్పుడున్న ''అస్వస్థత'' నుండి చేరుకోవటం. దీనికై సులభమైన దగ్గర మార్గాలు ఏమిలేవు. క్రమంగా బరువు పెంచుకొన్నట్లుగానే తగ్గించుకొనే ప్రక్రియ చేయాలి. ఈ సందర్భంగా ఎలాంటి అవాంతరాలకు గురికాకుండా జాగ్రత్తపడాలి. ఈ సందర్భంగా, ఈ క్రింద వివరించిన రోజువారి దినచర్య వల్ల ఆరోగ్య దశకు చేరుకోవటానికి కృషి చేయవచ్చు. అయితే యిప్పటికే, ఈ ఊబకాయం వల్ల బాధపడుతూ, మందులు లేక ట్రీట్‌మెంటు చేయించుకొంటున్నవారు, నిపుణులైన వైద్యుల సలహా సంప్రదింపులతో దైనందిన చర్యలను ఆచరించాలి తప్ప, స్వంతగా ఎలాంటి చర్యలకు పూనుకోకూడదు.

ఈ క్రింది దిన చర్యలవల్ల పూర్వపు స్థితికి చేరుకోవటానికి సూచనలు

- ప్రాతఃకాలం 5గం॥లకు నిద్ర లేవటం 2-3 గ్లాసుల నీరు త్రాగటం పళ్ళు శుభ్రం చేసుకొని, 15 నిమిషాల పాటు (కనీసం) నడవటం తరువాత కాలకృత్యాలు తీర్చుకోవటం.

- ఉదయం : 5.30గం॥- 6.30గం॥లకు యోగాసనాలు, ప్రాణాయామం చేయటం అలవర్చుకోవాలి.

- ఉదయం : 7గం॥లకు వేడి రాగిజావ (మాల్ట్) బార్లీ నీళ్ళు ఒక్కొక్కటి 200మి.లీ. చొప్పున తీసుకోవటం.

**ఉదయం : 10గం॥లకు భోజనం:-** ఏదోఒక రకమైన తృణధాన్యాలతో చేసిన 2.జొన్నరొట్టెలు (లేదా) రాగి లేదా సజ్జ రొట్టెలు, లేదా 200గ్రాముల రాగి సంకటి లేదా కొర్ర ఖిచిడి లేదా 200గ్రాముల ధాలియా (గోధుమరవ్వతో కూరగాయలు వేసిన) లేదా 2 పుల్కాలు, లేదా 200గ్రాముల దంపుడుబియ్యంతో చేసిన ఖిచిడి గాని తీసుకోవాలి. (ఏదో ఒకటి మాత్రమే)

- 300 గ్రాములు ఉడికించిన కూరగాయలు, నూనె, పప్పు, తక్కువ పరిమాణాల్లో వుండి, ఆవాలు, జిలకర్ర, ఆకుకూరలతో కూడినది మరియు 200గ్రాములు తాజా పెరుగు ఒక కప్పు

-మధ్యాహ్నం 1.30గం॥లకు 2 సీజనల్ పండ్లు, 200 గ్రాముల వెజిటెబుల్ సలాడ్, 50గ్రాముల మొలకెత్తిన గింజలు, (25గ్రాముల పెసళ్ళుకాని, నువ్వులుకాని రెండిటిలో ఎదో ఒకటికాని,)

మధ్యాహ్నం 4గం॥లకు కూరగాయల జ్యూస్ (క్యారెట్, బీట్‌రూట్, చౌబౌ (బెంగుళురు వంకాయ), టమాట లేదా దోసకాయ, బూడిదగుమ్మడికాయలలో ఎదో ఒకటి 200మి.లి. మాత్రమే.

**-రాత్రి 7గం॥ (డిన్నర్):-** 2 పుల్కాలు, 300 గ్రాముల ఉడికించిన కూరగాయలు, నూనె రహిత ఉప్పు రహిత, ఆవాలు, జీలకర్ర, కరివేపాకులతో కూడినవి, 100 గ్రాముల ఉడికించిన ఆకు కూరలు, నూనెలేని, 250 మి.లి. చిలికిన మజ్జిగ తీసుకోవాలి.

9.30గం॥:- ఒక కప్పు మీగడరహిత వేడిపాలు.

-రాత్రి 10గం॥లకు నిద్రకు ఉపకరించాలి.

**అతిముఖ్యమైన అంశాలు.**

- 8-10 గ్లాసుల నీరు ప్రతిరోజు త్రాగాలి.

- ఆకలేసినప్పుడల్లా, మొలకెత్తిన గింజలు కాని, కూరగాయల సలాడ్‌గాని తీసుకోవాలి. (ఆకలితో మాత్రం వుండకూడదు.)

రోజంతా చురుకుగా వుల్లాసంగా వుండండి.

ఆల్ దిబెస్ట్ !!

# ఉద్యమాల బాటలో

**పోరాటవిజయం :** హైదరాబాద్‌లోని సింగరేణి కాలనీలో



హైదరాబాద్

30 ఏళ్ళుగా పేదలు నివాసముంటున్నారు. అనేక రకాల వృత్తులు చేసుకుంటూ రోజు వారీగా వచ్చే వేతనాలతో కాలం గడుపుతున్నారు. పేదలు నివసిస్తున్న స్థలంపై కన్నేసిన కబ్జాదారులు సొసైటీ పేరుతో ఆ స్థలం రిజిష్టర్ అయివుందని చెప్తూ వాళ్ళను ఖాళీ చేయించడానికి ప్రయత్నించారు. కోర్టుకెక్కారు. అయితే పేదలు వామపక్ష పార్టీలు మరియు ప్రజా సంఘాల అండతో పోరాట కార్యక్రమాలు చేపట్టారు. నెల రోజులపాటు రిలే నిరహారదీక్షలు చేయడంతో పాటు సంబంధిత అధికారులందరికి మెమెరాండమ్స్ ఇచ్చారు. చివరకు హైకోర్టు కూడా గుడిసెవాసులను తొలగించ వద్దని తీర్పు ఇవ్వడంతో సింగరేణి కాలని ప్రజల ఆందోళన విజయవంతమయింది.

**సిలండర్ల సరఫరాలో గత పద్దతినే కొనసాగించాలి:**

వంట గ్యాస్‌ను ఆధార్‌కు అనుసంధానం చేసిన తరువాత వినియోగదారుడు అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. సిలిండర్‌కు 1090 చెల్లించాల్సి వస్తుంది. 435రూ॥ వినియోగదారుల ఖాతాకు జమచేస్తామని చెప్పారు కానీ. అనేక



అనంతపురం



తూ॥గోదావరి

మంది వినియోగదారులకు సబ్సిడి అందడంలేదు. బ్యాంక్ ఖాతాలు తెరవడంలో కూడా అనేక అవకతవకలు జరిగినట్లు తెలుస్తుంది. ప్రభుత్వం ఇచ్చే సబ్సిడి ఇవ్వక పోవడంతోపాటు, వ్యాట్ కూడా తోడవడంతో పేద, మధ్య తరగతి ప్రజానీకం తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు. అస్తవ్యస్తంగా మారిన ఈ స్థితినుండి బయటపడాలంటే సిలిండర్ల సరఫరాలో గతంలో అనుసరించిన పద్ధతిని కొనసాగించాలని ఐద్వా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తుంది. ప్రభుత్వం సిలండర్లపై సబ్సిడీని కొనసాగించాలని కోరుతుంది. తూర్పు గోదావరి జిల్లా కాకినాడతో పాటు రాష్ట్రంలోని అన్ని జిల్లాకేంద్రంలోని పౌరసరపరాల కార్యలయాలముందు ధర్నాలు జరిగాయి. అధికారులకు వినతి పత్రాలు ఇచ్చారు.



ప్రకాశం

**సీమాంధ్రలో ప్రజా పంపిణీని క్రమబద్దీకరించాలని కోరుతూ:** సమైక్యాంధ్ర ఉద్యమం నడుస్తున్న సీమాంధ్ర ప్రాంతంలో 13జిల్లాలో ఎన్‌జీవోలతో పాటు ఆర్టీసి, టీచర్స్, విద్యుత్, రవాణా ఉద్యోగులతో పాటు రేషన్ డీలర్స్‌కూడా సమ్మెలో పాల్గొన్నారు. దీంతో ప్రజా పంపణీ వ్యవస్థ అస్థవ్యస్తమై రేషన్ షాపులు తెరుచుకోలేదు.

కొద్ది మంది డీలర్‌లు డీ.డీలు తీసినా వాటిని అందుకోవడానికి అఫీసుల్లో సిబ్బంది లేకపోవడంతో రేషన్ సరుకులు ఎక్కడికక్కడే అగిపోయాయి. రోజు కూలి చేసుకునే పేదలు పని దొరక్కపోవడంతో పాటు రేషన్ సరుకులు కూడా అందక తీవ్ర ఇబ్బందులు పడ్డారు. ఐద్వా వ్యవసాయకార్మిక సంఘాన్ని కలుపుకుని రౌండ్‌టేబుల్ సమావేశాన్ని నిర్వహించడంతో పాటు రాష్ట్ర సివిల్ సప్లయి కార్యాలయం ముందు ధర్నా నిర్వహించింది. కమీషనర్‌ను కలిసి మెమోరాండం ఇచ్చింది. రేషన్ సరుకుల పంపిణికి అన్ని రకాల చర్యలు తీసుకుంటామని కమీషనర్ వాగ్దానం చేశారు. జిల్లాల్లో కలెక్టర్లను కలిసి ఐద్వా ధర్నాలు నిర్వహించి కలెక్టర్‌కు వినతిపత్రాలు యిచ్చింది. ఐద్వా ఆందోళన ద్వారా జిల్లా కలెక్టర్ మరియు అధికారులు ప్రత్యేక చర్యలు చేపట్టి రేషన్ సక్రమంగా పంపిణీ అయ్యేలా చర్యలు చేపట్టారు. .

పొదుపుగ్రూపు మహిళలకు వడ్డీలేని రుణాలు




రాష్ట్రంలోని పేద మహిళల ఆర్థికాభివృద్ధి కోసం ప్రభుత్వం వడ్డీలేని రుణాలు ఇస్తానని చెబుతున్నది. కాని నగరంలోని పేద మహిళలు పెరుగుతున్న ధరలు, విద్య, వైద్యం అవసరాల కోసం ప్రైవేట్ ఫైనాన్స్ సంస్థలపై ఆధారపడవలసి వస్తుంది.

పొదుపు గ్రూపుల మహిళల్లో ఎక్కువగా ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ వర్గాల వారు ఉన్నారు. వీరికి ప్రభుత్వం నుండి ప్రత్యేక లోన్లు, పథకాలు అందడం లేదు. ప్రభుత్వం ముందు పావలా వడ్డీ అని చెప్పింది. కాని ఆచరణలో బ్యాంక్ వారు అదనంగా 12 పైసలు పెంచారు. ఆ తరువాత వడ్డీలేని రుణం ఇస్తామని ఆచరణలో ఒక రూపాయి నుండి రెండు రూపాయిల వరకు వడ్డీ వసూలు చేస్తున్నారు.

గతంలో బ్యాంకులు ఏ షరతులు లేకుండా గ్రూపు హామీలతో లోన్స్ ఇచ్చేవారు. ఇప్పుడు సమాఖ్యలు ఏర్పడిన తరువాత ఒక గ్రూపు కట్టక పోతే మిగతా గ్రూపులకు రుణం మంజురు చేయటం లేదు. ఒక గ్రూపులో ఎవరైనా బకాయి ఉన్నా లోను ఇవ్వటం నిలుపుదల చేస్తున్నారు. లక్ష రూపాయలు లోను శాంక్షన్ అయితే రూ. 10వేలు డిపాజిట్ తీసివేసి మొత్తం లక్ష రూపాయిలకు అసలు వడ్డీ వసూలు చేస్తున్నారు.

పెన్షన్‌లు, స్కాలర్‌షిప్‌లు రావడం లేదు. గ్యాస్‌లు ఇవ్వడం లేదు. కార్పొరేటర్స్ కోటా క్రింద ఐ.ఎస్.ఓ. ఇస్తున్నారు. అవి వార్డు మెంబర్స్ పంచుకుంటున్నారు. సభ్యులుగా ఉన్న మహిళలకు గ్యాసులు రావడం లేదు. ముఖ్యంగా పొదుపు గ్రూపు మహిళలకు సమాఖ్యల ద్వారా గ్యాసులను ఇవ్వాలి. ఇన్సూరెన్స్ పేరుతో పొదుపు గ్రూపుల మహిళల వద్ద అధిక మొత్తంలో డబ్బు వసూలుచేసి వారిని మోసపుచ్చుతున్నారు. పొదుపు గ్రూపు సభ్యులకు వృత్తి శిక్షణ, మార్కెటింగ్ సౌకర్యాలు కల్పించటం లేదు. బ్యాంకువారు సరైన సమాచారం ఇవ్వక పోవడంతో లోన్‌లు వాడుకోక ముందే వడ్డీ కట్టాల్సి వస్తున్నది. కనుక పొదుపు గ్రూపుల మహిళల సమస్యలను పరిష్కరించాల్సిందిగా ఐద్వా గ్రేటర్ హైదరాబాద్ సెంట్రల్ కమిటీ ఆధ్వర్యంలో రౌండ్‌టేబుల్ సమావేశం మరియు నల్గొండలో 3,000మంది మహిళలతో ధర్నా జరిగింది.



మహిళలపై అత్యాచారాలకు అంతేలేదా?

దేశంలో, రాష్ట్రంలో మహిళలపై, బాలికలపై రోజురోజుకూ అత్యాచారాలు, హింస తీవ్ర రూపం దాలుస్తున్నాయి. రాజస్థాన్ రాష్ట్రంలో ఆశారాం బాపు 16సం॥ల అమ్మాయిపై లైంగికదాడికి పూనుకోవడం సమాజానికి తలవంపుగా వుంది. ఆయనకి బి.జె.పి.



నాయకుల అండదండలు బాగా ఉన్నాయి. పేరు ప్రతిష్టలున్న స్వామీజీగా బిజెపి ప్రచారం చేసింది. రాజస్థాన్ ముఖ్యమంత్రి కూడా ఈ స్వామీజీకి వ్యతిరేకంగా ఎలాంటి చర్యలు తీసుకోవడం లేదు. ఎంత పెద్ద అండదండలున్నా ఇటువంటి దోషులను వదిలిపెట్టకూడదు. కఠినంగా శిక్షించాలని డిమాండ్ చేస్తూ ఐద్వా అన్ని జిల్లాల్లో కార్యక్రమాలు చేపట్టింది.

ముంబాయిలో పత్రికా మహిళా ఫోటోగ్రాఫర్‌ను గ్యాంగ్ రేప్ చేశారు. జార్ఖండ్‌లో ఒక మహిళా కానిస్టేబుల్‌ను గ్యాంగ్ రేప్ చేశారు. చండిగడ్‌లో ఒక అమ్మాయిని గ్యాంగ్ రేప్ చేశారు. ఇలా ప్రతిరోజు, ప్రతినిముషం మహిళలు, పసిపిల్లలను అత్యాచారాలకు గురవుతున్నా ప్రభుత్వాలు నిమ్మకు నీరెత్తిన్నట్లు వ్యవహరిస్తున్నాయి. దోషులను పాస్ట్‌ట్రాక్ కోర్టుల ద్వారా విచారించి కఠినంగా శిక్షించాలని ఐద్వా కోరుతుంది.

**చట్టసభల్లో రిజర్వేషన్ల కోసం:–** మహిళా రిజర్వేషన్ బిల్లును



మహబూబ్‌నగర్




హైదరాబాద్

చట్టసభల్లో వెంటనే ప్రవేశపెట్టాలని డిమాండ్ చేస్తూ ఐద్వా ఆధ్వర్యంలో మహబూబ్‌నగర్, హైదరాబాద్‌లతోపాటు అన్ని జిల్లాల్లో కార్యక్రమాలు జరిగాయి. దేశ వ్యాప్తంగా మహిళలు 14 సం॥రాల నుండి మహిళా రిజర్వేషన్ బిల్లు కోసం ఎదురుచూస్తున్నారు. అనేక ప్రజావ్యతిరేక బిల్లులు పార్లమెంటు ఆమోదం పొందుతున్నప్పటికీ మహిళా బిల్లుకు మాత్రం అలక్ష్యం చేస్తున్నారు. మహిళా ఉద్యమాలవల్ల 2010లో బిల్లు రాజ్యసభలో ఆమోదం పొందినప్పటికీ లోక్‌సభలో అడుగుపెట్టలేదు. శీతాకాల పార్లమెంట్ సమావేశాల్లో బిల్లు ఆమోదించి 2014 సార్వత్రిక ఎన్నికల్లో మూడోవంతు స్థానాలు మహిళలకు కేటాయించేలా చర్యలు తీసుకోవాలిన ఐద్వా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తుంది.

---

**43వ పేజీ తరువాయి**

"వాళ్లని రుజువు చేయమనండి. నేను దేనికైనా సిద్ధమే" అన్నాడు పాపారావు.

సరోజ, సదానందంను "ఏమైనా ఆధారాలున్నాయా?" అని అడిగితే ఏమీ లేవన్నారు. "ఎవరెవరి దగ్గర అప్పులు తెచ్చామో వాళ్లని తీసుకొస్తామన్నారు."

"సదానందం! ఆధారాలు లేకుండా, అప్పులోళ్లని తీసుకొచ్చి ఏం లాభం? వాడిని దోషిగా నిలబెట్టడం సాధ్యంకాదు కదా! అయితే ఈ కేసును మహిళా కమిషన్‌కు పంపిస్తాం. వాళ్లయితే వాళ్లకున్న అధికారాలతో పాపారావుపై చర్య తీసుకోవడానికి వీలవుతుంది. మేము కూడా అక్కడి బాధ్యులకు విషయం తెలుపుతూ లేఖ రాసిస్తాము. ఇప్పటికైనా మూఢభక్తిలో మునిగితేలితే ఎంత నష్టమో మీకు అర్థమై ఉంటుంది" అనగానే అవును' అన్నారు. "మీ అమ్మగారిని ఇక్కడికి తీసుకురండి మేము ఆవిడకి నచ్చజెబుతాం. జరిగినదంతా ఒక ఎత్తయితే ఇంటికి, పిల్లలకి దూరంగా మీరిలా అజ్ఞాతవాసం గడపడం మరింత బాధాకరం. ప్రస్తుతం సరోజ మానసిక స్థితి చాలా ప్రమాదకరంగా ఉంది. ఆమెను వెంటనే మానసిక నిపుణులకి చూపించాలి. మీరంతా కలిసి ఉంటే ఆమె చాలా వరకూ కోలుకుంటుంది. దాంతో పూర్వంలా మీరంతా ఆనందంగా ఉండొచ్చు." అని బాధ్యులు నచ్చజెప్పారు.

" మా అమ్మను కలిసి ఉందామని బతిమిలాడుకుంటానమ్మా! ఒకవేళ మా అమ్మ ఒప్పుకోకపోతే, నా భార్య బిడ్డల్ని తీసుకుని దూరంగా వెళ్లి ఉంటాను. అయితే వాడి పై మహిళా కమిషన్‌కు ఫిర్యాదు చేస్తాను! అక్కడ ఎంతవరకు న్యాయం జరుగుతుందో చూస్తాను" అని బాధ్యులకి ఇద్దరూ నమస్కరించి వెళ్లిపోయారు.

జీవన సరళిలో వస్తున్న మార్పులు మహిళల్లో పెరుగుతున్న వత్తిడి, దాని నుండి స్వాంతన కోసం ఏదో ఒక స్వామిజి చెంతకు చేరితే ఒళ్లు, ఇల్లు గుల్లకావటం నేడు మనం తరచూ వింటున్నాం, చూస్తున్నాం. ఆధ్యాత్మిక ముసుగులో జరుగుతున్న అనేక నేరాలు, ఘోరాలకు మచ్చుతునక నేటి సరోజ గాథ!

# అమ్మకో లేఖ అమ్మాయికో వీలునామా

అమ్మా !
ఆడపిల్లకి అణకువే ఆభరణం అన్నావు
పిరికి మందు నూరిపోశావు
ఎవడిపాపం వాడిని కట్టి కుదుపుతుందన్నావు
నా నోరు, చేతులు కట్టేశావు
అత్తారింట్లో పుట్టింటి గౌరవం కాపాడాలని
ఊరంతా నా సహనశక్తి శ్లాఘించాలని
వంచిన నా తల పైకెత్తకుండా
వంగిన నా నడుం నిటారుగా నిలబడకుండా
అత్తమామలను, ఆడబిడ్డలను ఎలా
గౌరవించాలో నూరిపోశావు
మొగుడనే వాడి దగ్గర ఎలా ఎలా
పడివుండవచ్చో ఉగ్గు పాలతో నేర్పావు
తరతరాల వారసత్వంగా అదే నాకు
ఆరణంగా ఇచ్చావు
నువ్వు ఆచరించి చూపావు
'మాయమ్మ సీతమ్మ'
'ఆయమ్మ సహనశీలి' అంటుంటే అంతానిన్ను
నీ కంటే నేనే ఎక్కువ మురిసిపోయాను
తల్లిని చూసి బిడ్డను చెప్పవచ్చు
అంటే ఏమిటో అనుకున్నాను!!

ఇప్పుడు నేనూ అమ్మనయ్యాక తెలిసింది
నువ్వునాకు నేర్పినదంతా పిరికితనమని
నీ అమాయకత్వమని-అది
నాలోని రోషాన్ని హరించిందనీ
నా ఆత్మ గౌరవాన్ని నిలబెట్టలేకపోతుందని
పిల్లి అయినా పులి అయినా
తన పిల్లలకి తిరగబడ్డం నేర్పుతుందే?
మరి-నువ్వేందుకు నాకు తిరగబడ్డం నేర్పలేదు?
నీ సహనం వెనుక ఇంత హింస ఉందనీ
అదినువ్వు నీ రెప్పల మాటున దాచుకున్నావనీ.
ఇపుడు... ఇపుడే అర్థం అవుతూంది !!
అమ్మా నన్ను క్షమించు
ఒక చెంపను కొడితే
కన్నీళ్ళతో రెండో చెంపను చూపడం కాదు
కాళికలా గుడ్లురమాలనుకుంటున్నా
హింస అంటూ ఎదురైతే తిరగబడమంటున్న
వేదన అంటూ గుండె భారమైతే
ఆత్మీయులతో పంచుకోమంటున్నా
యుగాలు మారి పోతున్నపుడు
ధర్మాలూ మారిపోతాయి
ఇపుడు ఆడపిల్లకి కావల్సింది
ఆభరణాలు కాదు ఆయుధాలు
ఆత్మ గౌరవం కాపాడుకోవడం
అందుకే ఈ పోరాటం
తప్పట్లేదు ఈ తిరుగుబాటు!!!

– ఆర్. దుర్గా ప్రసన్న

Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : T.Jyothi

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A141 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |